


చెన్నపురి :

ప్రకృత ముద్రాక్షరాంకితులు

పిడుగు - సుబ్బరామయ్యగారి పౌత్రుండును

పిడుగు - వెంకటరావుగారి పుత్రుండును

హిందూరత్నాకర ముద్రాక్షర శాలాధికారుడు నగు

పిడుగు - వెంకటకృష్ణారావు పంతులుగారిచే

ముద్రితము.




| విషయము. | సంఖ్య. | విషయము. | సంఖ్య. |
|---|---|---|---|
| సోమరోగనిదానము | 16 | లోహితక్షయాలక్షణము | 27 |
| సోమరోగలక్షణము – మరియునిరుక్తి | ,, | పరిప్లుతాలక్షణము | ,, |
| మూత్రాతిసారము | 17 | ఉపప్లుతాలక్షణము | 28 |
| సోమలక్షణము | | విప్లుతాలక్షణము | ,, |
| సోమరోగచికిత్స | ,, | కర్ణినీలక్షణము | ,, |
| తాలకందాదిచూర్ణము | ,, | సాన్నిపాతికీలక్షణము | 29 |
| చక్రమర్దకకల్కము | 18 | యోనివ్యాపనిదానము | ,, |
| సోమారిరసము | ,, | యోనివ్యాపచికిత్స | 30 |
| కదలిఫలయోగము | ,, | వాతసామాన్యచికిత్స | ,, |
| కదలీకందఘృతము | ,, | యోనిరోగమునందు బలాతైలాద్యుపయోగము | " |
| సోమరోగప్రమేహ పిటికారోగవివరణము | 19 | యోనిరోగమునందు వమనాదికర్మలు | 31 |
| స్త్రీరోగాంతర్గత ఆర్తవదోషము | 20 | వచాద్యావలేహము | ,, |
| శుద్ధార్తవలక్షణము | ,, | యోనిరోగమునకు కాశ్మర్యాది ఘృతం | ,, |
| యోనిరోగములు | 21 | రాస్నాదికషాయము | 32 |
| ఉపద్రవములయొక్కనిదానము | ,, | యోనిశూలహరపిచువు | ,, |
| వాతజయోనిరోగనిదానము | 22 | వాతయోనికై సామాన్యోపాయము | ,, |
| పిత్తజయోనిరోగనిదానము | ,, | బిల్వాదికల్కము | 33 |
| శ్లేష్మజయోనిరోగనిదానము | 23 | యోని రోగమునకు వృషకాదికల్కపానము | ,, |
| వాతకీలక్షణము | ,, | వాతయోనివ్యాపచికిత్స | ,, |
| అతిచరణయోనిలక్షణము | 24 | ఉపకుంచికాదిపానము | ,, |
| ప్రాక్చరణాలక్షణము | ,, | యోనిరోగమునకు జీవనీయక్షీరపానము | 34 |
| ఉదావృత్తాలక్షణము | ,, | యోనిరోగమునకు బలాదితైలము | ,, |
| జాతఘ్నీలక్షణము | 25 | యోనిదాహచికిత్స | ,, |
| అంతర్ముఖీలక్షణము | ,, | పిత్తయోనిరోగమునకు సామాన్యచికిత్స | 35 |
| సూచీముఖీలక్షణము | ,, | రెండవచికిత్స | ,, |
| శుష్కాఖ్యాలక్షణము | " | శ్లేష్మయోనిచికిత్స | ,, |
| వామినీలక్షణము | 26 | రక్తయోనిచికిత్స | ,, |
| షండలక్షణము | ,, | యోగరోగమునకు ధాతక్యాదితైలము | 35 |
| మహాయోనిలక్షణము | ,, | | |
| పైత్తికీలక్షణము | ,, | | |
| రక్తయోనిలక్షణము | 27 | | |
| శలయిష్మికీలక్షణము | | | |

| విషయము. | సంఖ్య. | విషయము. | సంఖ్య |
|---|---|---|---|
| యోనిరోగమునకు యవానాన్యాద్యుప యోగము | 36 | యోనిరోగవ్రణాదులకు న్యగ్రోధాది కషాయము | 44 |
| యోనిరోగమునకు కాసీసాది చూర్ణము | ,, | న్యగ్రోధాది ఘృతము | 45 |
| యోనిరోగమునకు పలాశాది చూర్ణము | 37 | సోమఘృతము | 46 |
| యోనిదౌర్గంధ్యమునకై చికిత్స | ,, | త్రిఫలా త్రివృతాది ఘృతము | 47 |
| కఫదుష్టయోనికై సామాన్యప్రక్రియ | ,, | యోనిరోగములకు ఫలఘృతము | ,, |
| రెండవ చికిత్స | ,, | యోనిశూలకుచికిత్స | 48 |
| వాతదుష్టయోనిచికిత్స | 38 | రెండవచికిత్స | ,, |
| ప్రస్రంసినియోనికై ఉపచారము | ,, | ప్రదరరోగవివరణము | 49 |
| యోనిపూయస్రావచికిత్స | ,, | ప్రదరరోగచికిత్స | ,, |
| యోనికందూపచారము | ,, | యోని ఘట్టిపడుటకు లేపము | ,, |
| యోనిస్రావచికిత్స | 39 | స్త్రీలకు వస్తికర్మచేయునట్టి క్రమము | 50 |
| అన్యచ్చ | ,, | స్త్రీలకు వస్తికి స్నేహప్రమాణము | ,, |
| సన్నిపాతయోనిరోగమునకు చికిత్స | ,, | శోధనద్రవ్యములచే వస్తివిధానము | ,, |
| అన్యచ్చ | ,, | శరీరదౌర్గంధ్యము తొలుగుటకై లేపము | 51 |
| నష్టార్తవచికిత్స | ,, | అన్యచ్చ | ,, |
| రజోదర్శనోపాయము | 40 | వర్ణకఘృతము | 52 |
| అన్యచ్చ | ,, | వంధ్యాదులకు ఫలఘృతము | ,, |
| అన్యచ్చ | ,, | కుమారకల్పద్రుమఘృతము | 53 |
| రజోత్పాదక ఉపచారము | ,, | ఫలకల్యాణఘృతము | 56 |
| యోనికందనిదానము | 41 | బృహచ్ఛతావర్యాది ఘృతము | 57 |
| వాతయోనికందలక్షణము | ,, | మంజిష్ఠాది ఘృతము | 58 |
| వాతయోనికందచికిత్స | ,, | లఘుఫలఘృతము | ,, |
| అన్యచ్చ | ,, | **ద్వితీయాశ్వాసము.** | |
| పిత్తయోనికందనిదానము | 42 | గర్భిణీజ్వరచికిత్స | 60 |
| కఫయోనికందనిదానము | ,, | రెండవచికిత్స | ,, |
| సన్నిపాతాత్మకయోనికందనిదానము | ,, | మూడవచికిత్స | ,, |
| గుడూచ్యాదివర్తి | ,, | పిత్తజ్వరచికిత్స | 61 |
| అన్యచ్చ | 43 | విషమజ్వరచికిత్స | ,, |
| యోనికందరోగము గర్భజరోగము వీటి నిదానము | ,, | సంగ్రహణీజ్వరచికిత్స | ,, |
| | | రెండవచికిత్స | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| ఛర్ద్యతీసారచికిత్స | 61 |
| కాసశ్వాసచికిత్స | 62 |
| గర్భిణీస్త్రీకి వమనచికిత్స | ,, |
| శ్వాసకాసచికిత్స | ,, |
| గర్భిణీవాతచికిత్స | ,, |
| గర్భిణీస్త్రీకిగలిగెడి వాపులకు చికిత్స | 63 |
| రెండవచికిత్స | ,, |
| గర్భవిలాసరసము | ,, |
| గర్భిణీస్త్రీకి అగ్నిదీపనౌషధము | ,, |
| గర్భశూలచికిత్స | 64 |
| గర్భవేదనాచికిత్స | ,, |
| ఆనాహవాయుచికిత్స | ,, |
| గర్భిణీస్త్రీకి మూత్రావరోధచికిత్స | ,, |
| తృణపంచమూలము | ,, |
| అతిసారచికిత్స | 65 |
| గర్భిణీస్త్రీకి శూలశమనచికిత్స | ,, |
| గర్భిణీస్త్రీకి ప్రథమమాస గర్భచలన చికిత్స | ,, |
| ద్వితీయమాసచికిత్స | 66 |
| తృతీయమాసచికిత్స | ,, |
| చతుర్థమాసచికిత్స | ,, |
| పంచమమాసచికిత్స | 67 |
| షష్ఠమమాసచికిత్స | ,, |
| సప్తమమాసచికిత్స | ,, |
| అష్టమమాసచికిత్స | ,, |
| నవమమాసచికిత్స | 68 |
| గర్భపతనమునకు కారణము | ,, |
| స్రావము పాతములు | ,, |
| గర్భిణీస్త్రీ అభిఘాతాదుల వర్జించుట | ,, |
| గర్భపాతమునందు గలిగెడి వుపద్రవములు | 69 |
| స్థానాంతర గర్భోపద్రవములు | ,, |
| స్రావపాతములయందు మాసక్రమముగ పన్నెండు మాసముల వరకు చికిత్స | 69 |
| గర్భకోశమువలన గలిగెడి రక్తస్రావ చికిత్స | 71 |
| ఉత్పలాదిగణము | ,, |
| గర్భపాతమునకై చికిత్స | ,, |
| రెండవచికిత్స | 72 |
| మూడవచికిత్స | ,, |
| నాలవచికిత్స | ,, |
| గర్భిణీ రక్తపాత చికిత్స | , |
| గర్భచలననివారణచికిత్స | 73 |
| మూఢగర్భనిదానము | ,, |
| మూఢగర్భము యెనిమిది విధములు | ,, |
| అసాధ్యమూఢగర్భము | 74 |
| గర్భమరణహేతువు | ,, |
| గర్భిణికి రెండవ అసాధ్యలక్షణము | ,, |
| పరిఘగర్భలక్షణము | 75 |
| వికృతాకృతిగర్భలక్షణము | ,, |
| యోనిసంవరణవ్యాధినిదానము | ,, |
| వాతసంకుచితవ్యాధి శమనోపాయము | 76 |
| పాతశుష్కగర్భచికిత్స | ,, |
| నాగోదరమను గర్భలక్షణము | 77 |
| సుఖప్రసవోపాయము | ,, |
| సుఖప్రసవచికిత్స | ,, |
| రెండవచికిత్స | 78 |
| సుఖప్రసవరక్ష | ,, |
| సుఖప్రసవమునకు రక్ష | ,, |
| రెండవరక్ష | ,, |
| మృతగర్భచికిత్స | 79 |
| గర్భోద్ధారణ | ,, |
| మృతగర్భచ్ఛేదనప్రకారము | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| ఛేదనానంతరచికిత్స | 80 |
| మృతమైనశిశువు బయలువెడలుటకు చికిత్స | ,, |
| మూఢగర్భచికిత్స | |
| ప్రసవించినస్త్రీకి మావిపడకపోయినట్లయితే దానివలనగలిగెడి వుపద్రవములు | ,, |
| వాటికిచికిత్స | 81 |
| రెండవచికిత్స | ,, |
| మూడవచికిత్స | ,, |
| యోనిగాయమునకుచికిత్స | ,, |
| యోనిసంకుచితచికిత్స | 82 |
| మక్కల్లనిదానము | ,, |
| మక్కల్లచికిత్స | ,, |
| రెండవచికిత్స | ,, |
| మూడవచికిత్స | 83 |
| నాలవచికిత్స | ,, |
| గర్భిణీస్త్రీకివర్జావర్జ్యములు | ,, |
| మిథ్యాచారవర్జన | 84 |
| గర్భోత్పత్తిక్రమము | ,, |
| గర్భోత్పత్త్యుపాయము | ,, |
| గర్భనివారకక్రియ | 85 |
| రెండవచికిత్స | 86 |
| మూడవచికిత్స | ,, |
| నాలవచికిత్స | ,, |
| సూతికారోగనిదానము | ,, |
| బాలింతరోగమునకు సామాన్య చికిత్స | 87 |
| రెండవచికిత్స | ,, |
| మూడవచికిత్స | ,, |
| నాలవచికిత్స | ,, |
| అయిదవచికిత్స | 88 |
| ఆరవచికిత్స | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| ఏడవచికిత్స | 88 |
| ఎనిమిదవచికిత్స | 89 |
| సూతికావాయువులకు పంచజీరకావలేహము | ,, |
| సూతికాస్త్రీకి నాగరఖండము | 90 |
| సూతికకు నాగరాదిలేహము | ,, |
| సూతికాపథ్యక్రమము | 91 |
| హీనసూతికాలక్షణము | ,, |
| ఉపచారకాల నియమము | ,, |
| స్తనరోగనిదానము | 92 |
| స్తనరోగచికిత్స | ,, |
| స్తన్యవాతరోగచికిత్స | ,, |
| స్తనములయందుగలిగెడి వాపులకు చికిత్స | ,, |
| స్తనములు దృఢపడుటకు చికిత్స | 93 |
| రెండవచికిత్స | ,, |
| మూడవచికిత్స | ,, |
| వాతాదులవలన దూషితమైన స్తన్య లక్షణము | ,, |
| నిర్దుష్టమైన స్తన్యలక్షణము | 94 |
| పిత్తదుష్టస్తన్యచికిత్స | ,, |
| కఫదుష్టస్తన్యచికిత్స | ,, |
| ద్వంద్వజస్తన్యచికిత్స | ,, |
| త్రిదోషస్తన్యచికిత్స | 95 |
| స్తన్యచికిత్స | ,, |
| స్తన్యజననవిధి | ,, |
| రెండవచికిత్స | ,, |
| మూడవచికిత్స | ,, |
| నాలవచికిత్స | 96 |
| అయిదవచికిత్స | ,, |
| ఆరవచికిత్స | ,, |
| స్తనశోథచికిత్స | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| ప్రమేహరోగమునందు పథ్యాపథ్య విచారము | 97 |
| గర్భిణీస్త్రీకిచేయతగు పథ్యము | ,, |
| అపథ్యములు | 98 |
| **కౌమారభృత్యము.** | |
| బాలరోగనిదానము | 99 |
| అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | 100 |
| వాతదుష్టస్తన్యజరోగనిదానము | ,, |
| పిత్తదుష్టస్తన్యజరోగనిదానము | ,, |
| కఫదుష్టస్తన్యజరోగనిదానము | ,, |
| బాలురకు అంతర్గతవేదన తెలియుటకై ఉపాయము | 101 |
| బాలురపథ్యక్రమము | ,, |
| శిశువులకు ఔషధక్రమము | ,, |
| అన్యచ్చ | 102 |
| అన్యచ్చ | ,, |
| బాలునికి మాత్రాప్రమాణము | ,, |
| ఔషధపరిమాణము | ,, |
| అన్యచ్చ | 103 |
| బాలురకు 16 సంవత్సరములకు పిదప మాత్రాకషాయాదుల ప్రమాణము | ,, |
| కుకూణక బాలరోగనిదానము | 104 |
| కుకూణక బాలరోగచికిత్స | ,, |
| పారిగర్భికనిదానము | ,, |
| తాలుపాకనిదానము | 105 |
| తాలుపాకచికిత్స | ,, |
| వివర్ణరోగనిదానము | ,, |
| సర్వగ్రహచికిత్స | 106 |
| బాలగ్రహపీడకలుగుటకు కారణము | 117 |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| సామాన్యగ్రహపీడలక్షణము | 117 |
| స్కందగ్రహగృహీతలక్షణము | 118 |
| స్కందగ్రహచికిత్స | ,, |
| అన్యచ్చ | 119 |
| అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | ,, |
| సర్వగ్రహధూపము | ,, |
| స్కందాపస్మారలక్షణము | 120 |
| స్కందాపస్మారచికిత్స | ,, |
| సురసాదిగణవివరణము | ,, |
| స్కందాపస్మారగ్రహధూపము | 121 |
| స్కందాపస్మారగ్రహమునకురక్ష | ,, |
| స్కందాపస్మారగ్రహమునకు రెండవరక్ష | ,, |
| శకునీగ్రహలక్షణము | ,, |
| ధూపము | 122 |
| శకునిగ్రహరక్ష | ,, |
| శకునిగ్రహమునకు స్నానము | ,, |
| శకునిగ్రహణమునకు లేపనము | ,, |
| రేవతీగ్రహలక్షణము | 123 |
| రేవతీగ్రహమునకు స్నానము | ,, |
| రేవతీగ్రహమునకు ధూపము | ,, |
| పూతనాగ్రహలక్షణము | ,, |
| పయస్యాదితైలము | 124 |
| పూతనాగ్రహధూపము | ,, |
| అంధపూతనాగ్రహలక్షణము | ,, |
| అంధపూతనాగ్రహమునకు స్నానము | ,, |
| తిక్తపంచగణము | 125 |
| పురీషాదిధూపము | ,, |
| శీతపూతనాగ్రహలక్షణము | ,, |
| రోహిణ్యాదిఘృతము | ,, |
| గృధ్రాదిధూపము | ,, |
| ముఖమండికాగ్రహలక్షణము | 126 |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| ముఖమండికాగ్రహమునకు స్నానము | 126 |
| భృంగాదితైలము | ,, |
| వచాదిధూపము | ,, |
| నైగమేయగ్రహలక్షణము | 127 |
| నైగమేయగ్రహమునకు స్నానము | ,, |
| ప్రియంగ్వాదితైలము | ,, |
| నైగమేయగ్రహధూపము | " |
| నందినీగ్రహలక్షణము | ,, |
| సునందనాదిగ్రహలక్షణము | 128 |
| ఘంటాలీగ్రహలక్షణము | ,, |
| ఘంటాలీగ్రహలేపము | ,, |
| అన్యచ్చ | 129 |
| కంటకాలీగ్రహలక్షణము | ,, |
| కంటకాలీగ్రహధూపము | ,, |
| అహంకారీగ్రహలక్షణము | ,, |
| అహంకారీగ్రహచికిత్స | ,, |
| షష్టికాగ్రహలక్షణము | 130 |
| షష్టికాగ్రహచికిత్స | ,, |
| సింహికాగ్రహలక్షణము | ,, |
| సింహికాగ్రహచికిత్స | ,, |
| ఆర్యకాగ్రహలక్షణము | 131 |
| ఆర్యకాగ్రహచికిత్స | ,, |
| మేషీగ్రహలక్షణము | ,, |
| మేషీగ్రహచికిత్స | ,, |
| రోదనీగ్రహలక్షణము | 132 |
| రోదనీగ్రహచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, |
| ఉత్ఫుల్లికాలక్షణము | ,, |
| ఉత్ఫుల్లికాచికిత్స | ,, |
| అన్యచ్చ | 133 |
| అన్యచ్చ | ,, |
| ఉత్ఫుల్లికారోగమునకు ధూపము | 134 |
| జ్వరాదులకు అష్టమంగళఘృతము | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| సర్వగ్రహారిష్టమునకు లేపము | 134 |
| బాలజ్వరాంకుశము | 135 |
| జ్వరములకు పద్మకాదిక్వాథము | ,, |
| జ్వరమునకు యష్టిమధుకాదిలేహము | ,, |
| వాతజ్వరమునకు [illegible]దిక్వాథము | ,, |
| వాతజ్వరకషాయము | 136 |
| పిత్తజ్వరకషాయము | ,, |
| అన్యచ్చ | ,, |
| సతతజ్వరచికిత్స | ,, |
| వాతపిత్తజ్వరమునకు కషాయము | 137 |
| అన్యచ్చ | ,, |
| పిత్తశ్లేష్మజ్వరమునకు అమృతాష్టక చూర్ణయుక్త కషాయము | ,, |
| పిత్తశ్లేష్మకషాయము | 138 |
| ఆమాదియుక్తజ్వర కషాయము | ,, |
| శీతజ్వరహర లేపము | ,, |
| చాతుర్భద్రకషాయము | ,, |
| అన్యచ్చ | 139 |
| శ్లేష్మకజ్వరమునకు అభయాది కషాయము | ,, |
| జ్వరహర లేహము | ,, |
| సన్నిపాతజ్వరచికిత్స | 140 |
| దాహముతోగూడిన జ్వరచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, |
| ఐకాహికజ్వరచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, |
| త్ర్యాహికజ్వరచికిత్స | 141 |
| త్ర్యాహికజ్వరధూపము | ,, |
| త్ర్యాహికజ్వరహర లేపనము | ,, |
| సర్వజ్వరహర కషాయము | ,, |
| స్తన్యము గ్రహించుటకు కల్కము | 142 |
| ఏకాహికజ్వరమునకు నస్యము | ,, |
| అతిసారచికిత్స | ,, |

| విషయము. | సంఖ్య. | విషయము. | సంఖ్య. |
|---|---|---|---|
| అన్యచ్చ | 142 | కాసచికిత్స | 150 |
| అన్యచ్చ | ,, | అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | 143 | అన్యచ్చ | 151 |
| అన్యచ్చ | ,, | క్రిమిచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, | కాసచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, | కాసచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, | అన్యచ్చ | ,, |
| గ్రహణికి యవాన్యాదిచూర్ణము | 144 | హిక్కాచికిత్స | 152 |
| అన్యచ్చ | ,, | అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | ,, | అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | ,, | ఛర్ద్యతీసార చికిత్స | ,, |
| అన్యచ్చ | ,, | ఛర్దిచికిత్స | ,, |
| త్రిదోషసంగ్రహణీచికిత్స | 145 | అన్యచ్చ | 153 |
| రక్తాతిసారచికిత్స | ,, | ఖదిరాదిఘృతము | ,, |
| సర్వాతిసారచికిత్స | ,, | ఛర్ద్యతీసారచికిత్స | ,, |
| ప్రవాహికచికిత్స | ,, | ఛర్దిచికిత్స | ,, |
| గ్రహణీ అతిసారచికిత్స | 146 | వమనజ్వరచికిత్స | ,, |
| బాలచాంగేరీ ఘృతము | ,, | క్షీరఛర్దిచికిత్స | 154 |
| రక్తాతిసారచికిత్స | ,, | హిక్కాఛర్దిచికిత్స | ,, |
| అర్శచికిత్స | 147 | దాహశమనచికిత్స | ,, |
| అర్శరోగఘుటికలు | ,, | అన్యచ్చ | ,, |
| రక్తమూలమునకు చికిత్స | ,, | ఆనాహవాతశూలచికిత్స | 155 |
| రక్తార్శ చికిత్స | ,, | రోదననివారకచికిత్స | ,, |
| ఆమయుక్తశూలాది చికిత్స | 148 | విరేచనమునకు లేపము | ,, |
| సర్వాజీర్ణాది చికిత్స | ,, | మృత్తికాభక్షణవిరేచనము | ,, |
| అజీర్ణవిషూచికాచికిత్స | ,, | కార్శ్యచికిత్స | 156 |
| భస్మకసామాన్యచికిత్స | ,, | లాక్షాదితైలము | ,, |
| అన్యచ్చ | 149 | అశ్వగంధఘృతము | 157 |
| కాసమునకు ధాన్యాదిహిమము | ,, | వాపులకు లేపము | ,, |
| అన్యచ్చ | ,, | నాభియందు కలిగెడి వాపులకు చికిత్స | , |
| హిక్కాశ్వాస చికిత్స | ,, | నాభివ్రణచికిత్స | , |
| కాసశ్వాసాది చికిత్స | 150 | గుదపాకచికిత్స | 15. |
| కాసశ్వాసఛర్ది చికిత్స | ,, | క్షతాదికమునకు చికిత్స | |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| సిధ్మ పామ విచర్చిక వీట్లయొక్క చికిత్స | 158 |
| తాలుపాక చికిత్స | ,, |
| దంతపాలిరోగచికిత్స | 159 |
| దంతోద్భవకాలమునందు జనించెడి రోగములకు చికిత్స | ,, |
| పిప్పల్యాదిఘృతము | ,, |
| వచాదిఘృతము | ,, |
| ముఖపాకమునకు గండూషచికిత్స | 160 |
| ముఖస్రావచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | ,, |
| తాలుకంటకరోగ చికిత్స | 161 |
| మూత్రకృఛ్రిచికిత్స | ,, |
| శ్లేష్మజమూత్రకృఛ్రిచికిత్స | ,, |
| వాతజరోగచికిత్స | ,, |
| మూత్రగ్రహమునకు చికిత్స | ,, |
| గండమాలచికిత్స | 162 |
| ఉన్మాదచికిత్స | ,, |
| రక్తపిత్తమునకు చికిత్స | ,, |
| అన్యచ్చ | ,, |
| ముక్కుయందు రక్తముపడుటకు చికిత్స | 163 |
| వాతగుల్మచికిత్స | ,, |
| వాతరోగచికిత్స | ,, |
| అపస్మారచికిత్స | ,, |
| అన్యచ్చ | 164 |
| పదావర్తచికిత్స | ,, |
| హృద్రోగచికిత్స | 164 |
| మూర్ఛాచికిత్స | " |
| జ్వరయుక్తమూర్ఛాచికిత్స | 165 |
| తాపమునకు చికిత్స | ,, |
| సంతాపచికిత్స | ,, |
| క్రిమిరోగ చికిత్స | ,, |
| పాండురోగాదిచికిత్స | ,, |
| శ్లేష్మజస్వరభేదచికిత్స | 166 |
| పిత్తస్వరభేదచికిత్స | ,, |
| పాండురోగచికిత్స | ,, |
| క్షయరోగచికిత్స | " |
| శరీరపుష్టికరచికిత్స | 167 |
| శ్వాసకాస వీటిచికిత్స | ,, |
| శ్వాసకంటకారీఘృతము | ,, |
| స్ఫోటకజ్వరచికిత్స | 168 |
| నేత్రరోగచికిత్స | ,, |
| దాహాదిక చికిత్స | ,, |
| నేత్రరోగమునకు లేపనము | ,, |
| వాక్శుద్ధికరవచాదిచూర్ణము | 169 |
| బాలురకు స్రోతశ్శుద్ధి ఔషధము | " |
| బాలురకభ్యంజనతైలము | ,, |
| తిమిరరోగచికిత్స | 170 |
| కర్ణశూలచికిత్స | ,, |
| కర్ణవేధచికిత్స | ,, |
| అన్యచ్చ | ,, |
| శోషరోగహరఘృతము | 171 |
| శృంగ్యాదిఘృతము | ,, |


విషయసూచిక - ముగిసెను.

# ప్ర క ట న.

అస్మద్దేశీయులారా! నే నీక్రింద బొందుపరచిన యంశంబులను సావధానంబుగ జదువంగోరెద.

ఇచ్చెన్నపురంబున మత్పితామహుండగు, పిడుగు - సుబ్బరామయ్యగారు 1892 వ సంవత్సరంబున "హిందూరత్నాకరం" బను ముద్రాక్షరశాలను స్థాపించి పెక్కువైద్య నితర గ్రంథములను ముద్రింపించి సుమారు 20 సంవత్సరములవరకు పిచ్చాలాకార్యంబులను నిరభ్యంతరముగానున్ను జాగరూకతతోడనున్ను జరిపించుచూ వచ్చి కీర్తిశేషులైరి. పదంపడి సుబ్బరామయ్యగారికి పుత్రుండును మజ్జనకుండునైన తడుగు - వెంకట్రావు పంతులుగారున్ను నేనున్ను కలసి సదరు ముద్రాక్షరశాలకార్యంబులను జరిపించుచూవచ్చితిమి. అయితే యిప్పుడు మాతండ్రిగారు పుత్రుడనైన నన్ను విడనాడి మాకుగల పిత్రార్జితపు సొత్తులను విభజించుకొనియె. ఈ విభజనలో సదరు ముద్రాక్షరశాల నాయధీనంబయ్యె.

చదువరులారా! ఇక మీదట నేనే సదరు ముద్రాక్షరశాలను జరిపించుదును. ఇదివరలో అచ్చుపడిన గ్రంథములుగాక ఇతర సంస్కృతాంధ్ర గ్రంథములనుకూడా బాగుగా ముద్రింపించి మంచిబైండ్లుతోటి సులభమైన వెలలకే స్వల్పలాభముతోటి విక్రయించ నిశ్చయించియున్నాడను. కనుక నాయందు కరుణవహించి వారివారికి వలయు గ్రంథములకును అచ్చుపనులకును ఆర్డర్లను పంపుదురని వేడుచున్నాడను.

వలయువారలు ఈ క్రింది విలాసమగు నా పేరటికి వ్రాసి తెప్పించుకొని నన్ను గౌరవింతురని తమ ఘనతను మిగుల ప్రార్థించుచున్నాడను.

ఇట్లు,

తమ విధేయుఁడు,

పిడుగు - వెంకటకృష్ణారావు పంతులు

ప్రింటర్, పబ్లిషర్, అండ్ బుక్కుసెల్లర్,

2/40, పెద్దునాయుని వీధి, మద్రాసు.

శ్రీ ర స్తు.

# చి కి త్సా ర త్న ము.

## ఆ ం ధ్ర తా త్ప ర్య ము.



## ప్రథమా శ్వాసము.

శ్లో॥ శ్రీకృష్ణం పురుషంనత్వా చిదానంద ఘనం హరిమ్ ।
సర్వలోక హితార్థంచ చికిత్సా రత్నముత్తమమ్ ॥

తా॥ నిజోపాసకులగు జనులయొక్క ఆగామిసంచిత ప్రారబ్ధరూపములగు పాపముల పోగొట్టునట్టి శక్తిగల చిదానంద ఘనస్వరూపుడును వైరాజప్రపంచము నందు అంతర్యామి స్వరూపుడునగు శ్రీ హరిని నమస్కరించి సుశ్రుతాది పురాతన గ్రంథావలోకనాసమర్థులగు జనులయొక్క హితమునకై చికిత్సారత్నమని పేరుగ్గ నంబడు నీ గ్రంథమును రచియించుచున్నాడ.

శ్లో॥ స్త్రీణాం విశిష్యరోగాణాం సనిదాన చికిత్సితం ।
ప్రోక్తంపూర్వైశ్చ బాలానాం తద్వయం త్వత్ర-చోచ్యతే ॥

తా॥ బాహట శార్ఙ్గధర మిశ్రాదికృత వైద్యనిబంధనా గ్రంథములయందు స్త్రీలు బాలురు వీరల రోగనిదాన చికిత్సాదులను విరళముగ కొన్నిభాగములే సుదా హరింపబడియున్నవేగాని సంపూర్ణముగ నేకత్ర సంగ్రహించబడలేదుగాన పైచెప్ప బడిన వారలయొక్క రోగనిదాన చికిత్సలను ఈ గ్రంథమునందు చెప్పుచున్నాడ.

### ప్రదరరోగ నిదానము.

శ్లో॥ విరుద్ధమద్యాధ్యశనాదజీర్ణాద్గర్భప్రపాతాదతిమైథునాచ్చ ।
యానాతిశోకాదతికర్శనాచ్చభారాభిఘాతాచ్ఛయనాద్దివాచ ।
తంశ్లేష్మపిత్తానిలసన్నిపాతైశ్చతుఃప్రకారంప్రదరంవదన్తి ॥

తా॥ విరుద్ధాన్నాది భక్షణము మద్యపానము అమితాహారము అజీర్ణము గర్భపాతము అతిమైథునము యానారోహణము మిగుల నడుచుట మిగుల దుఃఖమునొందుట ఉపవాసముచేయుట మిగుల కృశించుట అమితముగ బరువుమోయుట కఱ్ఱలు మొదలగు వాటిచే ప్రహారాదులు నొందుట పగలు నిద్రించుట వీటివలన ప్రదరరోగము జనించు. మఱియు అది వాతము పిత్తము శ్లేష్మము సన్నిపాతము అను 4 విధంబులుగ నుండు.

## ప్రదరరోగి లక్షణము.

శ్లో॥ అసృగ్దరం భవేత్సర్వం సాఙ్గమర్దంస వేదనం ॥

తా॥ సర్వప్రదరరోగములలో నేదైన నొకటి జనించెనేని అప్పుడు ఒడలు నొప్పులు వేదన ఇవి గలిగియుండు.

## ప్రదరరోగాతి వృద్ధిలక్షణము.

శ్లో॥ తస్యాతివృద్ధౌదౌర్బల్యం శ్రమోమూర్ఛామదస్తృషా ।
దాహఃప్రలాపఃపాణ్డుత్వంతన్ద్రారోగాశ్చవాతజాః ॥

తా॥ ప్రదరరోగము మిగుల వృద్ధిని జెందెనేని దౌర్బల్యము శ్రమ మూర్ఛ మదము దప్పి తాపము ప్రలాపము ఒడలు తెలుపుపారుట తంద్ర ఇవి కలుగుటయే గాక ఆక్షేపకాది వాతరోగములు సగా జనించు.

## వాతప్రదర నిదానము.

శ్లో॥ రూక్షారుణం ఫేనిలమల్పమల్పంవాతార్తివాతాత్పిశితోదకాభం॥

తా॥ రూక్ష యెఱుపువర్ణము నురుగు వాతోపద్రవము మాంసము కడిగిన నీరువలె స్వల్పస్వల్పముగ స్రవించుట ఇట్టి లక్షణములు గలిగియుండెనేని నది వాతప్రదరమని యెఱుంగవలయు.

## వాతప్రదరమునకు సౌవర్చలాది కల్కము.

శ్లో॥ దధ్నాసౌవర్చలాజాజిమధుకంనీలముత్పలం ।
పిబేత్క్షౌద్రయుతంనారీవాతాసృగ్దరశాంతయే ॥

తా॥ వర్చలవణము జీలకఱ్ఱ అతిమధురము నల్లకలువపువ్వు వీటిని పెరుగుతోన కల్కముజేసి అందు తేనెవైచి స్త్రీ పుచ్చుకొనిన వాతప్రదరము శమించు.

నాగరాది మస్థము.

శ్లో॥ నాగరంమధుకంత్తైలంసితాంవధిచతత్సమమ్ ।
ఖజేనోన్మథితంవాతప్రదరస్యవినాశనమ్ ॥

తా॥ శొంఠి అతిమధురము వీటిచూర్ణములో తిలతైలము శర్కర పెరుగు వీటిని సమభాగములుగచేర్చి చిలికి స్త్రీ భక్షించెనేని వాతప్రదరరోగము నివర్తించును.

ఏలాది కల్కము.

శ్లో॥ ఏలామంశుమతీంద్రాక్షాముశీరంతిక్తరోహిణీం ।
చందనంకృష్ణలవణంపాటివాలోధ్రసంయుతం ।
వాతాసృగ్దరశాంత్యర్థంపిబేద్దధ్నాసహాంగనా ॥

తా॥ ఏలకులు ముయ్యాకుపొన్న ద్రాక్ష వట్టివేరు కటుకరోహిణి చందనము నల్లుప్పు నుగంధపాలవేళ్ళు లొద్దుగపట్ట వీటిని సమముగనూరి పెరుగులో కల్కము చేసి స్త్రీ పుచ్చుకొనిన వాతప్రదరము మానును.

పిత్తప్రదర లక్షణము.

శ్లో॥ సపీతనీలా సితరక్తముష్ణం పిత్తార్తియుక్తం భృశవేగిపిత్తాత్ ॥

తా॥ పసపు నలుపు యెరుపు యీ వర్ణములుగలదిగను ఉష్ణముగను పిత్తవేదన గలదిగను అతి వేగము గలదిగనుండెనేని నది పిత్తప్రదరమని యెరుంగవలయును.

పిత్తప్రదరమునకు వాసకాదిస్వరసము.

శ్లో॥ పిత్తాసృగ్దరశాంత్యర్థంసక్షౌద్రంలలనాపిబేత్ ।
వాసతస్యగుడూచ్యావారసంకంవావరీభవస్య ॥

తా॥ అడ్డసరపురసముగాని తిప్పతీగెరసముగాని పిల్లపీచరరసముగాని తేనెతో మిశ్రమముజేసి స్త్రీ పుచ్చుకొనిన పిత్తప్రదరము నివర్తించును.

మధుకాది కల్కము.

శ్లో॥ మధుకంకర్షమేతంతుచతుఃకర్షాసితాతథా ।
తండులోదకసంపిష్టంపైత్తికేప్రదరేపిబేత్ ॥

తా॥ అతిమధురము, క – 1, బియ్యపు కడుగుతోనూరి కల్కముజేసి అందు

శర్కర, క - 4, వైచి స్త్రీ పుచ్చుకొనిన పిత్తప్రదరము నివర్తియగు.

శ్లేష్మప్రదర లక్షణము.

శ్లో॥ ఆమంసపిచ్ఛప్రతిమంసపాండు పులాకతోయప్రతిమంకఫాత్తు॥

తా॥ ఆమముగను బంకగను కొంచెము తెలుపురంగుగలదిగను కూటినీరువలె నుండిన నది శ్లేష్మప్రదరమని తెలియంగవలయు.

శ్లేష్మప్రదర చికిత్స.

శ్లో॥ కఫప్రదరనాశాయా పిబేద్వామల పూరసం ॥

తా॥ నల్ల అత్తిపండ్లరసమును పానముచేసిన శ్లేష్మప్రదరము నివర్తియగు.

శ్లో॥ కాకజంఘామూలరసం మధునాసహభామినీ ।
సలోధ్రచూర్ణమాపీయకఫప్రదరకంజయేత్ ॥

తా॥ కాకజంఘా అనగా వెలుమసంధి లేక చీకివెలగ దీనిలో నేదైన నొక దాని రసమునందు లొద్దుగపట్టచూర్ణము తేనెవేసిపుచ్చుకొనిన శ్లేష్మప్రదరమునశించు.

త్రిదోషప్రదర లక్షణము.

శ్లో॥ సక్షౌద్రసర్పిర్హరితాలవర్ణం మజ్జప్రకాశం కుణపంత్రిదోషం ।
తచ్చాప్యసాధ్యంప్రవదన్తితజ్జ్ఞానతత్రచికిర్త్సేత్భిషక్కృతాత్మా ॥

తా॥ తేనె నెయ్యి హరిదళము వీటితో సమానవర్ణము కలదిగను మజ్జయొక్క కాంతిగలదిగను దౌర్గంధ్యయుక్తమైనదిగను జనించెనేని నది త్రిదోష ప్రదరమని యెఱుంగవలయు. అది యసాధ్యముగాన వైద్యుడు చికిత్సంజేయందగదు.

త్రిదోషప్రదర చికిత్స.

శ్లో॥ కుశమూలంసముద్ధృత్యపేషయేత్తణ్డులాంబునా ।
ఏతత్పీత్వాత్రిహాన్నారీప్రదరాత్పరిముచ్యతే ॥

తా॥ దర్భవేళ్లను బియ్యపు కడుగుతో నూరి కల్కముజేసి 3 దినములు స్త్రీ పానము శేసెనేని త్రిదోషప్రదరము శాంతినిజెందు.

కాకోదుంబరికా స్వరసము.

శ్లో॥ క్షౌద్రయుక్తంఫలరసంకాకోదుంబరజంపిబేత్ ।

అసృగ్దరవినాశాయసశర్కరపయోన్నభుక్ ॥

తా॥ నల్ల అత్తిపండ్లయొక్క రసములో తేనెవైచి స్త్రీ పుచ్చుకొని శర్కర పాలు వీటితో అన్నము భుజించిన ప్రదరము నివర్తియగు.

సన్నిపాత ప్రదర చికిత్స.

శ్లో॥ పథ్యామలకవిభీతకవిశ్వౌషధదారురజనీనాం ।
సక్షౌద్రలోధ్రచూర్ణఃక్వాథోహంత్యేషసర్వజంప్రదరం ॥

తా॥ కరక్కాయ ఉసిరికాయ తానికాయ శొంఠి మానిపసపు వీటిని కషాయముపెట్టి అందు లొద్దుగచూర్ణము తేనెవైచి స్త్రీ పుచ్చుకొనిన సన్నిపాత ప్రదరము నివర్తియగు.

ప్రదరరోగ చికిత్స.

శ్లో॥ మృత్కోష్ఠాదారికాగేహసంభవానవమల్లికా ।
సమంగాధాతకీపుష్పంగైరికంచరసాంజనం ।
తథాసర్జరసశ్చైతాన్యథాలాభంవిచూర్ణయేత్ ।
తచ్చూర్ణంమధునాలిహ్యాత్స్త్రీప్రదరశాంతయే ॥

తా॥ కుమ్మరవానియింటిమన్ను మల్లెఆకులు మంజిష్ఠతీగె ఆరెపువ్వు కావిరాయి రసాంజనము సర్జరసము వీటిలో దొరికినవస్తువుల తీసికొని చూర్ణముచేసి తేనె వేసి పుచ్చుకొనిన స్త్రీకి ప్రదరరోగము మానును.

మలయూఫల చూర్ణము.

శ్లో॥ మలయూఫలచూర్ణస్యశర్కరాసహితస్యచ ।
మధునామోదకంకృత్వాఖాదేత్ప్రదరశాంతయే ॥

తా॥ నల్ల అత్తిపండ్లచూర్ణమును శర్కరతోచేర్చి తేనెవేసి కలిపి యుండలు చేసి స్త్రీ భక్షించిన ప్రదరము మానును.

దార్వ్యాది కషాయము.

శ్లో॥ దార్వీరసాంజనవృషాబ్దకిరాతబిల్వాభల్లాతకైరవకృతోమధునాకషాయః । పీతోజయత్యతిబలంప్రదరంసశూలంపీతాసితారుణవిలోహితనీలయుక్తం ॥

తా॥ మానిపసపు రసాంజనము అడ్డసరము నేలవేము బిల్వఫలము జీడిగింజలు వీటిని కషాయముపెట్టి అందు తేనెవైచి స్త్రీ పుచ్చుకొనిన బలిష్ఠమైన శూలతోగూడి పసపు యెరుపు నలుపు తెలుపు వర్ణములుగల ప్రదరమైనను నివర్తించయగు.

## భూమ్యామలకాది పానము.

శ్లో॥ భూమ్యామలకమూలంతుపీతంతండులవారిణా ।
ద్విత్రిర్వేవదినైర్నార్యాః ప్రదరందుస్తరంజయేత్ ॥

తా॥ నేలవుసిరికవేళ్లను బియ్యపుకడుగుతోనూరి కల్కముజేసి స్త్రీ 3 దినములు పానము జేసెనేని దుస్తరమైన ప్రదరములు మానును.

## ధాతక్యాది కషాయము.

శ్లో॥ ధాతకీచతథాపూగికుసుమానాంపిబేచ్ఛృతం ;
నాశయేత్ప్రదరంసద్యస్త్రిదినాద్యోషితాంధ్రువం ॥

తా॥ ఆరెపువ్వు పోకపూలు వీటిని కషాయముపెట్టి స్త్రీ 3 దినములు పుచ్చుకొనిన దుస్తరమైన ప్రదరరోగము నిశ్చయముగ నివర్తించయగు.

## ఆఖూపురీష యోగము.

శ్లో॥ ఆఘోఃపురీషం పయసానిపీయ వస్త్రేంర్బలాపేక ... ప్రాహంవా । స్త్రియః స్త్రియహంవా ప్రదరాప్రసదార్యాః ప్రసహ్య పారం పరమాప్నువంతి ॥

తా॥ ఎలుకపెంటికలను పాలతోనూరి స్త్రీ అగ్నిప్రష్టి నెరిగి 3 దినము పానముజేసిన ప్రదరము మానును.

## బృహచ్ఛతావరీ ఘృతము.

శ్లో॥ శతావరీరసంప్రస్థంక్షోదయిత్వావపీడయేత్ । ఘృతప్రస్థసమాయుక్తంక్షీరంద్విగుణితంభిషక్ అంతఃకల్కానిమాన్దద్యాత్ స్థూలోదుంబరసన్నిభాన్ । జీవనీయ గణానష్టౌ యష్టిచందన పద్మకైః । ... ంత్రాయంత్రాచాత్మగుప్తాచ బలానాగబలాతథా । శాలిపర్ణీ పృశ్నిపర్ణీ విదారీ సారిబాద్వయం । శర్కరాచసమా

దేయాకాశ్మర్యాచ్ఛఫలానిచ । సమ్యక్సిద్ధంతువిజ్ఞాయ తద్ఘృ
తంచావతారయేత్ । రక్తపిత్తవికారేషువాతపిత్తకృతేషుచ ।
వాతరక్తం క్షయంశ్వాసం హిక్కాంకాసంచదుస్తరం । అంత
ర్దాహంశిరోదాహంరక్తపిత్తసముద్భవం । అసృగ్దరంసర్వభవం
మూత్రకృచ్ఛ్రించదారుణం ॥

తా॥ పిల్లిపీచరరసము ర్వు. 64 నెయ్యి ర్వు. 64 పాలు ర్వు. 124 యెత్తు చేర్చి అందు జీవనీయగణములో పఠించిన ఔషధములు 8 అతిమధురము చందనము తామరగడ్డలు పన్నేరు దూలగొండి చిట్టాముట్టి పేరాముట్టి ముయ్యాకుపొన్న కోల పొన్న నేలపొన్న నేలగుమ్ముడు సుగంధపాల నల్లసుగంధపాల గుమ్ముడు శర్కర వీటినన్నియు నొక్కొక్కపలము గ్రహించి చూర్ణముచేసి వైచి ఘృతపక్వముగవండి దించుకొని సేవించిన రక్తపిత్తవికారదోషములు వాతపిత్తవికారదోషములు వాతరక్తము శ్వాస ఎక్కిళ్ళు కాస అంతర్దాహము రక్తపిత్తమువలన పుట్టిన శిరోదాహము మూత్ర కృచ్ఛ్రము సర్వప్రదరరోగములు మానును.

## కుముదాది ఘృతము.

శ్లో॥ కుముదం పద్మకోశీరం గోధూమా రక్తశాలయః । మాషపర్ణి
యశస్యాచ శాలిపర్ణిసజీరకైః । పలంత్రపుసబీజాని ప్రత్యేకం
కదళీఫలం । ఏకంతత్రిన భాగోపి గవ్యంక్షీరం చతుర్గుణం ।
పానీయం ద్విగుణందత్వా ఘృతప్రస్థం విపాచయేత్ । ప్రదరం
రక్తగుల్మంచ రక్తదోషం హాలీమకం । బహురూపంచ యా
త్పిత్తంకామలాంవాతశోణితం । అరోచకంజ్వరంజీర్ణంపాండు
రోగం మదంభ్రమం । తరుణీ చాల్పపుణ్యాచ యాచగర్భం
నవిందతి । సాచాపివిందతేక్షేమంవిదంతేనాత్రసంశయః ॥

తా॥ కలువపూలు తామరకాడలు వట్టివేళ్లు గోధుములు యెఱ్ఱబియ్యము అపవి [illegible]ములు ముయ్యాకుపొన్న సాలవణ శాలిపర్ణి జీలకఱ్ఱ ములుదోసవిత్తులు ఇవి దినుసు 1 కి ఒక్కొక్కపలము వంతున చూర్ణముచేసి అరిటిపండ్లు వీటికి మూడింతలు గోక్షీ రము నాలుగింతలు మంచినీళ్ళు రెండింతలు నెయ్యి 1 ప్రస్థము వీటిని నొక పాత్ర యందువైచి ఘృతపక్వముగకాచి దించుకొని [illegible] సేవించిన ప్రదరము రక్తగుల్మము

రక్తదోషము హలీమకము నానావిధములుగనుండెడి పిత్తరోగములు కామిల వారక్తము అరోచకము జ్వరము అజీర్ణము పాండురోగము మదము భ్రమ ఇవి శమింౘుటయేగాక నీ ఘృతమును సేవించిన సంతానవిహీనలైన స్త్రీలకు సంతానమును గలుగును ఇందుకు సందియములేదు.

## సితికల్యాణక ఘృతము.

శ్లో॥ కుముదం పద్మకోశీరం గోధూమం రక్తశాలయః । ముద్గపర్ణీ పయస్యాచ కాశ్మరీ మధుయష్టికా ॥ బలాతిబలయోర్మూల ముత్పలంతాలమస్తకం । విదారీశతపుత్రీచశాలపర్ణీసజీరకా । ఫలం త్రపుసబీజాని ప్రత్యగ్రం కదళీఫలం । ఏషామర్ధపలాన్ భాగాన్ గవ్యక్షీరంచతుర్గుణమ్ ॥ పానీయం ద్విగుణందత్వా ఘృతప్రస్థం విపాచయేత్ । ప్రదరేరక్తగుల్మేచ రక్తపిత్తేహలీమకే ॥ బహురూపంచ యత్పిత్తం కామలాయాంచశోణితే । అరోచకే జ్వరేజీర్ణే పాండురోగే మదేభ్రమే ॥ తరుణీయాల్ప పుష్పాచయాచగర్భంనవిందతి । అహన్యహనిచ స్త్రీణాంభవతి భవతిప్రీతివర్ధనమ్ ॥

తా॥ తెల్లకలువ పద్మకము వట్టివేరు గోధుమలు ఎఱ్ఱసంబాబియ్యము పిల్లిపెసలు పిన్నమనుబాల పెద్దగుమ్ముడు యష్టిమధుకము పెద్దముత్తవపులగపువేళ్లు చినముత్తవపులగపువేళ్ళు నల్లకలువ తాటిమువ్వ తెల్లనేలగుమ్ముడు చేమంతి ముయ్యాకుపొన్న జీలకఱ్ఱ నక్కదోసవిత్తులు నక్కదోసపండు అపుడుపండిన అరటిపండు వీటి దినుసుకు ఎలము చొప్పునదెచ్చి బాగుగానూరి కల్కముచేసి 1 ప్రస్థపు ఆవునేతిలో కలిపి అందు ఆవుపాలు 4 ప్రస్థములు శుద్ధోదకము 2 ప్రస్థములుచేర్చి విధిప్రకారము పాకముజేసి పుచ్చుకొనిన ప్రదరరోగము రక్తగుల్మము రక్తపిత్తము హలీమకము నానావిధ పిత్తరోగములు కామల రక్తదోషము అరోచకము జీర్ణజ్వర పాండురోగము మదము భ్రమను వీటెని నశింపజేయు. యుక్తవయస్సు వచ్చియున్ను ఋతువు కాని పడుచులకీ ఘృతము సేవింపజేసిన స్వల్పకాలములోనే ఋతుమతులగుదురు. మరియు గర్భము జెందకుండు వనితలకీ ఘృతము నిప్పించిన గర్భవతులగుదురు. ఇది స్త్రీరోగమునందు ప్రశస్తమైనది.

అశోక ఘృతము.

శ్లో॥ అశోకవల్కలప్రస్థం తోయాఢకవిపాచితమ్ । పాదస్థేన ఘృతప్రస్థంజీరకక్వాథసంయుతమ్ ॥ తండులాంబుత్వజాక్షీరం ఘృతతుల్యంప్రదాపయేత్ । తథైవ కేశరాజస్యప్రస్థమేకంభిషగ్వరః॥ జీవనీయైః ప్రియాళైస్తు పరుషైస్సరసాంజనైః । యష్ట్యాహ్వాశోకమూలంచమృద్వీకాచశతావరీ ॥ తండులీయకమూలంచ కల్కైరేభిః పలార్థకైః । శర్కరాయాః పలాన్యష్టౌ సిద్ధశీతే ప్రదాపయేత్ ॥ పీతమేతద్ఘృతంహంతిసర్వదోషసముద్భవం । శ్వేతంనీలంతథాకృష్ణంప్రదరంహన్తిదుస్తరం॥ కుక్షిశూలంకటీశూలంయోనిశూలంచసర్వగమ్। మందాగ్నిమరుచింపాండుం కృశతాంవాసకామలామ్ ॥ ఆయుఃపుష్టికరంబల్యం బలవర్ణప్రసాదనమ్ । దేయమేతత్పరంసర్పిర్విష్ణునాపరికీర్తితమ్ ॥

తా॥ అశోకపుచెట్టుయొక్క పట్టను 1 ప్రస్థముదెచ్చి ఆఢకప్రమాణోదకమునందు నైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి దానిలో ఆవునెయ్యి జీలకఱ్ఱకషాయము బియ్యపుకడుగు మేకపాలు కేశరాజము (అనగా వొకవిధమైన శాకవిశేషము.) వీటిని దినుసుకు 1 ప్రస్థము చొప్పునచేర్చి అందు జీవనీయగణ ద్రవ్యములు మొరళిపప్పు పేరీతపండు రసాంజనము యష్టిమధుకము అశోకచెట్టువేళ్ళు ద్రాక్షపండు పిల్లిపీచర చిఱ్ఱికూరవేళ్ళు వీటిని ప్రత్యేకముగ దినుసుకు $1\frac{1}{2}$ పలము చొప్పునజేర్చి కల్కముచేసి కలిపి పాకముచేసి దించుకొని చల్లారిన పిమ్మట అందు పంచదార 8 పలములను చేర్చవలెను. ఇది విష్ణుదేవునిచే నిర్మింపబడిన అశోకఘృతమనబడును. దీనిని సేవించిన వాతాదిదోషములవలన కలిగినవియు తెల్లగ నల్లగ పచ్చగనుండునవియునగు అసాధ్యంబైన ప్రదరరోగములన్నియును తొలగును. మరియు కడుపునొప్పి నడుమునొప్పి యోనిశూల అగ్నిమాంద్యము అరుచి పాండువు కృశత్వము కామల శ్వాసకాసలు ఇవియన్నియును హరించుటయేగాక ఆయువు బలము పుష్టి సౌందర్యము మొదలైనవి అధికముగ కలుగును. ఇది స్త్రీల ప్రదరరోగములకు ప్రశస్థమైనది.

శ్వేతప్రదరములకు వాసకస్వరసము.

శ్లో॥ వాసకస్వరసః పేయోమాగుడూచీరసస్య వా ।

రోహితానాంమూలకల్కంపాణ్డురేసృగ్దరేపిబేత్॥

తా॥ అడ్డసరముయొక్క స్వరసముగాని తిప్పతీగె స్వరసముగాని ములువెలో వేళ్ల రసముయొక్క స్వరసముగాని స్త్రీపానముచేసిన శ్వేతప్రదరము మానును.

సర్వప్రదరమునకు త్రిఫలాదికషాయము.

శ్లో॥ పలత్రికందారువచాసవాసా లాజాసదూర్వా కలసీసమంగా ।
క్షౌద్రాన్వితంక్వాథమిశంతిశ్యాన్యే సర్వాత్మకే స్త్రీప్రదరేషు వైద్యాః ॥

తా॥ త్రిఫలములు దేవదారు వస అడ్డసరము వరిపేలాలు గరికవేళ్ళు నక్కతోకపొన్న చిట్టాముట్టి పీట్లను కషాయముపెట్టి తేనెవేసి పుచ్చుకొనిన స్త్రీకి కలిగిన నానావిధ ప్రదరరోగములు శాంతిని జెందునని వైద్యులు వచించెదరు.

రక్తప్రదరములకు దార్వ్యాది కల్కము.

శ్లో॥ మూలానితండుల జలేనసమన్వితాని పిష్ట్వాకుశస్యచ సమాని పిబన్ప్రియత్నాత్ । యోషిద్రజస్యతి తరాంసుమభిప్రవృత్తా సప్పిర్యుతానియదివాకదలీఫలాని ॥

తా॥ దర్భవేళ్ళను బియ్యపుకడుగుతోనూరి పుచ్చుకొనినను లేక అరటిపండ్లయందు నెయ్యివైచి పిసికి భక్షించినను స్త్రీకి రక్తప్రదరరోగము మానును.

పాణ్డుప్రదరమునకు కాకజంఘాదిపానము.

శ్లో॥ కాకజంఘాసమూలంవామూలంకార్పాసమేవవా ।
పాణ్డుప్రదరశాన్త్యర్థంపిబేత్తణ్డులవారిణా ॥

తా॥ వెలుమపంధివేళ్లుగాని లేక ప్రత్తివేళ్ళుగాని బియ్యపు కడుగుతోనూరి పుచ్చుకొనిన స్త్రీలకు గలిగిన పాండుప్రదరము మానును.

రక్తప్రదరమునకు అశోకవల్కలకషాయము.

శ్లో॥ అశోకవల్కలక్వాథంశృతందుగ్ధంసుశీతలం ।
యథాబలంపిబేత్ప్రాతః స్త్రీవాసృగ్దరనాశనం ॥

తా॥ అశోకవృక్షముయొక్క పట్టను పాలలోవైచి కొంచము నీళ్లుపోసి పా

మిగులునట్లు కషాయముగాకాచి చల్లారిన పిదప స్త్రీ తనబలానుసారముగ ప్రాతఃకాలమునందు పానముజేసెనేని తీవ్రమైన రక్తప్రదరరోగము మానును.

వాతపిత్తప్రదరమునకు రసాంజనాది కల్కము.

శ్లో॥ రసాఞ్జనఞ్చలాక్షాచఛాగేనపయసాపిబేత్ ।
కల్కపత్రైర్ఘృతభర్ష్టైః రాజాదనకపిత్థయోః ।
పిత్తానిలహరావేతౌసర్వంచైవాస్రపిత్తజిత్ ॥

తా॥ రసాంజనము లక్క వీటిని మేకపాలతోనూరి స్త్రీ పుచ్చుకొనినను లేక పాలచెట్టు ఆకుగాని లేక వెలగఆకుగాని నేతితోవేయించి నూరి కల్కముచేసి స్త్రీ పుచ్చుకొనిన వాతము పిత్తము వీట్లవలన జనించిన ప్రదరము రక్తపిత్తము ఇవి మానును.

కురంటమూలాది పానము.

శ్లో॥ కురంటకస్యమూలానిమధుకంశ్వేతచన్దనం ।
యష్ట్యాపిష్టాన్యక్షమానాపాయయేత్తణ్డులాంబునా ।
సకృత్పీత్వాత్విదంయోగంప్రదరాత్ప్రతిముచ్యతే ॥

తా॥ గోరింటవేళ్లు విప్పపట్ట తెల్లచందనము యష్టిమధుకము వీటిని బియ్యపుకడుగుతోనూరి పానముజేసిన స్త్రీకిగల ప్రదరరోగము నివర్తియగు.

బలాదికల్కము.

శ్లో॥ బలాంచాంశుమతీంద్రాక్షాప్యుశీరంతిక్తరోహిణీ ।
లవణాంచన్దనంకృష్ణాసారివాలోధ్రసంయుతా ।
ఏతత్కల్కంసమధుకంపాయయేత్తణ్డులాంబునా ।
త్ర్యహాత్ప్రశమయత్యేషయోషితాంపైత్తికాబుజః ॥

తా॥ చిట్టాముట్టివేళ్ళు కోలపొన్న ద్రాక్ష వట్టివేళ్ళు కటుకరోహిణి లవణము చందనము పిప్పళ్ళు సుగంధపాల లొద్దుగచెక్క వీట్లను బియ్యపు కడుగుతోనూరి కల్కముజేసి తేనెవేసి స్త్రీలు 3 దినములు పానముజేసిరేని ప్రదరము మొదలగు పిత్తరోగములు మానును.

కపిత్థాది కల్కము.

శ్లో॥ కపిత్థవేణుపత్రంచసమమేకత్రపేషయేత్ ।
మధునాసహపాతవ్యంతీవ్రప్రదరనాశనం ॥

తా॥ వెలగఆకు వెదురు ఆకులు వీట్లను సమముగానూరి కల్కముజేసి వాటిలా తేనెవైచి కలిపి స్త్రీ పుచ్చుకొనిన తీవ్రప్రదరరోగము మానును.

ఆమలకీ చూర్ణము.

శ్లో॥ మధునామలకీచూర్ణంరసంవాలేహయేత్సితే ॥

తా॥ ఉసిరికాయ చూర్ణముగాని వాటిరసములోగాని తేనెవేసి పుచ్చుకొ శ్వేతప్రదరము మానును.

సర్వప్రదరములకు అశోకాదిపానము.

శ్లో॥ అశోకవల్కలంపిష్ట్వాసతార్క్ష్యంతండులాంభసా ।
సక్షౌద్రంతద్రసంపీత్వాప్రదరాన్ముచ్యతేంగనా ॥

తా॥ అశోకవృక్షముయొక్కపట్ట రసాంజనము వీటిని బియ్యము కడుగుతో నూరి అందు తేనెవైచి స్త్రీలు యీ రసమును పానముజేసిరేని ప్రదరము నివర్తియ

వ్యాఘ్రినఖీమూల యోగము.

శ్లో॥ శుచిస్థానేవ్యాఘ్రినఖ్యామూలముత్తరదిగ్భవం ।
నీతముత్తరఫల్గున్యాంకటిబద్ధంహరేదసృక్ ॥

తా॥ శుద్ధప్రదేశమునందుండెడి పుల్లవెలగయొక్క ఉత్తరదిశయందు జనించి వేరును ఉత్తరాభాద్ర నక్షత్రమునందు శాస్త్రోక్తవిధానముగ తీసికొనివచ్చి ప్రద రోగముగ స్త్రీయొక్క కటిప్రదేశమునందు రక్షకట్టిన నీ ప్రదరము నివర్తియగు.

సర్వప్రదరచికిత్స.

శ్లో॥ మధునాతార్క్ష్యసంయుక్తంమూలంస్యాత్తండులీయకం ।
తండులాంబుయుతంపానాత్సర్వప్రదరనాశనం ॥

శుద్ధప్రదేశమునందు జనించిన చిర్రివేరును బియ్యపు కడుగుతోనూ

కల్కముజేసి రసాంజనము తేనెవైచి పుచ్చుకొనిన స్త్రీలకు గలిగిన సర్వప్రదరములు మానును.

## ఆఖుపురీషాది చూర్ణము.

శ్లో॥ ఆఖోఃపురీషంధాతక్యాఃపుష్పంబోలంతథైవచ ।
సమభాగానిసంచూర్ణ్యటంకమేకంచభక్షయేత్ ।
దినసప్తప్రయోగేణసర్వప్రదరనాశనం ॥

తా॥ ఎలుకపెంటికలు ఆరెపువ్వు రక్తబోళము వీటిని సమభాగములుగా చూర్ణముజేసి టంకప్రమాణము 7 దినములు పుచ్చుకొనిన సర్వప్రదరములు నివర్తియగు.

## పుష్యానుగ చూర్ణము.

శ్లో॥ పాఠారసాఞ్జనంముస్తంమజ్జాజంచామ్రయోస్తథా । అమ్బ
ష్ఠాకాశిలోద్భేదంసమంగాపద్మకేసరం । బిల్వంమోచరసంలో
ధ్రంకేసరంగైరికంతథా । విశ్వౌషధంకట్ఫలంచమరీచంరక్త
చందనం । కట్వంగంధాతకీద్రాక్షానంతామధుకమర్జునం।వత్స
కాతివిషేచేతిపుష్యేణోద్ధృత్యబుద్ధిమాణ్ । తుల్యభాగాని
సర్వాణి సూక్ష్మాణిచ విచూర్ణయేత్ । తచ్చూర్ణంమాక్షి
కోపేతం పీతంతణ్డులవారిణా । జయేదర్శాంస్యతిసారంతథా
రక్తప్రవాహికాం । బాలానాం క్రిమిరోగాంశ్చయోనిదాహా
ఇ్ఛయోషితాం । రజోదోషాంస్తంథాసర్వాన్ప్రదరాన్దు
స్తరానపి । పీతనీలారుణశ్వేతాత్సర్వాసేనవినాశయేత్। చూ
ర్ణంపుష్యానుగంనామపూర్వమాత్రేయభాషితం ॥

తా॥ అగళుశొంఠి రసాంజనము తుంగముస్తెలు నేరేడు మామిడి వీటియొక్క లోపట్ట కాచివేళ్ళు కొండపిండివేళ్ళు మంజిష్ఠ తామరకేసరములు బిల్వపిందెలు బూరగబంక లొద్దుగచెక్క నాగకేసరములు కావిరాయి శుంఠి కాయఫలము మిరియాలు రక్తచందనము పెద్దమానిపట్ట ఆరెపువ్వు ద్రాక్ష యష్టిమధుకము మద్దిపట్ట కొడిశపాలవిత్తులు అతివస వీటిని పుష్యమీనక్షత్రమునందు సంగ్రహించి ప్రత్యేకప్రత్యేకముగ చూర్ణముచేసి సమభాగములుగతీసుకొని ఆచూర్ణమును బియ్యపుకడుగులో

నైచి కల్కముజేసి వాటిలో తేనెనైచి పుచ్చుకొనిన అర్శ అతిసారము రక్తప్రవాహిక బాలురకు జనించెడి క్రిమిరోగములు స్త్రీలకు గలిగెడి యోనితాపము యోనిరోగము రజోదోషములు నలుపు యెరుపు పసపుగల సర్వప్రదరరోగములు నివతియగు. దీనిని పుష్యానుగ చూర్ణమని చరకమునందు (ఆత్రేయులు) వచించిరి.

జీరకావ లేహము.

శ్లో॥ జీరకంప్రస్థమేకంతుక్షీరంహ్యాఢకమేవచ । ప్రస్థార్థంలోహభస్మ తయోఃపచేన్మందేనవహ్నినా । లేహీభూతేథశీతేత్రిసితాప్రస్థం వినిక్షిపేత్ । చాతుర్జాతంకణావిశ్వామజాజీముస్తవాలకం । దాడిమంరసజంధాన్యంరజనీపటవాసకం । వంశజంచతవక్షీరీ ప్రత్యేకంశుక్తిసమ్మితం। జీరకస్యావలేహోయంప్రమేహప్రదరాపహః । జ్వరాబల్యాఋచిశ్వాస తృష్ణాదాహక్షయాపహః ॥

తా॥ జీలకఱ్ఱ 1 ప్రస్థము పాలు 1 ఆఢకము లోహభస్మము ½ ప్రస్థము నెయ్యి ½ ప్రస్థము వీటిని నొకపాత్రయందునిచి మందాగ్నిచే పాకముచేసి లేహ్యపక్వముగ దించుకొని చల్లారినపిదప 1 ప్రస్థము తెల్లచక్కెరనైచి పిదపదాల్చిన్ని లవంగపత్రి ఏలకులు నాగకేసరము పిప్పళ్ళు శొంఠి ఓమము తుంగముస్తెలు వట్టివేరు దాడిమచర్మము రసాంజనము ధనియాలు పసపు చేదుపొట్ల వెదురుప్పు తవక్షీరి వీటిని ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణముచేసి దినుసు 1 కి, 2 రూపాయల యెత్తుతీసికొ పైలేహ్యములో మిశ్రమముజేసి భక్షించిన ప్రమేహము ప్రదరరోగము జ్వరము అశక్తత అరుచి శ్వాస దాహము క్షయ వీటిని పోగొట్టును. దీనిని జీరవకావ లేహమని యెదరు.

ముద్గాది ఘృతము.

శ్లో॥ ముద్గమాషస్యనిర్యూహేరాస్నాచిత్రకముస్తకైః ।
సిద్ధంసపిప్పలీబిల్వై ఽ స్సర్పిశ్శ్రేష్ఠమసృగ్దరే ॥

తా॥ పెసలు ఉద్దులు సమూలాను కషాయముపెట్టి అందు సన్నరాష్ట్రి చిత్రమూలము తుంగముస్తలు పిప్పళ్ళు వీట్లను చూర్ణముచేసి పై చెప్పిన కషాయమును

లోవైచి నందు బిల్వపండు నెయ్యి వీట్లను తగుమాత్రముచేర్చి ఘృతపక్వముగా కాచి స్త్రీ పుచ్చుకొనిన రక్తప్రదరోగము మానును.

## శాల్మల్యాది ఘృతము.

శ్లో॥ శాల్మలీపుష్పనిర్యాసప్పృశ్నిపర్ణీత్థైవచ ।
కాశ్మరీచందనంచైషాంకల్కేనస్వరసేనవా ।
గవ్యంపచేద్ఘృతప్రస్థతస్సిద్ధంతరుణీపిబేత్ ।
సర్వప్రదరనాశాయబలవర్ణాగ్నివర్ధనం ॥

తా॥ బూరుగపుష్పము రసము కోలపొన్న గుమ్మడి వీటియొక్క వేళ్ళు చందనము వీట్లను కల్కముగాని స్వరసముగానిజేసి అందొక ప్రస్థము ఆవునెయ్యి వైచి ఘృతపక్వముకాచి స్త్రీలుపుచ్చుకొనిన సమ్పూర్ణప్రదరము హరించుటయేగాక బలమును అగ్నిదీపనమును గలుగంజేయు.

## ప్రదరారి రసము.

శ్లో॥ రసంగన్ధంమృతంనాగంసమంతైస్తురసాంజనం ।
సర్వైస్సాన్త్రుతులితంలోధ్రిందినంపిష్టంవృషద్రవైః ।
ద్వివల్లోమధుయుక్తోయంప్రదరారిరసశ్శుభః ।
దుస్సాధ్యంప్రదరంహన్తిరక్తాతీసారనాశనః ॥

తా॥ శుద్ధిచేసినరసము 1 గంధకము 1 నాగభస్మము 1 ఈ 3 కి సమము రసాంజనము 3 కన్నిటికిసమము లొద్దుగ పట్టచూర్ణము 6 భాగములు వీటిని కల్వములోవేసి అడ్డసరపురసముతో 1 దినము మర్దించి రెండువల్ల ప్రమాణములు మాత్రలుచేసి తేనె అనుపానముతో స్త్రీలు పుచ్చుకొనిన దుస్సాధ్యమయిన ప్రదరరోగము రక్తాతిసారము ఇవి హరించు.

## ఆమలకబీజ కల్కము.

శ్లో॥ జలేనామలకీబీజకల్కంసమధుశర్కరం ।
పిబేద్దినత్రయేణైవశ్వేతప్రదరనాశనం ॥

తా॥ ఉసిరికవిత్తుల నుదకము వేసినూరి కల్కముజేసి తేనె శర్కర వీటినికలిపి 3 దినములు ప్రాతఃకాలమున స్త్రీ పుచ్చుకొనిన శ్వేతప్రదరము మానును.

## నాగకేసర యోగము.

శ్లో॥ తక్రోదనాహారరతాసంపిబేన్నాగకేసరం ।
త్ర్యహాంతకేణసంపిష్టం శ్వేతప్రదరనాశనం ॥

తా॥ నాగకేసరములయందు ఆవుమజ్జిగవేసినూరి 3 దినములు పుచ్చుకొ.. మజ్జిగ యన్నము భుజించిన స్త్రీలకు శ్వేత ప్రదరము మానును.

## సోమరోగ నిదానము.

శ్లో॥ స్త్రీణామతిప్రసంగాద్వాశోకాచ్చాపిభ్రమాదపి ।
అతిసారకయోగాద్వాగరదోషాత్తథైవచ ।
ఆపఃసర్వశరీరస్థాఃక్షుభ్యంతిప్రస్రవంతిచ ।
తస్యాస్తాఃప్రచ్యుతాఃస్థానాత్ మూత్రమార్గంవ్రజంతిహి॥

తా॥ అతిమైథునము శోకము భ్రమ అతిసారము విషదోషము వీటివలన స్త్రీ యొక్క శరీరమంతయు వ్యాపించిన నీరు మిగుల క్షోభనుజెంది యోనిద్వారమున.. జేరి స్రవించుచుండు. ఇది సోమరోగమనంబడు.

## సోమరోగలక్షణము మఱియునిరుక్తి.

శ్లో॥ వేగంధారయితుంతాసాంనవిందతిసుఖంక్వచిత్ । శిరశ్శిథిలతా తస్యాఃముఖంతాలుచశుష్యతి । మూర్ఛాజృంభాప్రలాపశ్చ త్వగ్రూక్షాచాతిమాత్రతః । భక్ష్యైర్భోజ్యైశ్చపేయైశ్చన తృప్తింలభతేసదా । సంధారణాచ్ఛరీరస్యాతాఆపః సోమసంజ్ఞితాః తతఃసోమక్షయాస్త్రీణాంసోమరోగఇతిస్మృతః ॥

తా॥ సోమరోగముగలిగినేని అపుడు స్త్రీదానియొక్క వేదన సహించు.. సుఖమును జెందక పోవుటయేగాక శిరఃశైథిల్యము ముఖము దవడలు వీటి శోషమూర్ఛ ఆవలింతలు ప్రలాపము చర్మము మిగుల రూక్షగనుండుట భక్ష్య.. భోజ్యము పేయము వీటియందు తృప్తిలేక పోవుట ఇట్టిలక్షణములు గలిగినదిగయు మఱియు శరీరమంతయు వ్యాపించియుండెడి నీరుశరీరమును ధారణచేయుట.. [illegible] ..మం.. నంబడు. ఈ నీరే అతిమైథునాదులవలన మిగుల క్షోభనుజెం.. ..మరోగమనంబడు.

## మూత్రాతిసారము.

శ్లో॥ తస్మాత్సోమక్షయాద్దేహానిశ్చేష్టశ్చభవేత్సదా ।
సవ్యసరుజస్సోమోమూత్రేణస్రవతేముహుః ।
సోమలక్షణసస్పృష్టఃకాలాతిక్రాంతయోగతః ।
సోమఃకాంజీక్రమేణైవస్రవేన్మూత్రమభీక్ష్ణశః ।
మూత్రాతిసారఇత్యేవంతమహుర్బలనాశనం ॥

తా॥ ఇటుల శరీరమంతయు వ్యాపించి సోమసంజ్ఞనుజెందియుండెడి ఉదకము క్షయించుటవలన దేహము యెల్లపుడు నిశ్చేష్టితముగనుండు. ఆసోమరోగమేవ్యథతో గూడినదై మూత్రముతోగలసి పలుమారు స్రవించుచునుండు. మఱియు ఈ సోమ రోగమే కొన్నిదినములకు పిదప సోమరోగలక్షణములుగలదై కాంజికస్వరూపము జెంది మాటిమాటికి మూత్రముతోగలిసి స్రవించునేని నది మిగుల దుర్బలకరమగు మూత్రాతిసారమని చెప్పంబడు.

## సోమ లక్షణము.

శ్లో॥ బహుళావిమలాశ్శీతానిర్గంధానీరుజాసితా ।
స్రవంతిచాతిమాత్రంస్యాత్ సాశక్తాచాతిదుర్బలా ॥

తా॥ పైజెప్పిన మూత్రాతిసారము విస్తారముగను శీతలముగను గంధవిహీన ముగను ఉపద్రవములేనిదిగను తెలుపు వర్ణముగలదై మిగుల అతిసారివమగలిగి స్త్రీ లకు అతిదౌర్బల్యమును గలుగంజేయు.

## సోమరోగ చికిత్స.

శ్లో॥ సవ్యసరుజఃసోమఃస్రవేన్మూత్రేణచేన్ముహుః ।
తత్రైలాపత్రిచూర్ణేనపాయయేత్తరుణీంసురాం ॥

తా॥ పై జెప్పిన సోమరోగము వేదనతోగూడి పలుమారు మూత్రముతోగలిసి బయలు వెడలిన ఏలకులు లవంగపత్రి వీటిని చూర్ణముచేసి మద్యముతోకలిపి స్త్రీ పాన ముజేసిన సోమరోగము నివర్తించును.

## తాలకందాది చూర్ణము.

శ్లో॥ తాలకందంచఖర్జూరీంమధూకంచవిదారికాం ।

సితాంమధుయుతాంఖాదేన్మూత్రాతీసారనాశనం ॥

తా॥ నేలతాటిగడ్డలు ఖర్జూరము యష్టిమధుకము నేలగుమ్మడు వీ-చూర్ణముచేసి తేనెశర్కరతో మిశ్రమముచేసి స్త్రీ భక్షించిన మూత్రాతిసారము నశించు.

చక్రమర్దక కల్కము.

శ్లో॥ చక్రమర్దకమూలన్తుసంపిష్టంతండులాంబునా ।
ప్రభాతసమయేపీతంజలప్రదరనాశనం ॥

తా॥ తగిరిశవేళ్ళను బియ్యపు కడుగుతోనూరి కల్కముజేసి ప్రాతఃకాలమందు స్త్రీ పుచ్చుకొనిన జలప్రదరము నశించు.

సోమిరోరి రసము.

శ్లో॥ కూష్మాండపత్రస్య స్వరసైః పక్వంపారదనిష్కకం ।
ద్వినిష్కంగన్ధకంక్షిప్త్వా జ్వలనేకజ్జలీకృతం ।
అనూచమరిచైఃసోమరోగాతిస్రవినాశనం ॥

తా॥ గుమ్మడిఆకు స్వరసములో శుద్ధిచేసిన పాదరసము నొక నిష్కమునైచు పచనముచేసి అందుండు పాదరసమునుతీసి గంధకము 2 నిష్కములువేసి వీటిని పక్కముగాకజ్జలిచేసి అందు మిరియాలచూర్ణము మిశ్రమముచేసి దేహప్రకృతినియోం స్త్రీ పుచ్చుకొనిన సోమరోగము అతిసారము ఇవి నశించు.

కదళీఫలీల యోగము.

శ్లో॥ కదలీనాంఫలంపక్వంధాత్రీఫలరసంమధు ।
శర్కరాసహితంఖాదేత్సోమదారణముత్తమం ॥

తా॥ పక్వముగపండిన అరటిపండు ఉసిరికకాయలరసము తేనె శర్కర వీ సేకముగపిసికి స్త్రీభక్షించిన సోమరోగము మానును.

కదళీకంద ఘృతము.

శ్లో॥ కదళీకందనిర్యాసద్రోణేశతపలాన్వితం । కదళీకుసుమంపక్వం
క్వాథంపాదావశేషితం। ఘృతప్రస్థంపయస్తుల్యంపిప్పల్యేలాల ·

వంగకం । కపిత్థస్య ఫలంమాంసికదలీకన్దచన్దనం । న్యగ్రోధా
దిగణే సార్ధంసర్వాన్వారిసముద్భవాః । సర్వంసమంకర్షమా
త్రం కల్కీకృత్వాపచేచ్ఛనైః । ఘృతంక్వాథంచకల్కంచ
పక్వా వైద్యావతారయేత్ । ప్రాతఃకాలేపిబేన్నిత్యంసేవయే
త్కర్షమాత్రకం। సోమరోగహరందాహంమూత్రకృచ్ఛ్రాశ్మ
రీతథాప్రమేహాన్వింశతింహన్యాత్ప్రమేహగజకేసరీ। మూత్రా
తిసారమప్యన్యేవ్యాధివిధ్వంసయేద్ధ్రువం । కదలీకందనామేదం
ఘృతంసర్వరుజాపహం ॥

తా॥ అరటిగడ్డల రసము 1 ద్రోణము దానియందు ముదిరిన అరటిపూల కేసరములు 100 పలములువైచి అగ్నియందునిచి కషాయముకాచి నాలుగింటిలో నొక భాగము మిగులునటుల దించుకొని వాటిలో 1 పడి నెయ్యి 1 పడి పాలు పిప్పళ్ళు ఏలకులు లవంగములు వెలగఫలము జటామాంసి అరటిగడ్డ చందనము (న్యగ్రోధాదిగణములలో పఠించిన ద్రవ్యములు) (న్యగ్రోధాది) మఱ్ఱి మామిడి జువ్వి రావి అత్తి వీటి పట్టలను ప్రత్యేక ప్రత్యేకముగ కల్కముజేసి కమలములరసమును ప్రత్యేక ప్రత్యేక కర్షమాత్రము పైజెప్పిన కషాయమునందు కలిపి అగ్నియందునిచి ఘృతపక్వముగ కాచి దించుకొని దానిని ప్రతిదినము ప్రాతఃకాలమునందు కర్షమాత్రము పుచ్చుకొనిన స్త్రీలకు సోమరోగము హరించు. మఱియు దాహము మూత్రకృచ్ఛ్రము అశ్మరీ యిరువై విధముల ప్రమేహములు మూత్రాతిసారము యివియును మానును. ఇది కదలీ కందఘృతమని జెప్పంబడు.

సోమరోగ ప్రమేహపిటికారోగ వివరణము.

శ్లో॥ సోమరోగస్తథాచైకః ప్రమేహపిటికాదశ ।
శరావికాకచ్ఛపికాపుత్రిణీవినతాలజీ ।
మసూరికాకర్షపికాజాలినీచవిదారికా ।
విద్రధిశ్చదశైతాస్స్యుః పిటికామేహసంభవాః ॥

తా॥ శరీరమంతటనుండెడు నీరుక్షుభితమై మూత్రద్వారంబున బయలు వెడలుట సోమరోగమనియు ప్రమేహములకు చికిత్స చేయకుండుటచే బుట్టెడు పిటికలు

ప్రమేహపిటికలనియు బరంగు. అందు ప్రమేహపిటికలు శరావిక కచ్ఛపిక పుత్రిణి వినత అలజి మసూరిక సర్షపిక జాలిని విదారిక విద్రధులన 10 విధంబులు.

పిటికలన నొప్పిలేని చిన్నకురుపులు. (గుల్లలు) ఇవి సంధులయందును మర్మస్థానములయందును మాంసవృద్ధియగు స్థలములయందును శరీరమున మేదస్సు దుష్టమగుటచేబుట్టు. అందు మధ్యమున పల్లముగను చుట్టు నెత్తురుగను మూకుడువలె నుండునవి శరావికమనియు తాబేలువలెనుండి మంటలతోగూడినవి కచ్ఛపికమనియు గొప్పకురుపులయి వాటిపైన గసగసాలవంటి గుల్లలుగలుగుట పుత్రిణియనియు వెనుపైనేని కడుపుపైనేని నీలవర్ణముగల గొప్పగుల్లలుపుట్టి వాటిమూలంబున జూరుకుపోట్లును గలిగియుండుట వినతయనియు పైజెప్పిన స్థానంబులయందును చర్మముపైన దారుణమగు గొప్పకురుపులై వేదననిచ్చుచు బక్కమైపగిలిన పిదప రక్త కృష్ణవర్ణములుగలిగి దాహము మోహము జ్వరము మొదలగునవి గలిగియుండుట అలజియనియు మసూరిక ప్రమాణముగలవి మసూరికయనియు తెల్లఆవాలవలె నుండునవి సర్షపికమనియు మిగుల మంటలుగలిగి మాంసయుక్తమగునవి జాలినియనియు నేలగుమ్మడిగడ్డవలె గట్టిగను లావుగనుండిన విదారికమనియు విద్రధివలెనుండునవి విద్రధియనియు పేర్కొనంబడు.

## స్త్రీరోగాంతర్గత - ఆర్తవదోషము.

శ్లో॥ అథస్త్రీరోగనామానివోచ్యంతేపూర్వశాస్త్రతః ।
అష్టావార్తవదోషాస్సుర్వాతపిత్తకఫైస్త్రిధా ।
పూయభంకుణపంగ్రంధిః క్షీణామలసమంతథా ॥

తా॥ సకల శాస్త్రంబులను వీక్షించి స్త్రీ రోగంబులను సంగ్రహంబుగ వచించెదను. అందు రజస్సంబంధదోషములు వాత పిత్త శ్లేష్మ పూయాభ కుణప గ్రంధి క్షీణ మలసమములని 8 విధంబులుగనుండు.

## విశుద్ధార్తవ లక్షణము.

శ్లో॥ మాసాన్నిపిచ్ఛదాహార్తిపంచరాత్రానుబంధిచ ।
నైవాతిబహుళంచాల్పమార్తవంశుద్ధమాదిశేత్ ।
శశాస్సృక్ప్రతిమంయచ్చయద్వాలాక్షారసోపమం ।

తదార్తవంప్రశంసంతియచ్చాప్సునవిరజ్యతే ॥

తా॥ స్త్రీలకు మాసముపూర్తియైన పిదప పిచ్ఛిలత్వము దాహము చురుకు ఇవి లేనిదిగను మిగుల నధికముగాక తక్కువనుగాక కుందేలు రక్తము లాక్షారసము వీటి వర్ణముగలదై బయలు వెడలి 5 దినములు అనువర్తించుటయగాక జలసంబంధముగలిగిన నది మిగుల యెరుపుగాకయుండిన నారజస్సు నిర్దుష్టమని నెరుంగవలయు.

## యోనిరోగములు.

శ్లో॥ ఉదావర్తాతథావంధ్యావిప్లుతాచపరిప్లుత । వాతలాయోనిబుక్ జ్ఞేయా వాతరోగేణపఞ్చధా । పఞ్చధాపిత్తదోషేణతత్రాదాలోహితక్షయా । ప్రస్రంసినీవామనీచ పుత్రఘ్నీపిత్తలాతథా । అల్పానందాకర్ణినీచ చరణానందపూర్వికా । అతిపూర్వాచతాజ్ఞేయా శ్లేష్మలాచకఫాదిమాః । షండ్యండినీచమహతీసూచీవక్త్రాత్రిదోషజా । పంచైతాయోనయః ప్రోక్తా సర్వదోషప్రకోపతః ॥

తా॥ యోనిరోగములు వాతము పిత్తము శ్లేష్మము సన్నిపాతము వీటి భేదములు ప్రత్యేక ప్రత్యేకముగ 5 విధంబులుగనుండు.

ఉదావర్తము వంధ్య విప్లుతా మరిప్లుతా వాతల ఈ 5 న్ను వాత దోషముచే జనించెడి యోనిరోగములని యెరుంగవలయు. మఱియు లోహితక్షయము ప్రస్రంసిని వామిని పుత్రఘ్నీ పిత్తలా ఈ 5 న్ను పిత్తదోషమువలన జనించెడి యోనిరోగములని యెఱుంగవలయు. మఱియు అల్పానంద కర్ణినీ అతిచిరణా అత్యానంద శ్లేష్మల ఈ 5 న్ను శ్లేష్మమువలన జనించిన యోనిరోగములని యెఱుంగవలయు. మఱియు షండిని అండిని మహతీ సూచీవక్త్రా త్రిదోషజ అననీ 5 ను సన్నిపాతమువలన జనియించెడి యోనిరోగములని యెరుంగవలయు.

## ఉపద్రవములయొక్క నిదానము.

శ్లో॥ వింశతిర్వ్యాపదోయోనేర్నిర్దిష్టారోగసంగ్రహే ।
మిథ్యాహారేణతాః స్త్రీణాంప్రదుష్టేనార్తవేనచా ।
జాయంతేబీజదోషాచ్చదైవాచ్చశృణుతాఃపృథక్ ॥

తా॥ మథ్యాహారము ప్రదుష్టమైన ఆర్తవము బీజదోషము జన్మాంతరపాప కర్మము వీట్లచే స్త్రీలకు ఇరువది సంఖ్యగలదై యోనివ్యాపదలని పేరొందనంబ యోనిరోగములు రోగసంగ్రహమునందు నుదహరించబడియున్నయవి వాటి వివరణ ప్రత్యేకముగ చెప్పంబడును.

## వాతజయోనిరోగ నిదానము.

శ్లో॥ సాఫేనిలముదావృత్తారజఃకృచ్ఛ్రేణముంచతీ ।
వంధ్యాందుష్టార్తవాంవింద్యాద్విప్లుతాంనిత్యవేదనాం ।
పరిప్లుతాయాంభవతిగ్రామ్యధర్మేణరుక్భృశం ।
వాతలాకర్కశాస్తబ్ధాశూలానిస్తోదపీడితా ।
చతసృష్వపిచాద్యాసుభవంత్యనిలవేదనాః ॥

తా॥ వాతదోషమువలన జనించిన 5 యోనిరోగములలో ఉదావర్తమునం నురుగుగలదిగను కష్టముగలదిగను వంధ్యయందు దుష్టార్తవముగలదిగను విప్లుతయం నిత్యవేదన గలదిగను పరిప్లుతయందు మైథునాతిశయముచే మిగుల చురుకుగలది. వాతలమునందు కఠోరముగను స్తబ్ధముగను పోట్లు వ్యథ ఇవిగలదిగను రజస్సుబయట వెడలు. మఱియు మొదటిదియగు ఉదావర్తాది 4 యోనిరోగములయందు మిగుల వాతవేదన జనించు.

## పిత్తజయోనిరోగ నిదానము.

శ్లో॥ సదాసంక్షీయతేరక్తంయస్యాస్సాలోహితక్షయా । సవాతము ద్వమేద్బీజంవామినీరజసాన్వితం । ప్రస్రంసినీస్రంసతేక్షుభ్యోభి తాదుఃప్రజాయినీ । స్థితంస్థితంహంతిగర్భంపుత్రఘ్నీరక్తసంక్ష యాత్ । అత్యర్థంపిత్తలాయోనిర్దాహపాకజ్వరాన్వితా।చత సృష్వపిచాద్యాసుపిత్తలింగోచ్ఛ్రయోభవేత్ ॥

తా॥ పిత్తదోషమువలన జనించిన 5 యోనిరోగములలో లోహితక్షయ నందు ప్రతిమాసమున స్త్రీలకు బయలువెడలెడి రక్తము దాహముతోగూడి క్షయిం మఱియు వామినియందు ప్రతిమాసమున బయలువెడలెడి రక్తము వాతము గూడి గర్భోత్పత్తికి కారణమగు శుక్రమును బయలువెడలంజేయు. మఱియు ప్రస్రంసినియందు రజస్సు బయలువెడలునపుడు వాపుగలిగి మాంస బయలు వె

తనహస్తముతో మర్దనచేసికొనిన అదినిలుచును. మఱియు నాయోనియందుండు రక్తము క్షయించు. పుత్రఘ్నియందు ప్రతిమాసమున బయలువెడలెడి రక్తము క్షయించుట వలన అపుడపుడు జనించెడి గర్భము నశించు. మఱియు పిత్తలమునందు మిగులదాహము యోనియందు వ్రణము జ్వరము వీటితోఁగూడినదై ప్రతిమాసమున రక్తము బయలు వెడలు. మఱియు మొదటిదియగు లోహితక్షయము మొదలు 4 యోనిరోగములయందు పిత్తదోషముయొక్క గురుతులు మిగుల గనుబడు.

## శ్లేష్మజయోనిరోగ నిదానము.

శ్లో॥ అల్పానందానసంతోషంగ్రామ్యధర్మేణగచ్ఛతి । కర్ణిన్యాం కర్ణికాయోనౌ శ్లేష్మాసృగ్భ్యాం ప్రజాయతే । మైథునాచరణా త్పూర్వంపురుషాదతిరిచ్యతే । బహుశశ్చాతిచరణాత యోర్బీజంనవిందతి । శ్లేష్మలాపిచ్ఛిలాయోనికండూయుక్తాతిశీతలా। చతసృష్వపిచాద్యాసుశ్లేష్మలింగోద్భవోభవేత్ ॥

తా॥ శ్లేష్మజదోషమువలన జనించెడి 5 యోనిరోగములలో అల్పానందము నందు పురుషసంయోగమువలన జనించెడి యే యానందముకలదో అది స్త్రీకి జనించదు మఱియు కర్ణినియందు శ్లేష్మము రజస్సు వీటిసంమేళనముచే యోని కమలమునందు కర్ణికయుదయించు. కర్ణికయనగా తామరకమలమునందుండెడిమిద్దె. మఱియు అతిచరణము అత్యానందము యీ రెంటియందు క్రమముగ పురుష సంభోగమునకు ముందే స్త్రీలకు యోనిద్రవించు. ఇది అతిచరణము. మఱియు అత్యానందమునందు పలుమారు స్త్రీలకు పురుషసంభోగేచ్ఛగలుగు. యీ రెంటియందును స్త్రీలకు గర్భోత్పత్తిజనించదు. మఱియు శ్లేష్మలయందు యోని జిగట దురద అతిశీతలము ఇవి గలదిగనుండు. మఱియు మొదటిదియగు అల్పానందము మొదలగు 4 గు యోనిరోగములయందు శ్లేష్మప్రకోపచిహ్నంబులు మిగుల నగుబడు.

## వాతకీ లక్షణము.

శ్లో॥ విషమస్థాంగశయనభృశమైథునసేవనైః । దుష్టార్తవాదపద్రవైర్బీజదోషేణదైవతః ॥ యోనౌకుప్యతోనిలఃకుర్యాద్రుక్తోదాయామసుప్తతాః। పిపీలికాసృప్తిమివస్తంభంకర్కశతాం స్వనమ్ ॥ ఫేనిలారుణకృష్ణాల్పతనురూక్షార్తవస్రుతిమ్ ।

ప్రసంసంవంక్షణపార్శ్వేదౌన్యథాంగుల్మంక్రమేణచ॥ తాంస్తాం
శ్చసాన్వేగదాన్వ్యాపద్వాతకీనామసాస్మృతా ॥

తా॥ మిట్టపల్లములయందు శయనించుట అధికముగ సంభోగముచేయుట ద్రవము లేజదోషము మొదలగు వాటిచే వాతము ప్రకోపించి యోనియందు పోట్లు ఆయామవాతము సుప్తత చీమలు పాకులాడునటులుండుట యోనిస్తబ్ధత్వము కఠినత్వము శబ్దము యివి కలుగుట నురుగుతోగూడినదిగను యెర్రగనను స్వల్పముగను శోణితము స్రవించుట. గజ్జలు పార్శ్వములుజారుట విశేష కలుగుట గుల్మము అనేక విధరోగములు యివి క్రమముగపుట్టుట యిట్టి లక్షణ గలది వాతకీరోగ మనబడును.

అతిచరణయోని లక్షణము.

శ్లో॥ పైవాతిచరణాశోఫసంయుక్తాతివ్యవాయతః ।

తా॥ విశేషముగ సంభోగము సలుపుటవలన పైవాతకీరోగమునందు కలుగును. ఈ రోగము అతిచరణ యనబడును.

ప్రాక్చరణా లక్షణము.

శ్లో॥ మైథునాదతిచాలాయాఃపృష్ఠజంఘోరువంక్షణమ్ ।
రుజన్సందూషయేద్యోనింవాయుఃప్రాక్చరిణేతిసా ॥

తా॥ బాలగానుండు స్త్రీ ప్రథమ ఋతుమతియగుటకుముందు సంభోగము చేయుటవలన వాతము ప్రకోపించి వీపు పిక్కలు తొడలు గజ్జలు వీటియందు గలిగి యోనినిదూషించును. ఈ రోగము ప్రాక్చరణమనబడును.

ఉదావృత్తా లక్షణము.

శ్లో॥ వేగోదావర్తనాద్యోనింప్రపీడయతిమారుతః ।
సఫేనిలంరజః కృచ్ఛ్రాదుదావృత్తంవిముంచతి ॥
ఇయంవ్యాపదుదావృత్తా ॥

తా॥ శోణితవేగము నడ్డగించుటచే వాతము యోనియందు అధికపీడను కలుగజేయు. దానివలన ఆయోనియందుండి నురుగుతోగూడిన రజస్సు మిగుల కష్టముగా వెడలును. ఈ రోగము ఉదావృత్తమనబడును.

## జాతఘ్నీ లక్షణము.

శ్లో॥ జాతఘ్నీతుయదానిలః ।
జాతంజాతంసుతంహంతిరౌక్ష్యాద్దుష్టార్తవోద్భవమ్ ॥

తా॥ దుష్టార్తవమువలన పుట్టిన శిశువును వాతము వెంటనే జంపును. ఈ రోగము జాతఘ్నియనబడును.

## అంతర్ముఖీ లక్షణము.

శ్లో॥ అత్యాశితాయావిషమంస్థితాయాస్సురతేమరుత్ ।
అన్నేనోత్పీడితోయోనేస్థ్సితస్రోతసివక్రయేత్ ॥
సాస్థిమాంసంముఖంతీవ్రరుజమంతర్ముఖీతిసా ॥.

తా॥ అధిక అన్నము భుజించి మిట్టపల్లముగల భూమిపై పరుండిన స్త్రీకి సంభోగసమయమున వాతము అన్నముతో చేరి యోనిలోని స్రోతస్సునుజేరి యాయోని ముఖమును అధిక బాధచెందునదిగను వంకరగను జేయును. ఈ రోగము అంతర్ముఖీ యనబడును.

## సూచీముఖీ లక్షణము.

శ్లో॥ వాతలాహారసేవిన్యాం జనన్యాంకుపితోనిలః ।
స్త్రియోయోనిమణుద్వారాంకుర్యాత్సూచీముఖీతిసా ॥

తా॥ వాతప్రకోపకరమైన యాహారములను గర్భస్త్రీ భుజించినయెడల వాతము ప్రకోపించి గర్భములోనుండు స్త్రీ శిశువుయొక్క యోనిద్వారమును సూక్ష్మముగ జేయును. ఈ రోగము సూచీముఖీ యనబడును.

## శుష్కాఖ్యా లక్షణము.

శ్లో॥ వేగరోధాదృతౌవాయుర్దుష్టోవిణ్మూత్రసంగ్రహమ్ ।
కరోతియోనేశ్శోషంచశుష్కాఖ్యాసాతివేదనా ॥

తా॥ ఋతుకాలమున మలమూత్రవేగముల నడ్డగించుటవలన వాతము దుష్టంబై మలమూత్రముల నడ్డగించి యోనిని శుష్కింపజేసి మిక్కిలి వేదనతో గూడియుండునటుల జేయును. ఈ రోగము శుష్కరోగ మనబడును.

## వామినీ లక్షణము.

శ్లో॥ షడహాత్సప్తరాత్రాద్వాశుక్రంగర్భాశయాన్మరుత్ ।
వమేత్సరుజ్నీరుజోవాయస్యాస్సావామినీమతా ॥

తా॥ దుష్టవాతము ఋతుస్నానమునకు పిదప 6, 7 దినములలో మరల స్త్రీ గర్భాశయమునుండి నొప్పితోగాని నొప్పిలేకగాని శుక్రమును బైలుపరుచును. ఈ రోగము వామినీ యనబడును.

## షండ లక్షణము.

శ్లో॥ యోనౌవాతోపతప్తాయాం స్త్రీగర్భేబీజదోషతః ॥
నృద్వేషిణ్యస్తనీచస్యాత్షండసంజ్ఞానుపక్రమా ॥

తా॥ యోనివాతముచే పీడింపబడియుండు సమయమున స్త్రీ పురుషసంపర్కముచేసి అందుచే గర్భము ధరించినయెడల బీజదోషమువలన నాగర్భములోనుండి [illegible]ంచిన స్త్రీ శిశువు స్తనములు లేనిదిగను పురుషుని ద్వేషించునట్టి స్వభావము గల[illegible] నగును. ఈ రోగము షండరోగ మనబడును. ఇది అసాధ్యము.

## మహాయోని లక్షణము.

శ్లో॥ దుష్టోవిష్టభ్యయోన్యాస్యంగర్భకోష్ఠంచమారుతః ।
కురుతేవివృతాంస్రస్తాంవాతకీమివదుఃఖితామ్ ॥
ఉత్పన్నమాంసాంతామాహుర్మహాయోనింమహారుజామ్ ॥

తా॥ వాతము దుష్టంబై యోనిముఖమును గర్భకోష్ఠముమజేరి యా[illegible] ముఖము తెరవబడినదిగను జారినదిగను వాత రోగమువలె మిక్కిలియుపద్రవములు గూడినదిగను మాంసము బైటి వచ్చియుండునదిగను జేయును. ఇది మహాయో[illegible]

## పైత్తికీ లక్షణము.

శ్లో॥ యథాపైత్తిర్దూషణైర్దుష్టంపి యోనిముపాశ్రితమ్ ।
క[illegible]దాహ[illegible]షాపూతిగం జ్వరాన్వితామ్ ।
[illegible] [illegible]నీలపీతాసితార్తవామ్ ॥
[illegible] పైత్తికీ

తా॥ సమస్తరోగనిదానాధ్యాయమునందు చెప్పబడియుండు పిత్తప్రకోప కారణములచే దుష్టమైన పిత్తము యోనిలో ప్రవేశించి తాపము పాకము మంట దుర్గంధము జ్వరము వీటిని కలుగజేసి మిక్కిలి యుష్ణముగను అధికముగను పీనుగ వాసనగలదిగను నల్లగను పసపురంగును కొంచెము తెల్లగనునుండు ఆర్తవమును రక్తమును యోనియందుండి స్రవింపజేయును. ఈ రోగము పైత్తికీయనబడును.

### రక్తయోని లక్షణము.

శ్లో॥ రక్తయోన్యాఖ్యాసృగతిస్రుతేః ॥

తా॥ యోనిలోనుంచి విశేషముగ రక్తము స్రవించిన యారోగము రక్తయోని యనబడును.

### శ్లైష్మికీ లక్షణము.

శ్లో॥ కఫోభిష్యందిభిఃక్రుద్ధః కుర్యాద్యోనిమవేదనామ్ ।
శీతలాంకండులాంపాండు పిచ్ఛిలాంతద్విధస్రుతిమ్ ।
సావ్యాపచ్ఛ్లైష్మికీ ॥

తా॥ కఫప్రకోపకారణములచే శ్లేష్మము ప్రకోపించి యోని వుపద్రవము లేక యుండుట శీతలము దురద తెల్లనిరంగు జిగట వీటితోగూడియుండు స్రావముగలదిగ జేయును. ఈ రోగము శ్లైష్మికీయనబడును.

### లోహితక్షయా లక్షణము.

శ్లో॥ వాతపిత్తాభ్యాంక్షీయతేరజః ।
సదాహకార్శ్యవైవర్ణ్యంయస్యాంసాలోహితక్షయాః ॥

తా॥ దుష్టమగు వాతపిత్తములచే రజస్సు క్షీణించి యోనియందుమంట కార్శ్యము వికారవర్ణము యివి కలుగును. ఈ రోగము లోహితక్షయమనబడును.

### పరిప్లుతా లక్షణము.

శ్లో॥ పిత్తలాయాన్నృసంవాసేక్షవథూద్గారధారణాత్ ।
పిత్తయుక్తేనమరుతాయోనిర్భవతిదూషితా ॥

శూనాస్పర్శాసహాసార్తిర్నీలపీతాస్రవాహినీ ।
వస్తికుక్షిగురుత్వాతిసారారోచకకారిణీ ॥
శ్రోణివంక్షణరుక్తోదజ్వరకృత్సాపరిప్లుతా ॥

తా॥ పిత్తము అధికముగనుండు స్త్రీకి పురుష సంభోగమువలనను దగ్గు తే వీటిని నడ్డగించుటచేతను వాతము పిత్తముతో జేరి యోనికి చెరుపును గలుగజేయు. అందుచే యోనియు బ్బినదిగను తాకిన సహించకుండునదిగను నొప్పిగలదిగను నలు పసుపువర్ణములుగల రక్తస్రావముగలదిగను నగును. మఱియు అట్టి స్త్రీకి వ కడుపునందును కడుపునందును గురుత్వము అతిసారము అరోచకము పిక్కలు గజ్జ వీట్లయందు పోట్లు శూలజ్వరము వీటిని గలుగజేయును. ఈ రోగము పరిప్లుత మ బడును.

## ఉపప్లుతా లక్షణము.

శ్లో॥ వాతశ్లేష్మామయవ్యాప్తా శ్వేతపిచ్ఛిలవాహినీ ॥
ఉపప్లుతాస్మృతా యోనిః ॥

తా॥ స్త్రీయోని వాతశ్లేష్మములచే బాధింపబడి తెల్లగను జిగటగనును స్రావముతో చేరినదిగను నగును. ఈ రోగము ఉపప్లుతా యనబడును.

## విప్లుతా లక్షణము.

శ్లో॥ విప్లుతాఖ్యాత్వధావనాత్ ।
సంజాతజంతుఃకండూరాకండ్వాచాతిరతిప్రియా ॥

తా॥ యోనిని బాగుగ కడగకుండుటచే దానియందు క్రిములు (పురు- పుట్టి అధికదురదను పుట్టించును. దానివలన నకస్మాత్తుగ పురుష సంపర్కమును నిత్య యిచ్ఛకలుగును, ఈ రోగము విప్లుత మనబడును.

## కర్ణినీ లక్షణము.

శ్లో॥ అకాలవాహనాద్వాయుశ్శ్లేష్మరక్తవిమూర్ఛితః ।
కర్ణికాంజనయేద్యోనౌరజోమార్గనిరోధినీమ్॥ సాకర్ణినీ ॥

తా॥ అకాలమునందు రజస్సు స్రవించుటచే వాతము ప్రకోపించి కఫర క్తములచే యోనియందు రజోమార్గము నడ్డగించునట్టి కర్ణికను పుట్టించును

ఈ రోగము కణికా నీ యనబడును.

## సాన్ని పాతికీ లక్షణము.

శ్లో॥ త్రిభిర్దోషైః ప్రకోపైర్యోనిర్గర్భాశయాశ్రితైః ।
యథాస్వోపద్రవకరైర్వ్యాపత్సాసాన్నిపాతికీ ॥

తా॥ త్రిదోషములు ప్రకోపించి అవియోని గర్భాశయము నీటినిజేరి పెక్కు బాధలను గలుగజేయును. ఈ రోగము సాన్నిపాతికీ యనబడును.

శ్లో॥ ఇతియోనిగదానారీర్యైశ్శుక్రంనప్రతీచ్ఛతి ।
తతోగర్భంనగృహ్ణాతిరోగాంశ్చాప్నోతిదారుణాన్ ।
అసృగ్దరార్శోగుల్మాదీనాబాధాశ్చానిలాదిభిః ॥

తా॥ రోగములచే యోగశుక్రమును గ్రహించక గర్భమును ధరించకనుండును దారుణములగు అసృగ్దరాది రోగములును వాతపిత్త కఫజనిత నానావిధోపద్రవములును స్త్రీలకు గలుగును. అటియోని రోగములు స్పష్టముగ జెప్పబడినవి.

## యోనివ్యాప నిదానము.

శ్లో॥ అనార్తవాస్తనీషండీఖరస్పర్శాతుమైధునే ।
అతికాయగృహీతాయాస్తరుణ్యాస్త్వండినీభవేత్ ।
వివృతాతిమహాయోనిస్సూచీవక్త్రాతిసంవృతా ।
సర్వలింగసముత్థానాసర్వదోషప్రకోపజా ।
చతస్రష్వపిచాద్యాసుసర్వలింగనిదర్శనం ।
పంచాసాధ్యాభవంతీహాయోనయస్సర్వదోషజాః ॥

తా॥ సన్నిపాతమునందు జనించెడి 5 దు యోనిరోగములో షండినియందు ఆర్తవము స్తనములు ఇవి లేక పోవుటయేగాక పురుషసంభోగ కాలమునందు యోని ఖరస్పర్శగలిగియుండు. అండినియందు సంభోగకాలమున అండముషలె నగుపెడు. మఱియు మహతియందు సంభోగకాలమున యోనిద్వారము విస్తారముగనుండు. మఱియు సూచీవక్త్రియునందు సంభోగకాలమున యోని సంకుచిత వివరముకలదిగనుండు. మఱియు త్రిదోషజమునందు సర్వయోని దోషములు గలిగియుండు. మఱియు

మొదటిదియగు పండిని మొదలగు 4 యోనిరోగములయందు త్రిదోషములరా
చిహ్నంబులగుపడు. నిర్వైదును అత్యంతా సాధ్యములు.

యోనివ్యాప చికిత్స.

శ్లో॥ యోనివ్యాపత్సుభూయిష్టంశస్య తేకర్మవాజతత్ ।
స్నేహస్వేదనవస్త్యాది విశేషాద్వాతజానుచ ॥

తా॥ పై చెప్పంబడిన వాత పిత్త శ్లేష్మ సన్నిపాతమువలన జనించిన వ్యాపదలయందు స్నేహనము స్వేదనము వస్తికర్మ ఇవి మొదలగు వాతనివర్తక త్సలే వాతవ్యాపదలయందు మిగుల ప్రశస్తములైనవని యెఱుంగవలయు.

శ్లో॥ నహివాతాదృతే యోనిర్వనితానాంప్రదుష్యతి ।
అతోజిత్వాతమన్యస్యకుర్యాద్దోషస్య భేషజమ్ ॥

తా॥ దుష్టవాత సంబంధములేకనే యోనిరోగముకలుగదు. గనుక మొదలు వాతహరచికిత్సనుజేసి తర్వాత పిత్తాదిదోషములకు చికిత్సచేయవలయును.

వాతసామాన్య చికిత్స.

శ్లో॥ స్నిగ్ధస్విన్నాంతథాయోనిందుఃస్థితాంస్థాపయేత్సమాం ।
మధుకౌషధసంసిద్ధాన్ వేసవారాంశ్చయోనిషు ।
నిక్షిప్యధారయేచ్చాపిపిచుతైలంయథాబలం ।
యోనిశూలరుజాదాహ్యాశోఫస్రావప్రశాంతయే ॥

తా॥ వాతవేదనాదియుక్తమైన యోనిని స్నేహ స్వేదనాది వుపచారముల మృదువగునటులజేసి మధురమైన ఔషధాదులచే సిద్ధమైన సంభారములను యోనిఇ
నిచి చమురుతో తడపబడిన ప్రత్తిని దానిపైనెచి కట్టుకట్టిన యోనిశూలము వా
సాధనము ఇవి మానును.

యోనిరోగమునందు బలాతైలాద్యుపయోగము.

శ్లో॥ పాయయేత బలాతైలంమిశ్రకంసుకుమారకమ్ ।
స్నిగ్ధస్విన్నాంత యోనిం దుస్థితాం పయేత్సమామ్ ॥
… సంవృతాంవ్యధయేత్పునః ।

ప్రవేశయేన్నిస్సృతాంచవివృతాంపరివర్తయేత్ ॥
స్థానాపవృత్తాయోనిహిఃశల్యభూతాస్త్రియోభవేత్ ॥

**తా**॥ యోనిరోగముగల స్త్రీకి బలాతైలము మిశ్రకఘృతము సుకుమారకఘృతము వీటిని పానము చేయించవలయును. మరియు విషముగనుండు యాయోనికి స్నేహస్వేదకర్మలను చేయించి దానిని సరిగానుంచవలయును. అది వంకరగనుండిన చేతితో సరిగా చేయవలయును. సంకోచమును జెందియుండిన దానిని విశాలమ్ముగ చేయవలయును. వెలుపలికి జారియుండిన లోన ప్రవేశింపజేయవలయును. తెరవబడియుండిన దానిముఖము మూయునటుల జేయవలయును. స్వస్థానమునందుండిజారి విషమముగనుండు యోని స్త్రీలకు విశేషతొందరను బుట్టించును.

యోనిరోగమునందు వమనాదికర్మలు.

శ్లో॥ కర్మభిర్వమనాద్యైశ్చమృదుభిర్యోజయేత్స్త్రియమ్ ।
సర్వతస్సువిశుద్ధాయాశ్శేషంకర్మవిధీయతే ।
వస్త్యభ్యంగపరీషేకప్రలేపపిచుధారణమ్ ॥

తా॥ యోనిరోగముగల స్త్రీకి మృదువైన వమనవిరేచనాదిక్రియలను తొలుత జేయించవలెను. ఊర్ధ్వాధోభాగములయందు శుద్ధమైన శరీరముగల స్త్రీకివస్తికర్మ అభ్యంజనము పరిషేకము ప్రలేపము పిచుధారణము మొదలగు చికిత్సలను జేయవలయును.

వచాద్యావలేహము.

శ్లో॥ వచోపాకుంచికాజాజీకృష్ణావృషభసైంధవం ।
అజమోదాయవక్షారచిత్రకంశర్కరాన్వితం ।
పిష్ట్వాప్రసన్నయాలోడ్యఖాదేతత్ ఘృతభర్జితం ।
యోనిపార్శ్వార్తిహృద్రోగగుల్మార్శోవినివృత్తయే ॥

॥ నల్లవస నల్లజీలకఱ్ఱ జీలకఱ్ఱ పిప్పళ్ళు అడ్డసరము సైంధవలవణము ఓమము యవక్షారము చిత్రమూలము వీటిని నేతిలో భక్షించి పిదప వీట్లను చూర్ణముచేసి ... చి ప్రసన్నమగు సురతోమిళితముచేసి వాటిని భక్షించిన ... హృద్రోగము గుల్మరోగము ... రోగము ఇ మానును.

యోనిరోగమునకు కాశ్మర్యాదిఘృతము.

శ్లో॥ కాశ్మర్యఫలాదాడిమకాసమర్ద విశాద్వయోః ।

తా॥ వాతయోనిరోగములలో ఉదావర్తము మొదలగు 4 యోనిరోగముల యందు వస్తికర్మ అభ్యంగనము కషాయాదులచే క్షాళనము ప్రలేపనము పిచుధారణము ఇవి మొదలగునవి సామాన్యచికిత్సలని తెలుసుకొనవలయు.

బిల్వాది కల్కము.

శ్లో॥ బిల్వమార్కనజంబీజంకల్కంమద్యేనపాయయేత్ ।
తేనయోనిగతంశూలమాశుశామ్యతియోషితాం ॥

తా॥ బిల్వఫలము గుంటగలగరవిత్తులు యీ రెంటినినూరి కల్కముజేసి మద్యముతో చేర్చి పానముచేసిన స్త్రీలకు జనించిన యోనిశూల నివర్తించు.

యోనిరోగమునకు వృషకాదికల్కపానము.

శ్లో॥ వృషకంమాతులుంగస్యమూలానిమదయంతికామ్ ।
పిబేన్మద్యైస్సలవణైస్తథాకణోపకుంచికే ॥

తా॥ ఋషభకము లేక అడ్డసరము మాదీఫలపుచెట్టువేళ్లు మల్లె వీటిని మద్యముతో నూరి అందులో నే కలిపి సైంధవలవణమునుచేర్చి పానముచేయించినను పిప్పళ్ళు పెద్దజీలకర్ర వీటిని మద్యముతో నూరి అందులో నే కలిపి సైంధవలవణమునుచేర్చి పానముచేయించినను యోనిశూలలు నివర్తించును.

వాతయోనివ్యాప చికిత్స.

శ్లో॥ వాతలాంకర్కశాంస్తబ్ధామల్పస్పర్శాంతథైవచ ।
కుంభీస్వేదైరుపచరేదంతర్వేశ్మనిసంవృతే ।
ధారయేద్వాపిచుంయోనౌతిలతైలస్యసాసదా ॥

తా॥ వాతదోషముచే యోని కఠినముగను స్తబ్ధముగను అల్పస్పర్శగలదిగను యుండెనేని ఏకాంతస్థలమున కుంభీస్వేదముచే నుపచరించిన లేక నువ్వులనూనెయందు ప్రత్తితడిపి యోనియందు ధారణచేసినను అది నివర్తించు.

ఉపకుంచికాది పానము.

శ్లో॥ ఉపకుంచింపిప్పలీంచమదిరాంలాభతఃపిబేత్ ।
సౌవర్చలేనసంయుక్తంయోనిశూలనివారణం ॥

తా॥ నల్లజీలకఱ్ఱ పిప్పళ్లు విటిని చూర్ణముచేసి మద్యములోవైచి అందు సౌవర్చలవణముజేర్చి పుచ్చుకొనిన యోనిశూలలు మానును.

యోనిరోగమునకు జీవనీయక్షీరపానము.

శ్లో॥ ఏవమేవపయస్సర్పిర్జీవనీయోపసాధితమ్ ।
గర్భదంపిత్తజానాంచరోగాణాంపరమంహితమ్ ॥

తా॥ పైన జెప్పియుండురీతిన జీవనీయౌషధములతో పక్వముచేయబడిన ఆవుపాలనుగాని నెయ్యినిగాని స్త్రీలు పానముచేసిన యోనిరోగము నివర్తించి గర్భవతుల గుదురు. మరియు నిది పిత్తజరోగములయందు మిగుల హితమునుజేయును.

యోనిరోగమునకు బలాదితైలము.

శ్లో॥ బలాద్రోణద్వయక్వాథేఘృతతైలాఢకంపచేత్ ।
క్షీరేచతుర్గుణేకృష్ణాకాకనాసాసితాన్వితైః ॥
జీవంతీక్షీరకాకోళీస్థిరావీరర్ధిజీవకైః ।
పయస్యాశ్రావణీముద్గపీలుమాషాఖ్యపర్ణిభిః ॥
వాతపిత్తామయాన్హత్వాపానాద్గర్భందధాతితత్ ।

తా॥ 2 ద్రోణముల ముత్తవపులగకషాయములో ఆవునెయ్యి 1 ఆఢక నువ్వులనూనె 1 ఆఢకము ఆవుపాలు 4 ఆఢకములుబోసి పిప్పళ్ళు కాకిదొండ జీవక్షీరకాకోళీ ముయ్యాకుపొన్న కాకోళి ఋద్ధి జీవకము పిన్నమనుబాల బోడతరపిల్లిపెసర చాగ కారుమినుములు వీటిని సమముగగ్రహించి కల్కముచేసి కలిఘృతపక్వముగ పాకముజేసి దానిని పానముచేయించిన వాతపిత్తరోగములు నివర్తించ గర్భము కలుగును.

యోనిదాహ చికిత్స.

శ్లో॥ ధాత్రీరసంసితాయుక్తంయోనిదాహేపిబేత్సదా ।
సూర్యకాంతాభవంమూలంపిబేద్వాతంథులాంబునా ॥

తా॥ ఉసిరికకాయల రసమునందు శర్కరవేసి పానముచేసినను లేక సూర్యక్రాంత మూలమును బియ్యపుకడుగుతో నూరి పానముచేసినను యోనిదాహముమానును.

## పిత్తయోనిరోగమునకు సామాన్యచికిత్స.

శ్లో॥ పిత్తలానాంతుయోనీనాంసేకాభ్యంగాపిచుక్రియాః ।
శీతాఃపిత్తహరాః కార్యాఃస్నేహనార్థేఘృతానిచ ॥

తా॥ పిత్తప్రకోపమువలన జనించిన యోనిరోగములకు కషాయాదులచే సేకము అభ్యంజనము ప్రత్తితో తైలాదులంతడిపి ధారణము శీతోపచారములు పిత్తనివర్తకోపచారములు వీట్లను చేయవలయు. మఱియు స్నేహమునందు ఘృతమునే స్వీకరింపవలయు.

## రెండవ చికిత్స.

శ్లో॥ పిచవశ్చఘృతాభ్యక్తాశ్చందనాంభస్సముక్షితాః ।
యోనౌస్థాప్యాఃస్త్రియాదాహక్లేదపాకప్రశాంతయే ॥

తా॥ పిత్తప్రకోపముగల యోనియందు నేతిలో ప్రత్తితడిపి వైచి చందనోదకముచే చిలికించిన దాహము బాధ వ్రణములు ఇవి శాంతినిజెందు.

## శ్లేష్మయోని చికిత్స.

శ్లో॥ సురామండోక్షితోధార్యః పిచుర్యోనౌకఫాత్మికే ।
కండూపిచ్ఛిల్యసంస్రావశైథిల్యవినివృత్తయే ॥

తా॥ సురామండమునందు ప్రత్తినితడిపి యోనియొక్క పార్శ్వములయందు ధారణముజేసిన శ్లేష్మమువలన జనించిన యోనిరోగము దురద జిగట స్రావము శైథిల్యము ఇవి మానును.

## రక్తయోని చికిత్స.

శ్లో॥ రక్తయోన్యామసృగ్వర్ణైరనుబంధమపేక్ష్యచ ।
యథాదోషోదయంయుంజ్యాద్రక్తస్థాపనమౌషధం ॥

తా॥ రక్తయోనిరోగమునందు రక్తవర్ణముచే వాతాదిదోష సంబంధమును తెలుసుకొని ఆయాదోషాను గుణముగ ఔషధముల నిప్పించవలయును.

## యోనిరోగమునకు ధాతక్యాదితైలము.

శ్లో॥ ధాతక్యామలకీపత్రస్రోతోజమధుకోత్పలైః । జంబ్వామ్ర

సారకాసీసరోధ్రకట్ఫలతిందుకైః ॥ సౌరాష్ట్రికాదాడిమత్వ
గుదుంబరశలాటుభిః । అక్షమాత్రైరజామూత్రేక్షీరేచద్వి
గుణేపచేత్ ॥ తైలప్రస్థంతదభ్యంగపిచువస్తిషుయోజయేత్ ।
శూనోత్తానోన్నతా స్తబ్ధాపిచ్ఛిలా స్రావణీతథా ॥ విప్లుతోప
ప్లుతాయోనిస్సిధ్యేత్సస్ఫోటశూలినీ ॥

తా॥ మేకమూత్రము 2 ప్రస్థములు ఆవుపాలు 2 ప్రస్థములు నువ్వులనూనె 1 ప్రస్థము వీటిని నేకముగజేర్చి దానిలో ఆరెపువ్వు ఉసిరికెయాకు సౌవీరాంజనము యష్టిమధుకము నల్లకలువ నేరేడువిత్తులు మామిడివిత్తులు పుష్పకాసీసము లొద్దుగు గుమ్మడు చేకు నల్లితునికి సౌరాష్ట్రికము (అనగాతువరిమన్ను) దానిమ్మబెరడు మేడికాయ వీటినన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగ కర్షప్రమాణముచొప్పున గ్రహించి తైలపక్వముగకాచి దానిని అభ్యంగము పిచువు వస్తికర్మ వీటియందుపయోగించిన రక్తస్రావముగలదియు పోట్లు శూల వీటితోగూడినదియు జిగటగనుండునదియునగు యోనిరోగములన్నియు హరించును.

## యోనిరోగమునకు యవాన్నాద్యుపయోగము.

శ్లో॥ యవాన్నమభయారిష్టంసీధుతైలంచశీలయేత్ ।
పిప్పల్యయోరజః పథ్యాప్రయోగాంశ్చసమాక్షికాన్ ।

తా॥ యవాన్నము కరక్కాయ అరిష్టము సీధుయనెడి మద్యములు నువ్వులనూనె వీటిని యోనిరోగముగలవారు పుచ్చుకొనుచుండవలయును. మరియు పిప్పళ్ళచూర్ణము అయోభస్మము హరీతకీయోగములు వీటిని పలుమారు తేనెయుక్తముగ పుచ్చుకొనవలయును.

## యోనిరోగమునకు కాసీసాదిచూర్ణము.

శ్లో॥ కాసీసంత్రిఫలాకాంక్షీసామ్రజంబ్వస్థిధాతకీ ।
పైచ్ఛిల్యేక్షౌద్రసంయుక్తశ్చూర్ణోవైశద్యకారకః ॥

తా॥ కాసీసము త్రిఫలములు తువరిమన్ను మామిడివిత్తులు నేరేడువిత్తులు ఆరెపువ్వు వీటిని సమాంశములుగ గ్రహించి బాగుగ చూర్ణముచేసి తేనెలోకలిపి సేవింపజేసిన జిగటగనుండుయోని శుద్ధంబగును.

యోనిరోగమునకు పలాశాదిచూర్ణము.

శ్లో॥ పలాశధాతకీజంబూసమంగామోచసర్జరః ।
దుర్గంధేపిచ్ఛిలేక్లేదస్తంభనశ్చూర్ణఇష్యతే ।
ఆరగ్వధాదివర్గస్యకషాయః పరిషేచనమ్ ॥
స్తబ్ధానాంకర్కశానాంచకార్యంమార్దవకారకమ్ ।
ధారణం వేసవారస్యకృసరాపాయసస్యచ ॥

తా॥ మోదుగు ఆరె నేరేడు మంజిష్ఠి బూరుగు సర్జరసము వీటిచూర్ణమును ప్రయోగించిన దుర్గంధముగను స్రావయుక్తముగను జిగటగనునుండు యోని రోగము మానును. మరియు ఆరగ్వధాది గణద్రవ్యముల కషాయముచే సేవనము చేయించిన యోనియందలి దుర్గంధాదిదోషములు శమించును. స్తబ్ధముగ కఠినముగ నుండు యోనులయందు మృదుత్వమును కలుగజేయునట్టి వేసవారము కృసరము పాయసము వీటిని ధరింపజేయవలయును.

యోనిదౌర్గంధ్యమునకై చికిత్స.

శ్లో॥ సుగంధానాంపదార్థానాంకల్కచూర్ణకృతైఃకృతః ।
యోనౌదౌర్గంధ్యశమనః పూయస్రైచ్ఛిల్యభాజిచ ॥

తా॥ సుగంధ ద్రవ్యములయొక్క కల్కముగాని లేక చూర్ణముగాని యోని యందుధరించిన యోనిదౌర్గంధ్యము పూయస్రావము జిగట ఇత్యాదులు మానును.

కఫదుష్టయోనికై సామాన్యప్రక్రియ.

శ్లో॥ యోన్యాంబలాసదుష్టాయాం సర్వరూక్షోష్ణమౌషధం ।
తైలంస్వాదుయవాన్నంచపథ్యారిష్టంచయోజయేత్ ॥

తా॥ కఫదుష్టమైన యోనియందు మిగుల రూక్ష అత్యుష్ణము యివి కలిగినేని తైలము రుచికరమైన యవాన్నము కరక్కాయలు కుంకుడుకాయలు లేక వేప వీట్లచే శాంతిని జెందునటుల ఉచితోపచారములు చేయవలయు.

రెండవ చికిత్స.

శ్లో॥ పిప్పల్యామరిచైర్మాషైఃశతాహ్వాకుష్ఠసైంధవైః ।

వర్తిస్తుల్యాప్రదేశిన్యాధార్యా యోనివిశోధనీ ॥

తా॥ పిప్పళ్ళు మిరియాలు మినుములు చల్లగడ్డ కోష్టము సైంధవలవణము వీట్లను ఉదకముచేనూరి వస్త్రమునకు లేపనముజేసి బొటనవ్రేలిలావు వర్తులనొనర్చి యోనియందు ధారణముచేసిన శ్లేష్మముచేగలిగిన యోనిరోగములు మానును

వాతదుష్టయోని చికిత్స.

శ్లో॥ శ్లేష్మలానాంకటుప్రాయాఃసమూత్రావస్తయోహితాః ।
పిత్తేసమధుకక్షీరాఃవాతేతైలామ్లసంయుతాః ॥

తా॥ శ్లేష్మాధిక్యముగల యోనులకు మిక్కిలి కారముగలదిగను గోమూత్రము చేర్చబడినదిగను నుండు వస్తికర్మలు పిత్తాధిక్యముగల యోనులకు యష్టిమధుకము ఆవుపాలు చేర్చబడినదిగనుండు వస్తికర్మలు వాతాధిక్యముగల యోనులకు నువ్వుల నూనె పులికడుగు వీటితోగూడియుండు వస్తికర్మలు హితకరంబులుగనుండును.

ప్రస్రంసినియోనికై యుపచారము.

శ్లో॥ ప్రస్రంసినీంఘృతాభక్తాంక్షీరస్విన్నాంప్రవేశయేత్ ।
విచాయవేసవారేణయోర్బంధంసమాచరేత్ ॥

తా॥ ప్రస్రంసినియను యోనిరోగమునందు యోనిని నేతితో మార్జనము పాలచేతడిపి మధురమయిన ఔషధాదులచే సిద్ధమైన సంభారములను పైనునిచి వస్త్రాదులచే బంధించవలయు.

యోనిపూయస్రావ చికిత్స.

శ్లో॥ యోన్యాంతుపూయస్రావిణ్యాంశోధనద్రవ్యనిర్మితైః ।
సగోమూత్రైస్సలవణైఃపిండైస్సంపూరణంహితం ॥

తా॥ యోనియందు పూయస్రావముకలిగెనేని శోధనద్రవ్యములు లవణ వీటిని గోమూత్రముతోనూరి ఘుటికచేసి యోనియందుంచుకొనిన పూయస్రావి మానును.

యోనికందమూపచారము.

శ్లో॥ గుడూచీత్రిఫలాదంతీక్వథితోదకధారయా ।
యోనింప్రక్షాళయేత్తేనతత్రకందాః ప్రశామ్యతి ॥

తా॥ తిప్పతీగె కరక తాండ్ర ఉసిరికలు నేపాలపువేరు వీట్లను కషాయము పెట్టి ఆ కషాయమును యోనిపై ధారగావిడిచి క్షాళనముజేసిన దురద మానును.

## యోనిస్రావ చికిత్స.

శ్లో॥ ముద్గపుష్పంసఖదిరంపథ్యాజాతీఫలంతథా।
పృకీంపూగంచసంచూర్ణ్య వస్త్రపూతంక్షిపేత్ భగే।
యోనిర్భవతిసంకీర్ణానస్రవేచ్ఛజలంతతః॥

తా॥ పెసరపూలు చంద్రచక్క కరక్కాయ జాజికాయ అగళుశుంఠి వక్కలు వీటిని ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణముచేసి వస్త్రఘాలితమొనర్చి ఆచూర్ణమును యోనియందు ధారణము చేసికొనిన యోనిస్రావము మానును.

## అన్యచ్చ.

శ్లో॥ కపికచ్ఛూనమూలంక్వాథయేద్విధినాభిషక్।
యోనేఃసంక్షతాయాతిక్వాథేనానేనధావనాత్॥

తా॥ దూలగొండివేరును కషాయముబెట్టి యోనిక్షాళనముజేసిన యోని స్రావము మానును.

## సన్నిపాతయోనిరోగమునకు చికిత్స.

శ్లో॥ సన్నిపాతసముద్భూయాంకార్యాయోన్యాంపరిక్రియాః॥

తా॥ సన్నిపాతమువలన జనించిన యోనిరోగమునందు శెప్పబోయెడి సన్నిపాతనివర్తకక్రియలు జేయవలయు.

## అన్యచ్చ.

శ్లో॥ సాధారణోదశాంఘ్రిః శ్రీమద్ధాక్వాథపిచుర్హితః॥

తా॥ దశమూలములు బిల్వఫలము ఆరెపువ్వు వీటికషాయముతో ప్రత్తినితడిపి యోనియందు ధారణముజేసిన సన్నిపాతమువలన జనించిన యోనిరోగము నివర్తించు.

## నష్టార్తవ చికిత్స.

శ్లో॥ ఆర్తవాదర్శనేనారీమత్స్యాన్సేవేతనిత్యశః॥

తా॥ స్త్రీలకు ప్రతిమాసమునందు కలిగెడి రజస్సు అకస్మాత్తుగా బయలువెడలకపోయెనేని మత్స్యమాంసము సేవించిన ఆర్తవము జనించు.

## రజోదర్శనోపాయము.

శ్లో॥ కాంజికంచతిలాన్మాషానుదశ్విచ్ఛతథాదధి ।
పీతంజ్యోతిష్మతీపత్రంరాజకోగ్రాసనంత్ర్యహం ।
శీతేనపయసాపిష్టంకుసుమంజనయేధ్రువం ॥

తా॥ కాంజికము నువ్వులు మినుములు సగము పెరుగు సగమునీళ్లు వేసిన మజ్జిగ లేక పెరుగు వీటినినూరి సేవించినను లేక జోతిష్మతీ ఆకులు నల్లఆవాలు నల్లవస వేగిసపట్ట పీట్లను పచ్చిపాలతో నూరి 3 దినములు పానముజేసినను స్త్రీలకు రజః ప్రాదుర్భావము కలుగు.

## అన్యచ్చ.

శ్లో॥ సగుడశ్యామతిలానాంక్వాథఃపీతస్సుశీతలోనార్యాః ।
జనయతికుసుమంసహసాగతమపిసుచిరంనిరాతంకం ॥

తా॥ మఱియు నల్లనూలువేసి కషాయముపెట్టి చల్లారినపిదప బెల్లమువైచి స్త్రీలుపానముజేసిన రజః ప్రాదుర్భావము కలుగు.

## అన్యచ్చ.

శ్లో॥ తిలశేలుకారబీజానాంక్వాథంపీత్వానష్టరజామహిలా ।
శిశిరంసగుడంత్రిదినాజ్జనయతికుసుమంనసందేహః ॥

తా॥ నువ్వులు విరిగిపట్ట పెద్దసోపు పీట్లను కషాయముపెట్టి చల్లారిన పిదప బెల్లమువైచి స్త్రీలు 3 దినములు పుచ్చుకొనిన రజః ప్రాదుర్భావము కలుగు.

## రజోత్పాదక ఉపచారము.

శ్లో॥ ఇక్ష్వాకుబీజందంతీచపలాగుడమదనకిణ్వయావశూకైః ।
సస్నుక్ క్షీరైర్వర్తిర్యోనిగతాకుసుమసంజననీ ॥

తా॥ చేదుసొరవిత్తులు నేర్వాళము పిప్పళ్ళు బెల్లము (కిణ్వము) యవక్షారము బొంతజెముడుపాలు వీటినన్నియుఁ జేర్చి వత్తిఁ జేసి యోనియందు ధారణచేసిన రజః ప్రాదుర్భావము గలుగు.

తా॥ ఎలుకమాంసమును సన్నఖండములుగజేసి తగుపాటిమంచినూనె అగ్నియందునిచి ఈ మాంసఖండమును ఆనూనెయందువైచి అది ద్రవించునటులకాచి చల్లారిన పిదప ఆతైలమునందు వస్త్రఖండమునుదడిపి యోనికందమునందునిచిన లజ్జాకారకయోనికందము మానును.

## పిత్తయోనికంద నిదానము.

శ్లో॥ దాహరాగజ్వరయుతంవిద్యాత్పిత్తాత్మకంతుతం ॥

తా॥ తాపము యెరుపువర్ణము జ్వరము వీటితోగూడి యుండెనేని నది పిత్తమువలన జనించిన యోనికందమని యెఱుంగవలయు.

## కఫయోనికంద నిదానము.

శ్లో॥ నీలపుష్పప్రతీకాశంకండూమంతంకఫాత్మకం ॥

తా॥ నల్లటి పుష్పవర్ణమై నవకలిగియుండెనేని అది శ్లేష్మమువలన జనించిన యోనికందమని నెఱుంగవలయు.

## సన్నిపాతాత్మకయోనికంద నిదానము.

శ్లో॥ సర్వలింగసమాయుక్తంసన్నిపాతాత్మకంవదేత్ ॥

తా॥ పైజెప్పిన వాతాది యోనికంద లక్షణములు గలిగియుండెనేని సన్నిపాతదోషమువలన జనించిన యోనికందమని యెఱుంగవలయు.

## గుడూచ్యాదివర్తి.

శ్లో॥ గుడూచీత్రిఫలాదంతీక్వాథేనపరివేష్ఠితైః ।
పిప్పలీమరిచైర్మాషైః శతాహ్వాకుష్ఠసైంధవైః ।
వర్తిస్తుల్యాప్రదేశిన్యాధార్యాయోనివిశోధనీ ॥

తా॥ తిప్పతీగె కరకతాండ్ర వుసిరికలు నేపాలపువేరు వీటికషాయములో పిప్పళ్లు మిరియాలు మినుములు శతావరీ కోష్ఠము సైంధవలవణము వీట్లనుసూరి వస్త్రమునకు పట్టించి తర్జనీ వ్రేలిలావుగల వర్తిజేసి యోనియందుంచుకొనిన యోనికందము నివర్తియగు.

అన్యచ్చ.

శ్లో॥ పిష్టజంబూకసంపిష్టంపక్వంతి త్రిడిసంయుతం ।
లేపమాత్రేణనారీణాంయోనికందహరంపరం ॥

తా॥ మహిసాక్షి చింతపండు వీటినినూరి వుడికించి లేపనముజేసిన యోనికందము నివర్తియగు.

యోనికందరోగము గర్భజరోగము వీటినిదానము.

శ్లో॥ చతుర్విధంయోనికన్దంవాతపిత్తకఫైస్త్రిధా ।
చతుర్థం సన్నిపాతేనతథాష్టౌగర్భజాగదాః ।
ఉపవిష్టకగర్భస్స్యాత్తథానాగోదరస్మృతః ।
మక్కల్లోమూఢగర్భశ్చవిష్టంభోగూఢగర్భకః ।
జరాయుదోషోగర్భస్యపాతశ్చాష్టమకస్మృతః ॥

తా॥ యోనికందరోగము వాత పిత్తశ్లేష్మ సన్నిపాతభేదములచే 4 విధములుగనుండు. నవిగర్భ సంబంధరోగము ఉపవిష్ట గర్భము నాగోదరము మక్కల్లము మూఢగర్భము విష్టంభము గూఢగర్భము జరాయుదోషము గర్భపాతము అన 8 విధంబులుగనుండు.

అందు గర్భసంబంధరోగ వివరమెట్లన్న:—స్త్రీకి గర్భము నిలిచిన పిదప కారము ఉష్ణపదార్థములు మొదలగువాటిని విశేషముగ భక్షించుటచే నుష్ణాధిక్యమై రక్తము స్రవించుచు గర్భము వృద్ధినిజెందక స్తబ్ధమై కదలుచుండుట ఉపవిష్టకగర్భమనియు శుక్రధాతువులు రక్తముతో సంయోగమగు కాలంబున వాయువు సర్పాకారముగ నుదరముజొచ్చి దాని నుబ్బించుటచే గర్భమొకానొకసమయంబున స్వేచ్ఛగ పతనంబైనను లేక లోననే జీర్ణంబైనను నాగోదరమనియు గర్భముండగనేని ప్రసవంబైన పిదపనేని గలిగెడు నొకశూలచే మరణము ప్రాప్తించుట మక్కల్లమనియు వాయువు గతివైకల్యముకలిగి గర్భమును జడత్వమును బొందించి యోనియందును ఉదరమునందును శూలపుట్టించుట మూఢగర్భమనియు అకాలభోజనంబునను రూక్షాది పదార్థ సేవనంబునను వాయువు ప్రకోపించి గర్భమును శోషింపంజేసి వృద్ధిజెందక స్త్రీకి ప్రక్కలయందు దారుఢ్యముతప్పి యాగర్భము పతనమైనను ప్రమాణహీనమై వాతవేదనాయుక్తమై యుండుట విష్టంభగర్భమనియు గర్భము వృద్ధినిజెందక కొన్ని

దినములలో జీర్ణమగుట మూఢగర్భమనియు. గర్భాశయంబున శిశువును జుట్టుకొని యుండు జరాయువను చర్మవిశేషముచెడి యాశిశువుకు వికారమును గలుగంజేయుట జరాయుదోషమనియు భయముజొచ్చి ఉష్ణము మొదలగు వానిచేనేని అత్యుష్ణ పదార్థములగు చిత్రాన్నము మొదలగువాటిని భక్షించుటచేనేని గర్భపిండము పడిపోవుట గర్భపాతమనియు పరంగు. ఈ నైగర్భదోషంబులలో మక్కల్లమనునది గర్భమక్కల్లము ప్రసూతి మక్కల్లము అన 2 విధంబులు. అందు గర్భముండగనే మనోవికల్పంబున వాతప్రకోపముగలిగి శూలపుట్టి గర్భము మృతినొందుట గర్భమక్కల్లమనియు ప్రసవించిన పిదప వాయువు స్వకీయ కారణోద్రేకమును జెంది గర్భరక్తమును మరికి నీళ్లను స్రవింపంజేయుచు నూర్ధ్వగామియై బాలింతయొక్క శిరస్సునందును ప్రక్కలయందును వస్తి హృదయంబులయందును శూలబుట్టించి యోనిని సంకుచితంబుగచేసి యూర్ధ్వశ్వాసముల బెంచి యాబాలింతనుజంపుట ప్రసూతిమక్కల్లమనియు గ్రంథాంతరేణ యోని సంవరణమనియు పఱంగు.

యోనిరోగవ్రణాదులకు న్యగ్రోధాదికషాయము.

శ్లో॥ న్యగ్రోధప్లక్షకోశామ్రవేతసోబదరీతుణిః । మధుయష్టిప్రియా
ళుశ్చలోధ్రద్వయముదుంబరః । పిప్పలశ్చమధూకశ్చతథా
పారిసపిప్పలః । సల్లకీతిందుకీజంబూద్వయమామ్రతరుశ్శివా ।
కదంబకకుభాచైవభల్లాతకఫలానిచ । ల్యగ్రోధాదిగణక్వా
థంయథాలాభంచకారయేత్ । అయంక్వాథోమహాగ్రాహీ
వ్రణోస్థిభగ్నంచనాశయేత్ । యోనిదోషహరోదాహమేదో
మేహవిషాపహః ॥

తా॥ మఱ్ఱి జువ్వి తుమ్మ మామిడి ప్రబ్బలి రేగు నందివర్ధనము అతిమధురము మొరలి ఎఱ్ఱలొద్దుగ తెల్లలొద్దుగ అత్తి రావి ఇప్ప గంగరావి అందుగ కరక కడిమ మద్ది వీటియొక్క పట్టలు జీడిగింజలు అను నీన్యగ్రోధాది గణమంతయుగాని అందు దొరికినంతయుగాని కషాయముబెట్టి పుచ్చుకొనిన స్త్రీకి మలనిరోధము వ్రణము అస్థిభంగము యోనిదోషము తాపము మేదోరోగము మేహరోగము విషదోషము ఇవి శమించు.

## న్యగ్రోధాది ఘృతము.

శ్లో॥ న్యగ్రోధాశ్వత్థపార్థామ్రవృష కటుకాప్లక్షజంబూ ప్రియాళాః । శ్యోనాకోదుంబరాఖ్యామధుకతరుబలావేతసం కేందునీపౌ । రోహీతం పీతసారం విధివిహితహృతం సర్వమేషాంతరూణాం । ప్రత్యేకం వల్కలంతద్యుగపలమఖిలం క్షోదయిత్వాభిషగ్భిః ॥ క్వాథంద్రోణాంభసాతద్ధ్రృఢవిమలకటాహేపి పాదావశేషంసర్పిః । ప్రస్థంతుపాచ్యంపచన కుశలినామందమందానలేన । ప్రస్థంధాత్రీరసానాంవిధివిహితజలప్రస్థమేకంచశాలే । ధత్వాత్ర్యక్షంతుకల్కం మధుకమపిమధోః పుష్పఖర్జూరదార్వ్య । జీవంతికాశ్మరీణాం పలమపియుగళంక్షీరకాకోళియుగ్మం । రక్తాఖ్యంచందనం యత్తదపరమ మలంచాంజనంశారిబాచ ॥ న్యగ్రోధాద్యంఘృతం హ్యేతత్ దేహం ప్రాప్యామృతాయతే । దుస్తరంప్రదరంహన్తినీలంరక్తంసితాసితమ్ ॥ యోనిశూలంకుక్షిశూలంవస్తిశూలంసుదుస్సహం। అంగదాహం యోనిదాహమక్షికుక్షీభవంచయత్ । మందదృష్టింఅశ్రుపాతంతిమిరం వాతసంభవమ్ ॥ ఆధ్మానంనాహశూలఘ్నంవాతపిత్తప్రకోపజిత్ ॥ అమ్లపిత్తంచపిత్తంచయోనిరోగం వినాశయేత్ ॥ దృష్టిప్రసాదజనకం । బలవర్ణాగ్నికారకమ్ ॥

తా॥ మర్రి కడిమి తిప్పతీగె అడ్డసరము కటుకరోహిణి జువ్వి నేరేడు మురళిదుండిలము అత్తి యిప్ప ముత్తవపులగము ప్రబ్బలి మద్దిములు మోదుగు ఊడుగు యీ వ ౘ ముల పట్టలను వెవ్వేరుగ రెండేసి పలములచొప్పునజేర్చి చితగగొట్టివాటిని గొప్ప బం లోవునిచి అందులో ద్రోణప్రమాణోదకముబోసి పాదావశేషముగ కషాయముకా వడియబోసి దానియందు ఆవునెయ్యి 1 ప్రస్థము వుసిరికపండ్లరసము 1 ప్రస్థము మంచినీళ్లు 1 స్థముచేర్చి ఎర్రసంబాబియ్యము 3 కర్షములు యష్టిమధుకము యిప్ప పూలు ఖర్జూరంపండు మానిపసపు పిన్నమనుబాల పెగ్గుమ్మడు కాకోళీ క్షీరకాకోళి

రక్తచందనము సౌవీరాంజనము సుగంధిపాల వీటిని వేర్వేరుగ రెండేసిపలములచొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి నేర్పుగలవైద్యుడు మందాగ్నిచే విధిప్రకారము పాకము జేయవలయును. ఇది న్యగ్రోధాదిఘృతమని బరగును. దీనిని సేవించిన నల్లగ ఎఱ్ఱగనుండు దారుణమైన రక్తస్రావరోగము యోనిశూల కడుపునొప్పి పొత్తికడుపునొప్పి అవయవములు యోని నేత్రములు కడుపు వీటియందుజనించు విశేషమంట దృష్టిహీన కండ్లయందు నీరుగారుట వాతమువలన బుట్టిన తిమిరరోగము కడుపుబ్బరము ఆనాహ శూల వాతపిత్త ప్రకోపములు ఆమ్లపిత్తము యోనియందుగలుగు అనేకవిధ జాడ్యములు యివియన్నియు నశించుటయేగాక శరీరమునకు అమృతమువలె ఆరోగ్యము బలము కాంతి అగ్నిదీపనము పుష్టి నేత్రములకు దృష్టి శక్తి యివి సగాగలుగును ఇవి స్త్రీ ... ్యములకు ప్రశస్తమైనది.

## సోమ ఘృతము.

శ్లో॥ సిద్ధార్థకంవచాబ్రాహ్మీశంఖపుష్పీపునర్నవా। పయస్యామయయష్ట్యాహ్వకటుకాచఫలత్రయం ॥ శారిబేరజనీపాఠాభృంగదారుసువర్చలాః । మంజిష్టాత్రిఫలాశ్యామావృష పుష్పం సగైరికం । ... పక్వా ... ఘృతప్రస్థంపు ... ... భిమంత్రితమ్ । ... భిణీ ... రీషణ్మాసాను పయోజయేత్ । సర్వజ ... త్రం సర ... ... నా ... క్షష్ఠః ... వ ... హరాణ్యపి । ... నీదుష్టాశ్చయా నార్యోరేతో దుష్టాశ్చయే ... । స్త్రీణాంపుంసాందోషహరం ... ంధ్యాపిలభతేపుత్రంశూరం పండిత ... మ్ ॥ ... ర్షకత్వంపానాదేవాపకర్షతి। ... అధరోభవేత్ ॥ నాగ్నిర్దహతి ... ము ... నతత్రింమియతేబాలోయత్రా ... ... 

... మ్రూక బ్రహ్మి శంఖపుష్పము గలిజేరు పిన్నము ... యష్టి ... కము కటుకరోహిణి ద్రాక్ష నేలగుమ్ముడు పేరిత ... సుగంధిపాల పసపు చిరుబొద్ది దేవదారు ఆదిత్యభక్తి మంజిష్టి

త్రిఫలములు ప్రేంఖణము వృషపుష్పము (అనగా అడ్డసరపువ్వు) కావిరాయి వీటినన్ని యు ప్రత్యేకముగ 3 తులములవంతున గ్రహించి కల్కముచేసి 1 ప్రస్థపు ఆవునేతిలో కలిపి ఘృతపక్వముగ పాకముజేసి దించుకొని ఆ ఘృతమును "ఓన్నమోమహావినాయకాయ అమృతంరక్షరక్ష మమఫలసిద్ధిం దేవాదేవా రుద్రవచనేనస్వాహా" అను మంత్రముచే 7 పర్యాయములకు తక్కువలేక అభిమంత్రించి గర్భిణీ స్త్రీలకు 2వ మాసము మొదలు 6 మాసములయ్యేవరకు ప్రతిరోజు ప్రాతస్సాయంకాలములయందు మాత్రగా సేవింపజేయుచుండిన సర్వజ్ఞుండును రోగవివర్జితుడును చిరాయువునునైన కుమారుడుపుట్టును. మరియు నిదివంధ్యత్వమును తొలగించును. మరియు దీని యోని దోషముగల వనితలకును శుక్రదోషముగల పురుషులకును సేవింపజేసినవవి హరించును. ఈ ఘృతమును సేవించుటచే శౌర్యపాండిత్యములుగల మొగబిడ్డలు గొడ్రాలికికూడా కలుగుదురు. మరియు మూగతనము మూఢత్వము వాక్శుద్ధి లేకుండుట వీటిని బోగొట్టును. పురుషుడు దీనిని 7 దినములు ఉదయకాలమునందు పుచ్చుకొనిన అధికజ్ఞాపక శక్తికలుగును. మరియు నీఘృతముండు చోట అగ్నివలనను పిడుగువలనను భయముండక పోవడమేగాక అట్టిగృహమునందుగల బాలురకు అకాలమరణము గలుగనేరదు. ఈ యౌషధము యోనిరోగములకు ముఖ్యమైనది.*

## త్రిఫలాత్రివృతాది ఘృతము.

శ్లో॥ త్రిఫలాంత్రివృతాంశుఠీం గుడూచీంసపునర్నవాం।
విదారికేహరిద్రేద్వేరాస్నాంమేదాంశతావరీం।
కల్కీకృత్యఘృతప్రస్థంపచేత్క్షీరేచతుర్గుణే।
తత్సిద్ధంపాయయేన్నారీం యోనిరోగప్రశాంతయే॥

తా॥ త్రిఫలములు తెల్లతెగడ శొంఠి తిప్పతీగె పల్లేరు నేలగుమ్మడు పసపు మానిపసపు దుంపరాస్న మేద పిల్లిపీచర వీటిని ప్రత్యేక ప్రత్యేకముగ 2 కర్షముల చొప్పునజేర్చి కల్కముచేసి 1 ప్రస్థపు ఆవునేతిలోకలిపి అందు 4 ప్రస్థములు ఆవు పాలుపోసి విధిప్రకారము పాకముచేసి స్త్రీలకిప్పించి సేవింపజేసిన యోనిరోగము న్నియు నిశ్శేషముగ స్వస్థమగును.

## యోనిరోగములకు ఫలఘృతము.

శ్లో॥ సహాచరద్వే ఫలేత్రిఫలాంగుడూచీం సపునర్నవాం। శుకనా

సాంహార్యద్రేద్వేరాస్నాంమేదాంశతావరీం । కల్కీకృత్యఘృత
ప్రస్థంపచేత్క్షీరేచతుర్గుణే । తత్సిద్ధంపాయయేన్నారీం యోని
శూలనిపీడితాం ।పీడితాచలితాయాచనిస్సృతావివృతాచయా।
పిత్తయోనిశ్చవిభ్రాన్తాషణ్ణయోనిశ్చయాస్మృతా। ప్రపద్యం
తేవాతాస్థానం గర్భంగృహ్ణానిచాసకృత్ । ఏతత్ఫల ఘృతం
నామయోనిదోషహారంపరం ॥

తా॥ పచ్చనిపూలుగల ములుగోరింట నల్లనిపూలుగల ములుగోరింట కరక తాండ్ర ఉసిరికలు తిప్పతీగె గలిజేరు దుందిలపువేళ్లు పసపు మానిపసపు సన్నరాష్ట్రకము మేద దీనికిబదులు (అతిమధురము) చల్లపిల్లిగడ్డలు వీటిని కల్కముజేసి యందొకప్రస్థము నెయ్యి నేతికి నాలుగింతలు ఆవుపాలు యాపాలకు సమము ఉదకముబోసి ఘృతపక్వముగకాచి వడియగట్టి యోనిశూలగల స్త్రీలును మైథునాదులచే పీడితమగు యోనిగ స్త్రీలును యోనిచలించి కమలముచెడి బైలువెడలి వివృతమగు యోనిగల స్త్రీలును గర్భధారణముగాక యుండెడి స్త్రీలును సేవించిన వారికిగల యోనిరోగములన్నియు నశించి యోనిస్వస్థానంబులజేరి న [illegible] ింబుగ గర్భధారణమును జెందుదురు. ఇదియ లఘుఫలఘృత [illegible] ఇది యోనిదోషంబులన్నిటిని నశింపంజేయుటయందు శ్రేష్ఠం [illegible]

## యోనిశూలలకు చికిత్స.

శ్లో॥ పిచుమన్దరసేనమిశ్రితైః పిచుమందానిలశత్రుబీజకైః ।
ఘటితావటుకాభగాన్తరేభగశూలస్యశమాయధారయేత్ ॥

వేపఆకురసముచే వేపబీజములు ఆముదపుబీజములు వీటినినూరి ఘుటికలు [illegible] యోనియందుంచుకొనిన యోనిశూలలు మానును.

## రెండవ చికిత్స.

శ్లో। తరుణ్యుత్తరణీమూలంచాగీసర్పిసమన్వితమ్ ।
నిఘ్నన్త్రిభిధాంబాధాంయోనిస్థాంహంతిసత్వరం ॥

రిపుచ్చవేరును మేకనేతిలో పక్వముగవండి యోనిమీద లేపన [illegible] శూలలు మాను

## ప్రదరరోగ వివరణము.

శ్లో॥ తథాచరక్తప్రదరంచతుర్విధముదాహృతం ।
వాతపిత్తకఫైస్త్రేధాచతుర్థంసన్నిపాతతః॥

తా॥ వాతప్రదరము పిత్తప్రదరము శ్లేష్మప్రదరము సన్నిపాతప్రదరము అన ప్రదరరోగములు 4 విధములు. వానివివరమెట్లన్న:—

విరుద్ధమద్యపానము అజీర్ణము గర్భపాతము అతిమైథునము అత్యుష్ణము అత్యాగమనము అతిభారము దివానిద్ర మొదలగు కారణములచే స్త్రీలయార్తవము దుష్టమై వెడలుట రక్తప్రదరమనంబడు. ఇది స్త్రీలకుమాత్రమే గలుగు. ఇది గలుగుటకు తొలుత ఒడలువిరుపు వేదన దుర్బలము గ్లాని మూర్ఛ తృష్ణ మంటలు తరుచుమాటలాడుట శరీరము తెల్లబారుట కంఠ్హుపముబ్బు మొదలగు దుర్గుణములుదోచు. ఈరక్తప్రదరరోగము వాత పిత్త శ్లేష్మ సన్నిపాతభేదములచే 4 విధములు. అందు వాతవికారముచే రూక్షము రక్తవర్ణము నురుగునుగల రక్తము వేదనతో కొంచకొంచముగ స్రవించుట వాతజన్యరక్తప్రదరమనియు పిత్తప్రకోపముచే నది నీలవర్ణంబును వుష్ణమును గలిగి కడుపడిని స్రవించుట పిత్తజన్యరక్తప్రదరమనియు శ్లేష్మవికారముచే నది ఆమంబుగను బంకగను బుగ్గలుగను పాండువర్ణంబును గలిగి స్రవించుట శ్లేష్మజన్యరక్తప్రదరమనియు సన్నిపాతదోషముచే తేనె నెయ్యి హరిదళము మజ్జ మొదలగు వానివలెనుండి పీనుగవాసన గలిగి స్రవించుట సన్నిపాతప్రదరమనియు బఱంగు. ఇది కడపటిది యసాధ్యము.

## ప్రదరరోగ చికిత్స.

శ్లో॥ కటంకటేరీరసజాబ్దవాసా భూనింబభల్లీతిలజఃకషాయః ।
క్షౌద్రాన్వితంచంచలలోచనానాం ।
నానావిధానిప్రదరాణిహన్యాత్॥

తా॥ మానిపసపు రసాంజనము తుంగముస్తెలు అడ్డసరపాకు నేలవేము జీడిగింజలు నువ్వులు వీటిని సమభాగములుగ కషాయముపెట్టి అందు తేనెవైచి పుచ్చుకొనిన స్త్రీలకుగల నానావిధములైన ప్రదరములు మానును.

## యోనిఘర్షణమునకు లేపము.

శ్లో॥ ఫలాతోయుంబరఫలాస్త్రైలసమన్వితః ।

మధునాయోనిమాలింపేద్గాఢీకరణముత్తమం॥

తా॥ మోదుగఫలము అత్తిఫలము వీటినినూరి నువ్వులనూనెలో గలిపి అందు స్వల్పముగ తేనెచేర్చి శిథిలమైనయోనికి లేపముజేసిన నదిఘట్టిపడు.

## స్త్రీలకువస్తికర్మ చేయునట్టిక్రమము.

శ్లో॥ స్త్రీణాంకనిష్ఠికాస్థూలం నేత్రంకుర్యాద్దశాంగులం ।
ముద్గప్రవేశ్యంయోజ్యంచయోన్యంతశ్చతురంగులం ।
ద్వ్యంగులంమూత్రమార్గేచసూక్ష్మంనేత్రంనియోజయేత్ ॥

తా॥ స్త్రీలకు వస్తికర్మ జేయవలసియుండెనేని చిటికిన వ్రేలిలావున 10 అంగుళములపొడవును పెసరగింజదూరునంత ఛిద్రమునుగల చిమ్మనగ్రోవిని నేర్పరచి దానిని యోనిలో 4 అంగుళములప్రమాణము బ్రవేశింపజేసి వస్తిపీడనముజేయవలయు. మఱియు స్త్రీలయొక్క మూత్రమార్గంబున (సూక్ష్మనేత్రమన) పైజెప్పిన సన్నపుగొట్టమును 2 అంగుళములప్రమాణము ప్రవేశింపంజేసి వస్తిపీడనము జేయవలయు.

## స్త్రీలకువస్తికి స్నేహప్రమాణము.

శ్లో॥ యోనిమార్గేషునారీణాం స్నేహమాత్రాద్విపాలికీ ।
మూత్రమార్గేపలోన్మానాబాలానాంచద్వికార్షికీ ।
ఉత్తానాయైస్త్రియైదద్యాదూర్ధ్వజాన్వైవిచక్షణః ।
అప్రత్యాగచ్ఛతిక్షిపగ్వస్తావుత్తరసంజ్ఞకే॥

తా॥ స్త్రీకి యోనిమార్గముగ వస్తికర్మను చేయవలసియుండునెడల 1 పలప్రమాణస్నేహమును నుపయోగించవలయు. బాలురకుచేసెడి వస్తికర్మయందు 2 కర్షములప్రమాణము స్నేహము నుపయోగపరచవలయు. మఱియు ఉత్తరసంజ్ఞగల వస్తికర్మయందు బుద్ధిమంతుడగు వైద్యుడు ఆస్త్రీని వెల్లికలపరుండబెట్టి మోకాళ్ళను వూర్ధ్వముగ చాచునటులంజేసి స్నేహము బయిటకి రాకుండునటుల ఉత్తరవస్తిప్రయోగము చేయవలయు.

## శోధనద్రవ్యములచే వస్తివిధానము.

శ్లో॥ భూయోవస్తింవిదధ్యాచ్ఛసంయుక్తైశ్శోధనైర్గణైః । ఫలవర్తింనిదధ్యాద్వాయోనిమార్గేదృఢంభిషక్ । సూత్రైర్గ్రథ్వానిగ్మ

తాంస్నిగ్ధాంశోధనద్రవ్యసంయుతాం । దద్యాద్యోనౌతథావ
స్త్రావదద్యాద్వస్తింవిచక్షణః । క్షీరవృక్షకషాయేణపయసాశీత
లేనచ । వస్తిశ్శుక్రరుజఃపుంసాంస్త్రీణామార్తవజాంరుజామ్ ।
హన్యాదుత్తరవస్తిస్తునోచితోమేహినాంక్వచిత్ ॥

తా॥ మూత్రకృచ్ఛ్రాదిరోగంబులయందు ఆముదము మొదలగు శోధనద్రవ్యములచేయోనిమార్గముగ వస్తిప్రయోగము చాయవలయు. లేక ఆముదపువిత్తులు మొదలగు శోధనద్రవ్యములునూరి వస్త్రమునకైనను దారమునకైనను లేపనముజేసి గట్టిగవత్తిజేసి దానిని ఆముదము మొదలగువాటిలోతడిపి దానిపై ఆముదపువిత్తులు మొదలగువాటి చూర్ణము లేపనముజేసి నావత్తిని యోనియందుంచుకొనవలయు. అటులవత్తిని యోనియందుంచుకొనుటచే నాభికధోభాగమందలి యుండునట్టి పొత్తికడుపు వికృతిని జెందనేని అత్తి మఱ్ఱి మొదలగు క్షీరవృక్షపు పట్టలయొక్క కషాయముతోనైనను పచ్చిపాలతోనైనను వస్తిప్రయోగముజేయవలయు. అటులంజేసిన పొత్తికడుపు శుద్ధియగుటయగాక శుక్రధాతుగతరోగంబులును ఆర్తవసంబంధములగు రోగంబులును హరించు. ప్రమేహముగలస్త్రీలకు వస్తికర్మజేయందగు.

## శరీరదౌర్గంధ్యము తొలుగుటకై లేపము.

శ్లో॥ తాంబూలపత్రచూర్ణంతు చూర్ణంకుష్ఠశివాభవం ।
వారిణాలేపనంకుర్యాద్గాత్రదౌర్గంధ్యనాశనం॥

తా॥ తమలపాకులు చంగల్వకోష్టు కరక్కాయ వీటిని చూర్ణముజేసి ఉదకమునందుగలిపి శరీరమునకు లేపనముజేసిన శరీరదౌర్గంధ్యము మానును.

## అన్యచ్చ.

శ్లో॥ ఫలిత్థసక్తవఃకుష్ఠంమాంసీంచందనజంరజః ।
శక్తవశ్చణకస్యైవత్వక్చైవైకత్రకారయేత్ ।
స్వేదదౌర్గంధ్యనాశశ్చజాయతేస్యావధూలనాత్ ॥

తా॥ వేయించినవులవపిండి చంగల్వకోష్టు జటామాంసి శ్వేతచందనపుచెక్కయొక్కపొడి వేయించినశనగలపిండి వీటినన్నిటిని చూర్ణముచేసి శరీరమునకు లేపనముజేసిన చెమటచేగలిగిన దౌర్గంధ్యము మానును.

## వర్ణక ఘృతము.

శ్లో॥ మధుకంచందనంకంగుసక్ష్మంపద్మకంతథా । కాలేయకంహరిద్రాచకౌశిధ్రిమేభిశ్చకల్కితైః॥ విపచేద్ధిఘృతంవైద్యస్తత్పక్వం వస్త్రగాలితం । పాదాంశంకుంకుమంసిద్ధంక్షిప్త్వామందానలేపచేత్॥ తత్సిద్ధంశిశిరేనీరేప్రక్షిప్యాకర్షయేత్తతః। తదేతద్వర్ణకంనామఘృతంవక్త్రప్రసాదనమ్ ॥ అనేనాభ్యాసలిప్తంహివలీభూతమపిక్రమాత్ । నిష్కలంకేందుబింబాభంస్యాద్విలాసవతీముఖమ్॥

తా॥ యిష్టిమధుకము **చందనము** కోష్టులు ఆవాలు పద్మకము పసుపు మ్రానిపసుపు తెల్లలొద్దుగు వీటిని సమాంశములుగదెచ్చి కల్కముజేసి ఆవునేతిలో కలిపి విధిప్రకారము పాకముజేసి వడియగట్టి అందు కుంకుమపువ్వు మైనము వీటిని 1 పలము చేర్చి మరల మందాగ్నిలో కొంచముపాకముజేసి శుద్ధమైన పాత్రయందునిచి ఆ పాత్రను శీతోదకములో కొంతసేపుర్పుంచి చల్లారినపిదప యాఘృతమును ప్రతిదినము ముఖమునకు పూసుకొనుచూవచ్చిన స్త్రీలయొక్క ముఖము నిర్మలమైన చంద్రబింబము యొక్క కాంతితో **సమానముగనుండును.** ఇది కాంతలయొక్క ముఖకాంతికి ప్రశస్తమైనది.

## వన్ధ్యాదులకు ఫలఘృతము.

శ్లో॥ త్రిఫలామధుకంకుష్ఠం ద్వేనిశేకటురోహిణీ । విడఙ్గంపిప్పలీముస్తంవిశాలాకట్ఫలంవచా । ద్వేమేదేద్వేచకాకోల్యౌసారిబేద్వేప్రియఙ్గుకా । శతపుష్పాహింగురాస్నాచన్దనంరక్తచందనం । జాతీపుష్పంతుగోక్షీరీకమలంశర్కరాతథా । అజమోదాచదన్తీచకల్కైరేతైశ్చకార్షికైః । జీవద్వత్సైకవర్ణాయాఘృతప్రస్థంచగోఃక్షిపేత్ । చతుర్గుణేనపయసాపచేదారణ్యగోమయైః। సుతిక్ష్ణాపుష్యనక్షత్రేమృద్భాండేతామ్రజేతథా।తతఃపిబేచ్ఛుభదినేనారీవాపురుషోథవా। ఏతత్సర్పిర్నరఃపీత్వాస్త్రీషు నిత్యంవృషాయతే। పుత్రానుత్పాదయేద్ధీమాన్వన్ధ్యాపిలభతే

సుతం । అనాయుషంయాజనయేత్యాచసూతాస్సుర్ధి తా। పు
త్రంప్రాప్నోతిసానారీబుద్ధిమంతంశతాయుషం । ఏతత్ఫలఘృ
తంనామభారద్వాజేనభాషితం। అనుక్తంలక్ష్మణామూలంక్షి
పేత్తత్రచికిత్సకః॥

తా॥ త్రిఫలములు యష్టిమధుకము చెంగల్వకోష్టు పసపు మానిపసపు కటుక
రోహిణి వాయువిళంగములు పిప్పళ్ళు తుంగముస్తలు పెద్దపాపరవేళ్ళు కాయఫలము
వస మేద మహామేద కాకోళి క్షీరకాకోళి పెద్దసదాప నల్లసుగంధిపాల తెల్లసుగంధి
పాల ప్రేంకణము వేయించిన ఇంగువ సన్నరాష్ట్రము శ్రీగంధము రక్తచందనము
జాజిపూలు నెమరుప్ప కమలము శర్కర అజామోదము నేపాళపువేళ్ళు వీటినిదినును
యొకటింటికి కషప్రమాణము గ్రహించి కల్కముజేసి నీకల్కమును శరీరంబంతయు
నేకవర్ణంబును జీవించినగూడయు నేయాపుకు గలిగియుండెడినో యట్టిదాని నెయ్యి
1 ప్రస్థంబును నేతికి 4 గింతలు ఆవుపాలు నొకమంటిపాత్రలోనైనను తామ్రపాత్ర
లోనైననుబోసి పుష్యనక్షత్రముతోగూడిన సుదినంబున ఆడవియేరుపిడకల నిప్పు
చేఘృతపక్వముగ పాకముజేసి వడియకట్టి శుభదినంబున పురుషులుపుచ్చుకొనిన వారికి
వీర్యవృద్ధికలిగి సంతానమును గలుగంజేసెదరు వంధ్యాస్త్రీలు సేవించిన వారికి సంతాన
ములుగలుగు. మఱియు నేస్త్రీకి సంతానముగలిగినతోడనే మృతినొందునో అట్టి స్త్రీ
సేవించిన బుద్ధిమంతులును 100 సంవత్సరములు జీవించెడివారునునగు పుత్రులంగనును.
ఇది భారద్వాజమహాముని ప్రోక్తంబగు ఫలఘృతమనిపఱంగు. ఇందు గర్భధారణమును
గలుగంజేసెడి లక్ష్మణమూలము (తెల్లకాయలుగలముసగవేరు) జెప్పంబడకయుండు
టచే దానిని చేర్చుకొనవలయు.

## కుమారకల్పద్రుమ ఘృతము.

శ్లో॥ పంచాశచ్ఛాగమాంసస్యదశమూల్యాస్తథైవచ। జలేమష్టగు
ణందత్వాక్వాథేనమృదునాద్నినా॥ చతుర్భాగావశేషంచక్వా
థంగృహ్యాత్ప్రియత్నతః । గవ్యప్రస్థద్వయంసర్పిగృహీయా
త్కుశలోభిషక్ ॥ క్షీరంఘృతసమందద్యాన్నారాయణ్యారసస్త
థా । తామేవమృణ్మయేపాత్రేతదేకత్రపచేచ్ఛనైః॥ కుష్ఠం
శఠీచమేదేద్వేజీవకర్షభకౌతథా । ప్రియంగుత్రిఫలాదారుపత్ర

మేలాశతావరీ ॥ కాశ్మరీమధుకంక్షీరకాకోళీము స్తముత్పలం ।
జీవ న్తీచందనంచైవకాకోళీశారిబాయుగం॥ శ్వేతవాట్యాజలం
మూలంమూలంచశరపుంఖజమ్! విదారీద్వయమంజిష్ఠాపర్ణినీ
ద్వయమేవచ । నాగపుష్పంతథాదారుహరిద్రారేణుకంతథా॥
జ్యోతిష్మతీభవంమూలంశంఖినీనీలినీవచా। అగురుత్వగవంగం
చకుంకుమంనిక్షిపేత్తథా।ఏతేషాకార్షికంకల్కందత్వాశుభ
దినేసుధీః॥ శుభనక్షత్రయోగేచసంపూజ్యగణనాయకం। శంక
రంచమృడానీంచనమస్కృత్వాతిభ క్తితః ॥ పాకంకుర్యాత్ప్రి
యత్నేనవిజార్ణమ న్త్రపూర్వకమ్ । సిద్ధశీతేక్షిపే త్తత్రపారదం
పరినిర్మలమ్ ॥ సుజీర్ణశోధితంతామ్రంగంధకంకార్షికంన్య
సేత్ । తతఃపుష్పర సంతత్రప్రస్థార్థంచవినిక్షిపేత్ ॥ కాచసం
పుటకేవాన్యపాత్రేవాస్థాపయేత్సుధీః । పరాశరమునిఃప్రీతికరు
ణావారిధిర్ముదా । వంధ్యామయవినాశాయ శిశుకల్పద్రుమం
ఘృతం॥ చకారాస్యప్రసాదేనజన్మవంధ్యాలభేత్సుతమ్। ఖాదే
త్కర్షద్వయంసర్పిర్దత్వావిప్రాయసాదరమ్ ; అనుపానంప్రకు
ర్వీతపయశ్ఛాగంవిశేషతః। గవ్యంవాపిబేత్క్షీరంశీతంపలయుగం
తథా॥ ఘృతస్యాస్యసుసిద్ధస్యగుణాఞ్శృణుసమాహితః। అస్య
ప్రసాదాత్షండోపివంధ్యాయాంజనయేత్సుతాఞ్॥ రజోదోషే
ణయామృష్టాశుక్రదోషేణయాపిచ। స్త్రీభగస్యగదేనైవపీడితా
యాచసర్వదా॥ యాచపుష్పంనవిందేతఋతునాపీడితాచయా।
భూత్వాభూత్వాచనశ్యంతి సుతాయాసాంముహుర్ముహుః॥
అనేకౌషధయోగేనమంత్రయోగేనవాపునః।అనేకవ్రతయోగే
నయాసాంపుత్రోనజాయతే । తాసాంకామసమాఃపుత్రాజా
యంతేచిరజీవినః॥ఏతద్ఘృతంగృహేయస్యనతస్యకులిశాద్భయ
మ్। నరాశ్చసైఃపిశాచైశ్చగృహ్యాతేతత్రబాలకః ॥ నోపసర్పతి
సర్పోపిదర్పాత్తస్యగృహాన్తికమ్॥

తా॥ మేకమాంసము 50 పలములు దశమూలములు 50 పలములు ఈ రెంటిని యెనిమిదిరెట్ల నీళ్లయందువైచి మందాగ్నిచే 4 వ పాలు మిగులునటుల కషాయము కాచి వడియబోసి అందు 2 ప్రస్థములు ఆవునెయ్యి 2 ప్రస్థములు ఆవుపాలు 2 ప్రస్థములు పిల్లిపీచరరసము వీటినిజేర్చి దానినంతయునొక పెద్దరాగిపాత్రయందుగాని లేక దృఢముగనుండు మట్టిపాత్రయందుగాని బోసి కలియపెట్టి అందులో చెంగల్వకోష్టు చిరుబొద్ది మేద మహామేద జీవకము ఋషభకము ప్రేంఖణము త్రిఫలములు దేవదారు జాపత్రి యేలకులు పిల్లిపీచర పెద్దగుమ్మడు యష్టిమధుకము క్షీరకాకోళి తుంగముస్తలు నల్లకలువ పిన్నమనుబాల రక్తచందనము కాకోళి సుగంధిపాల నల్లసుగంధిపాల ముత్తవపులగపుచెట్టువేళ్ళు వెంపలివేళ్లు నేలగుమ్మడు తెల్లనేలగుమ్మడు మంజిష్టి కాఋమినుములు పిల్లిపెసర నాగకేసరములు మ్రానిపసపు రేణుకలు తెక్కుడుతీగవేళ్ళు శంఖిని పెద్దనీలి వస అగరుచెక్క లవంగపట్ట లవంగములు కుంకుమపుష్పవీటినన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగ కర్షప్రమాణముచొప్పునజేర్చి కలిపి విఘ్నేశ్వరుడు పార్వతి పరమేశ్వరుడు వీరలనుబూజించిఘృతపక్వముగ పాకముచేసిదించి చల్లారినతరువాత దానియందు శుద్ధపాదరసము శుద్ధాభ్రకము శుద్ధగంధకము వీటిని ప్రత్యేకముగ కర్షప్రమాణముచొప్పునచేర్చి $\frac{1}{2}$ ప్రస్థము తేనెపోసి దానిని గాజుపాత్రయందుగాని లేకశుద్ధమైన యితర యేపాత్రయందుగాని భద్రముచేయువలయును. ఇది కుమారకల్పద్రుమ ఘృతమనబడును. దీనిని దయాసముద్రుడగు పరాశరుడు వంధ్యాదోషపరిహారార్థముచెప్పెను. దీనిని పుచ్చుకొనిన పుట్టుగొడ్డురాలికికూడా మంచిపుత్రుడుకలుగును. ఈఘృతమును మొదట బ్రాహ్మణులకు భక్తియుక్తదానంబొసంగి తరువాత ప్రతిదినము 2 కర్షములచొప్పున సేవించి 2 పలముల చల్లారిన మేకపాలనుగాని లేక ఆవుపాలనుగాని త్రాగవలయును. యిటులజేసిన నపుంసకునికి గొడ్డురాలునందు సహితము పుత్రులుకలుగుదురు ఆర్తవదోషము శుక్రదోషము యోనిరోగములు వీట్లచే బాధింపబడుస్త్రీలకును రక్తప్రాయముకలిగియు పుష్పవతులుకాని పడుచులకును సదా రజస్రావముకల వనితలకు ఈ యౌషధమును సేవింపజేసిన వారివారికి ఆయారోగములుతొలగి ఆరోగ్యమున్ను పుత్రసంపత్తున్ను కలుగును. మరియు నెట్టిస్త్రీలు పెక్కు అవుషధసేవనలచేతను అనేకవ్రతములనోచుటచేతను అనేకవిధమంత్రముల జపించుటచేతను సంతానమునుబడయకుండిరో నట్టిస్త్రీలు యీఘృతమును సేవించుటచే మన్మథతుల్యమైన సౌందర్యము దీర్ఘాయువుగలిగినపుత్రులను బ్రసవింతురు. మరియు నెచ్చోట నీఘృతమానుంచుదురో నచ్చోట రాక్షసపిశాచ సర్పాదులవలన భయముండనేరదు. ఈ ఘృతము యోనిశుక్రదోషాదులను నివర్తింపజేయుటయందు ముఖ్యమైనది.

## ఫలకల్యాణ ఘృతము.

శ్లో॥ మంజిష్ఠామధుకంకుష్ఠంత్రిఫలాశర్కరాబలా । మేదేపయస్యా కాకోలీమూలంచైవాశ్వగంధజం ॥ అజామోదాహరిద్రేద్వే హింగుఃకటుకరోహిణీ । ఉత్పలంకుముదంద్రాక్షాకాకోళ్యౌ చందనద్వయం ॥ ఏతేషాంకార్షికై ర్భాగై ర్ఘృతప్రస్థంవిపాచయేత్ । శతావరీరసక్షీరంఘృతాద్దేయంచతుర్గుణం। సర్పిరేతన్నరఃపీత్వానిత్యంస్త్రీషున్వృషాయతే।పుత్రాన్‌సంజనయేన్నారీమేధాఢ్యాన్‌ప్రియదర్శనాన్।యాచైవాస్థిరగర్భాచయాచవాజనయేన్మృతమ్।అల్పాయుషంవాజనయేద్యాచకన్యాంప్రసూయతే। యోనిదోషేరజోదోషేపరిస్రావేచశస్యతే ॥ ప్రజావర్ధనమాయుష్యంసర్వగ్రహనివారణమ్॥నామ్నాఫలఘృతంహ్యేతదశ్విభ్యాంపరికీర్తితమ్॥ అనుక్తంలక్ష్మణామూలాంక్షిపంత్యత్రచికిత్సకాః । క్వాథేనహయగంధాయాఃసాధితంసఘృతంపయః॥ ఋతుస్నాతాబలాపీత్వాగర్భందత్తేనసంశయః ॥ పిప్పలీశృంగిబేరంచమరిచంనాగకేసరం । ఘృతేనసహపాతవ్యంవంధ్యాపిలభతేసుతమ్॥

తా॥ మంజిష్ఠ యష్టిమధుకము చెంగల్వకోష్టు త్రిఫలములు చక్కెర ముస్తవపులగము మేద మహామేద పిన్నమనుబాల క్షీరకాకోళి పెన్నేరుగడ్డ అజామోదము పసుపు మానిపసుపు యింగువ కటుకరోహిణి నల్లకలువ తెల్లకలువ ద్రాక్ష కాకోళి చందనము రక్తచందనము వీటిని వేర్వేరుగ 1 కర్షము వంతునజేర్చి కల్కముజేసి 1 ప్రస్థపు ఆవునేతిలోకలిపి దానియందు 4 ప్రస్థములు చన్నచల్లగడ్డరసము 4 ప్రస్థములు ఆవుపాలుబోసి ఘృతపక్వముగ పాకముజేయవలయును. దీనిని సేవించిననరునికి అమితమైన వీర్యవృద్ధిగలుగును. మరియు దీనిని స్త్రీలుసేవించిన బుద్ధిసౌందర్యములతోగూడిన కొమాళ్ళను కనుదురు. మరియు నీఘృతమును గర్భస్రావముగలవని తలకును మృత శిశువులను ప్రసవించు కాంతలకును అల్పాయుస్సుగలిగిన శిశువులను కనునట్టి యువతులకును సదా ఆడశిశువులనే ప్రసవించునట్టి స్త్రీలకునుయిచ్చిన దీర్ఘాయువు మంచి రూపము మంచిగుణములు వీనితోగూడిన మొగబిడ్డలను కనుదురు. యోనిరోగము

శుక్రదోషము పుష్పదోషము రక్తస్రావము యివిగల స్త్రీలకిప్పించిన వారలకు ఆయారోగములను నివర్తింపంజేసి ఆయువు సంతానము వీనిని గలుగంజేయు సమస్తగ్రహపీడలను నివర్తించును. ఇది అశ్వినీదేవతలచే చెప్పబడిన ఫలకల్యాణఘృతమనబడును. దీనియందు లక్ష్మణపంజివేళ్లను చేర్చబడకయుండినను దానిని ముఖ్యముగ చేర్చవలయును అని అనుభవవైద్యులు చెప్పుచున్నారు. పెన్నేరుగడ్డ కషాయమునందు తయారుచేయబడిన యీఘృతమును స్త్రీలు ఋతుస్నానముజేసినరోజునందు సేవించిన నిశ్చయముగ గర్భవతులగుదురు. మరియు పిప్పళ్లు అల్లము నాగకేసరములు మిరియాలు వీటిని సమాంశములుగదెచ్చి చూర్ణించి యీఘృతములోచేర్చి వంధ్యలకుయిచ్చిన నిశ్చయముగ గర్భవతులగుదురు.

## బృహత్సిద్ధార్థకాది ఘృతము.

శ్లో॥ సిద్ధార్థకంవచాబ్రాహ్మీశంఖపుష్పీపునర్నవా । పయస్యాత్రిఫలాకుష్ఠంతథాకటుకరోహిణీ । శారిబాద్వయయష్ట్యాహ్వచోరకంసుమనోలత । వృషాపుష్పంసహమంజిష్ఠాదేవదారుమ్మహౌషధమ్॥పిప్పల్యౌభృంగరాజంచనిశాశ్యామాసువర్చలా।దశమూలమపామార్గమశ్వగంధాశతావరీ ॥ జలద్రోణేపచేదేతన్యాగ్రైర్ద్విపలకైరిమాః ॥ తత్కషాయంపరిస్రావ్యఘృతస్యార్ధాఢకేపచేత్॥ సాచితంతచ్ఛ్రితింయుక్త్వాగాయత్ర్యాచాభిమంత్రితమ్ । ద్విమాసగర్భిణీనారీమణ్మాసాధుపయోజయేత్ ॥సర్వజ్ఞంజనయేత్పుత్రంసర్వామయవివర్జితమ్।అస్యప్రభావాత్కుష్ఠీస్ఫుటవాగ్వాహరత్యపియోనిదుష్టాశ్చయానార్యోరేతోదుష్టాశ్చయోనరాః॥వంధ్యాపిలభతేగర్భంశూరంపండితమానినమ్॥

తా॥ తెల్లఆవాలు వస మండూకబ్రహ్మి శంఖపుష్పి గలిజేరు పిన్నపాల త్రిఫలములు చెంగల్వకోష్టు కటుకరోహిణి గూడపాల సుగంధిపాల నల్లగూడపాల అతిమధురము చోరకము (చండయను గ్రంధ్యము) జాజితీగె అడ్డసరపుష్పములు మంజిష్ఠి దేవదారు శొంఠి పిప్పలి గజపిప్పలి గుంటగలగర పసుపు నల్లతెగడ సౌవర్చలవణము దశమూలములు ఉత్తరేణు పెన్నేరుగడ్డ పిల్లిపీచర వీటిని వెవ్వేరుగ 2 పలములవంతున దెచ్చి దంచి నాటిని ద్రోణప్రమాణోదకమునందు వైచి కషాయముగా [illegible] వడియబోసి

అందు ఆవునెయ్యి 1 ఆఢకముచేర్చి నెయ్యిమిగులునటులకాచి దానిని గాయత్రీమం త్రముతో అభిమంత్రించి స్త్రీలకు గర్భముధరించిన 2 వ మాసము మొదలు 6 మాసముల వరకు యిచ్చిన వారు సకలరోగరహితులై సర్వజ్ఞులైన సపుత్రులను బడయుదురు. ఈయౌషధమహిమచే గర్భమునందుండు శిశువులకు స్ఫుటమైనవాక్కు కలుగును మఱియు నీయౌషధము స్త్రీయోనిరోగములనున్ను పురుషశుక్రదోషములనున్ను నివర్తించును. గొడ్డురాలువకీఘృతమునిప్పించి సేవింపజేసిన నట్టిస్త్రీ గర్భమునుధరించి పండితజ్ఞానము గలపుత్రుని ప్రసవించును.

## మంజిష్ఠాది ఘృతము.

శ్లో॥ మంజిష్ఠామధుకోత్పలంద్విబృహతీకాంత్యశ్వగంధామృతా।
తక్రాగ్రాహికహింగుగ్రంధితగరంరుక్కాచనీపద్మకమ్ ।
సిద్ధంభాష్కరకషులోచనవృషశుక్లాఘృతేపాచతాః।
శార్ఙ్గష్టాస్వరసేషుగర్భజననంవంధ్యాప్రసూతేసుతమ్ ॥

తా॥ మంజిష్టి యష్టియధుకము నల్లకలువ చిన్నములక పెద్దములక రేణుకలు పెన్నేరుగడ్డ తిప్పతీగె చేదుపొట్ల వెలగ ఇంగువ గ్రంధితగరము చంగల్వకోష్టు పసుపు తామరతూండ్లు జిల్లేడు గచ్చపలుకులు టెంకాయ అడ్డసరము నేలగుమ్మడు కాకి దొండ వీటిరసములను సమభాగములుగ గ్రహించి నేతిలోవైచి ఘృతపాకవిధిగ పక్వ ముజేసి స్త్రీలకిప్పించిన వారికి వంధ్యత్వము మృతవంధ్యత్వము యివి నివర్తించి కుమారులం గనుదురు.

## లఘుఫల ఘృతము.

శ్లో॥ సహచరేద్వేత్రిఫలాంగుడూచీసపునర్నవాం । శుకనాసాంహ రిద్రేద్వేరాస్నాంమేదాంశతావరీమ్ । కల్కీకృత్యఘృతప్రస్థం పచేత్క్షీరచతుర్గుణమ్ । తత్సిద్ధంప్రపిబేన్నారీయోనిశూలప్రపీడి తా । పిండితాచలితాయాచనిస్సృతావివృతాచయా । పిండ యోనిస్తువిస్రస్తాషండయోనిశ్చయాస్మృతా । ప్రపద్యంతేతు తాస్థానంగర్భంగృహ్ణంతిచాసకృత్ । యేతత్ఫలఘృతంనామ యోనిదోషహరంపరమ్ ॥

తా॥ గోరింట ములుగోరింట త్రిఫలములు తిప్పతీగ గలిజేరు దుంఢిలము చనుపు మానిపసుపు సన్నరాష్నము మేద మహామేద పిల్లిపీచర వీటిని సమభాగములుగ గ్రహించి కల్కముజేసి యీకల్కమును 1 ప్రస్థపు ఆవునేతిలోకలిపి అందు 4 ప్రస్థములు ఆవుపాలుబోసి ఘృతపక్వముగ పాకముజేసి యోనిలో శూలలుగల స్త్రీలకిచ్చి సేవింపజేసిన యెల్లపుడు తెరవబడినదియును లేక మూయబడినదియును లేక స్వస్థానమునుండి జారినదియును లేక వెలుపటికివచ్చినదియును లేక గర్భమును ధరింపకుండునదియును నైన యోనులు స్వభావస్థానము జెంది గర్భమును ధరింతురు. ఇది లఘుఫల ఘృతమనబడును.

ఇతి శ్రీవేంకటదాసాత్మజ జయకృష్ణదాసకృతౌ

చికిత్సారత్నే ప్రథమాశ్వాస

స్సమాప్తః.



## ఆంధ్ర తాత్పర్యము.

### ద్వితీయాశ్వాసము.

#### గర్భిణీజ్వర చికిత్స.

శ్లో॥ మధూకచందనోశీరసారివాయష్టిపద్మకైః ।
శర్కరామధుసంయుక్తఃకషాయోగర్భిణీజ్వరే ॥

తా॥ ఇప్పపట్ట చందనము వట్టివేరు సుగంధపాల అతిమధురము తామర తూండ్లు వీటిని కషాయము పెట్టి శర్కర తేనె వేసి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకిగల జ్వరము నివర్తించు.

#### రెండవ చికిత్స.

శ్లో॥ చందనంసారివాలోధ్రంమృద్వీకాశర్కరాన్వితం ।
క్వాథంకృత్వాప్రదద్యాచ్చగర్భిణీజ్వరశాంతయే ॥

తా॥ చందనము సుగంధపాల లొద్దుగపట్ట ద్రాక్ష వీటిని కషాయము పెట్టి శర్కర తేనె వేసి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకిగలిగెడి జ్వరము హరించు.

#### మూడవ చికిత్స.

శ్లో॥ పయస్యాసారివాపాఠాతోయతోయదనాగరైః ।
శృతంశీతంపిబేద్వాతిగర్భిణీజ్వరవారణం ॥

తా॥ సుగంధపాల అగలుశొంఠి వట్టివేరు తుంగముస్తెలు శొంఠి వీటిని కషాయము పెట్టి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకిగల జ్వరము నివర్తించు.

## పిత్తజ్వర చికిత్స.

శ్లో॥ [illegible]
[illegible]
పిత్తజ్వరహారఃక్వాథోగర్భిణీనాంప్రశస్యతే ॥

తా॥ ద్రాక్ష తామరతూండ్లు వట్టివేరు గుమ్మడువేరు చందనము యష్టిమధుకము సుగంధపాల ఉసిరిక వీటిని కషాయము పెట్టి కొంచము పాలువైచి పుచ్చుకొనిన గర్భిణిస్త్రీకిగల పిత్తజ్వరము మానును.

## విషమజ్వర చికిత్స.

శ్లో॥ పీతవిశ్వమజాక్షీరైర్గ్బర్భిణీశమయేద్విషమజ్వరం ॥

తా॥ శొంఠిని మేకపాలతోనూరి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీలకు గలిగెడి విషమజ్వరము మానును.

## సంగ్రహణీజ్వర చికిత్స.

శ్లో॥ జ్వరాతిసారేగర్భిణ్యాఃశ్స్తంసామేనశోణితే ।
సమంగామధుకంలోధ్రింపాచితంశర్కరాన్వితం ।
ప్రవాహికాయాంగర్భిణ్యాంశ్స్తంసామేనశోణితే ॥

తా॥ మంజిష్ఠ యష్టియధుకము లొద్దుగచెక్క వీటిని చూర్ణముచేసి శర్కరపాకముపట్టి ఆచూర్ణము నాపాకములోవైచి లేహపక్వముగతీసి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకిగల జ్వరాతిసారము రక్తాతిసారము ఇవి మానును.

## రెండవ చికిత్స.

శ్లో॥ ఆమ్రజంబూత్వచఃక్వాథైర్లేహయేల్లాజసక్తుకం ।
ఆనేనలీఢమాత్రేణగర్భిణీగ్రాహిణీంజయేత్ ॥

తా॥ మామిడిపట్ట నేరేడిపట్ట వీటికషాయమునందు వరిపేలాలపిండివైచి కలిపి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకి గలిగెడి జ్వరాతిసారము మానును.

## ఛర్ద్యతిసార చికిత్స.

శ్లో॥ శుంఠీబిల్వకషాయంతు యవసక్తుసమన్వితం ।

గర్భిణీంపాయయేద్దివ్యచ్ఛర్ధి ర్గతీసారనాశనం॥

తా॥ శొంఠి బిల పండు వీటిని కషాయము పెట్టి అందు యవపేలపిండిచేర్చి కలిపి పుచ్చుకొనిన గర్భిణిస్త్రీకి గలిగెడి ఛర్ద్యతిసారము మానును.

కాసశ్వాస చికిత్స.

శ్లో॥ పృశ్నిపర్ణీబలావాసానిర్యూహోరక్తపిత్తజిత్ ।
గర్భిణ్యాఃకామిలాశోథకాసశ్వాసజ్వరాపహాః ॥

తా॥ కోలపొన్న చిట్టాముట్టి అడ్డసరము వీటిరసమును గర్భిణీస్త్రీ పానముజేసిన రక్తపిత్తము కామిల శోఫ కాసశ్వాస జ్వరము ఇవి మానును.

గర్భిణీస్త్రీకి వమనచికిత్స.

శ్లో॥ కుస్తుంబరీణాంకల్కంతుతండులోదకసంయుతం।
పిబేత్సశర్కరంహృద్యంగర్భిణీచ్ఛర్దినాశనం॥

తా॥ ధనియాలను బియ్యముకడిగిన నీటియందునూరి కల్కముజేసి వాటిలో శర్కరవేసి గర్భిణీస్త్రీ పానముజేసిన ఛర్దిరోగము నివర్తించు.

శ్వాసకాస చికిత్స.

శ్లో॥ బిల్వమజ్జాచలాజాంబుబిబేచ్ఛర్దిషుగర్భిణీ ।
భార్జీశుంఠీకణాచూర్ణంగుడేనశ్వాసకాసజిత్ ॥

తా॥ బిల్వపండుయొక్కగిజరు వరిపేలాలు వీటిని నీటిలోవేసి పిసికి భక్షించినను లేక గంటుభారంగి శొంఠి పిప్పళ్లు వీట్లను చూర్ణముచేసి బెల్లమువేసి పిసికి పుచ్చుకొనినను గర్భిణీస్త్రీలకుగలిగెడి శ్వాసకాస నివర్తియగు.

గర్భిణీవాత చికిత్స.

శ్లో॥ బిల్వాగ్నిమంథపక్వంవాపాటల్యానాగరేణవా ।
సిద్ధమంబుపిబేచ్ఛీతంగర్భిణీవాతరోగనుత్ ॥

తా॥ బిల్వపండు కూరవెల్లి లేక పాదిరిపట్ట శొంఠి ఈరెంటిలో దేనినైనను కషాయముపెట్టి చల్లారినపిదప పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకిగల వాతరోగము నశించు.

## గర్భిణీస్త్రీకిగలిగెడి వాపులకు చికిత్స.

శ్లో॥ చందనంమధుకోశీరనాగపుష్పంతిలాస్తథా।
అజశృంగీచమంజిష్ఠాశారివామూలంపునర్నవా।
శ్రేష్ఠఃశోథహరోలేపోగర్భిణీనాంవిశేషతః॥

తా॥ చందనము యష్టిమధుకము వట్టివేళ్లు నాగకేసరములు నువ్వులు బొద్దిపట్ట మంజిష్ట జల్లేడువేరు గలిజేరువేరు వీటినినూరి లేపనముచేసిన గర్భిణీస్త్రీకి శరీరమునందుండెడి వాపులు మానును.

## రెండవ చికిత్స.

శ్లో॥ శ్వేతకృష్ణజీరకటుకీపితత్కషాయోగుర్వ్యాశ్శోథహృత్॥

తా॥ నల్లజీలకఱ్ఱ తెల్లజీలకఱ్ఱ కటుకరోహిణి వీట్లను కషాయము పెట్టి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకిగల వాపులు మానును.

## గర్భవిలాస రసము.

శ్లో॥ రసశ్చగంధకంతుత్థంత్ర్యహంజంబీరమర్దితం।
త్రిర్భావితంత్రికటుకాదేయంగుంజాచతుష్టయం।
గర్భిణ్యాశ్శూలవిష్టంభజ్వరాజీర్ణేషుకేవలం॥

తా॥ శుద్ధపాదరసము గంధకము మైలుతుత్తము వీటిని ఖల్వమునందువేసి నిమ్మపండ్లరసముచే 3 దినములునూరి పిదప శొంఠి పిప్పలి మిరియాలు వీటి కషాయములో 3 దినములు భావనచేసి పిదప వాటిని 4 గురిగింజలయెత్తువంతున మాత్రలుచేసి గర్భిణీస్త్రీ పుచ్చుకొనిన శూలలు మల స్తంభము జ్వరము అజీర్ణము ఇవి మానును.

## గర్భిణీస్త్రీకి అగ్నిదీపనౌషధము.

శ్లో॥ అజామోదంనాగరంచపిప్పలీజీరకంసమం।
తచ్చూర్ణంసగుడంక్షౌద్రంగర్భిణ్యావహ్నిదీపనం॥

తా॥ ఓమము శొంఠి పిప్పళ్లు జీలకఱ్ఱ వీటిని సమభాగములుగ చూర్ణముచేసి తేనె బెల్లముకలిపి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకి అగ్నిదీపనము గలుగును.

## గర్భశూల చికిత్స.

శ్లో॥ స్నిగ్ధశ్శీతాః క్రియాస్తేషుదాహాదిషుసమాచరేత్ ।
కుశకాశోరుబూకానాంమూలైర్గోక్షురకస్యచ ।
శృతందుగ్ధంసితాయుక్తంగర్భిణ్యాశ్శూలహృత్పరం ॥

తా॥ గర్భిణీస్త్రీకి దాహము జనించెనేని కోమలమైన శీతోపచారములు జేయవలయు. కుశ కాశ ఆముదపువేరు పెద్దపల్లేరు వీటియొక్క వేళ్ళను పాలలోవేసికాచి అందు శర్కరవేసి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకి శూల మానును.

## గర్భవేదనా చికిత్స.

శ్లో॥ శ్వదంష్ట్రామధుకంద్రాక్షామ్లానైస్సిద్ధంపయఃపిబేత్ ।
శర్కరామధుసంయుక్తంగర్భిణీవేదనాపహం॥

తా॥ పెద్దపల్లేరు అతిమధురము ద్రాక్ష వీటిని పాలతోనూరి శర్కర తేనెవేసి పుచ్చుకొనిన గర్భవేదన మానును.

## ఆనాహవాయు చికిత్స.

శ్లో॥ పక్వంవచాలశూనాభ్యాంహింగుసౌవర్చలాన్వితం ।
అనాహేషుపిబేద్దుగ్ధంగుర్విణీసుఖినీభవేత్ ॥

తా॥ వస వెల్లుల్లి వీటిని పాలలోవైచి కాచి అందు వేల్చినయింగువ సౌవర్చలవణము వీటిని చూర్ణముచేసి కలిపి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకి గలిగెడి ఆనాహవాయువు మానును.

## గర్భిణీస్త్రీకి మూత్రావరోధ చికిత్స.

శ్లో॥ తృణపంచకమూలానాంకల్కేనవిపచేత్పయః ।
తత్పయోగుర్విణీపీత్వామూత్రసంగాద్విముచ్యతే॥

తా॥ తృణపంచమూలమునునూరి కల్కముచేసి పాలలోవైచికాచి గర్భిణీస్త్రీ పానముజేసెనేని మూత్రావరోధమునుమాని సుఖమునుజెందు.

## తృణపంచ మూలము.

శ్లో॥ శాలీక్షుకుశకాశైశ్చశరేణతృణపంచకం ।

ఏషాంమూలంతృషాదాహపిత్తాస్రృక్ మూత్రసంగహృత్॥

తా॥ (తృణపంచమూలమనగా) వరి చెరుకు కుశ కాశ శరతృణ వీటిమూలంబులు ఇవి తాపము రక్తపిత్తము మూత్రబంధము వీటినిబోగొట్టు.

## అతిసార చికిత్స.

శ్లో॥ కసేరుశ్శృంగాటకపద్మకోత్పలం। సముద్గపర్ణీమధుకంసశర్కరం।
సశూలగర్భాసృతిపీడితాబలా పయోవిమిశ్రంపయసాన్నభుక్పి
బేత్॥

తా॥ కచోరములు శింగాడికాయలు తామరతూండ్లు నల్లకలువలు పిల్లపీచర యష్టిమధుకము వీట్లను కషాయముపెట్టి అందు పాలు శర్కరవేసిపుచ్చుకొని పాలు అన్నముభుజించిన గర్భిణీస్త్రీకిగల శూల అతిసారము ఇవి మానును.

## గర్భిణీస్త్రీకి శూలశమన చికిత్స.

శ్లో॥ నీలోత్పలంసవాలంచ శృంగాటంచకసేరుకం।
శీతతోయేనపిష్ట్వాతుక్షీరేణాలోడ్యతత్పిబేత్।
ఏవంసపతతేగర్భఃసచశూలఃప్రశామ్యతి॥

తా॥ నల్లకలువపూలు వట్టివేరు శింగాడికాయలు కచోరములు వీట్లను శీతోదకముతోనూరి పాలలోకలిపి పుచ్చుకొనిన స్త్రీకి గర్భము స్థైర్యమునుజెంది గర్భశూల నివర్తించును.

## గర్భిణీస్త్రీకి ప్రథమమాసగర్భచలన చికిత్స.

శ్లో॥ చలనంప్రథమేమాసిగర్భస్యయదిజాయతే। ఔషధంచతథాపే
యంవిచక్షణభిషగ్వరైః। మృదికాజ్యేష్ఠికాచైవచందనంరక్త
చందనం। గవాంచపయసాపేయంస్థిరతాజాయతేధృవం॥

తా॥ ప్రథమమాసమునందు గర్భచలనముగలిగినేని ద్రాక్ష యష్టిమధుకము చందనము రక్తచందనము వీట్లనునూరి ఆవుపాలలోకలిపి పుచ్చుకొనిన గర్భము స్థైర్యమును జెందు.

## ద్వితీయమాస చికిత్స.

శ్లో॥ ద్వితీయేమాసిగర్భస్యచలనంచభవేద్యది ।
పయసాచతతాపేయంమృణాలంనాగకేసరం ॥
వేదనాయాం ॥ తగరంకమలంబిల్వంకర్పూరేణసమన్వితం ।
అజాక్షీరేణతత్పిష్ట్వాక్షీరేణాలోడ్యపూర్వవత్ ॥

తా॥ 2 వ మాసమునందు గర్భము చలించెనేని తామరతూండ్లు నాగకేసరములు వీటిని శీతోదకముతో నూరి పాలలో కలిపి పుచ్చుకొనిన గర్భము స్థిరత్వమును జెందు. మఱియు గ్రంథితగరము తామరపూలు బిల్వపండు పచ్చకర్పూరము వీటిని మేకపాలతో నూరి మఱియు నాపాలలో కలిపి పుచ్చుకొనిన శూలవేదన కలిగియుండిననదియును మానును.

## తృతీయమాస చికిత్స.

శ్లో॥ తృతీయేమాసిచలనంజాయతేగర్భజంయది। పయసాలోడితం పేయశర్కరానాగకేసరం ॥ వేదనాయాం ॥ పద్మకంచందనం చైవవాలకంపద్మనాళకం। పిష్ట్వాశీతేనతోయేనక్షీరేణాలోడ్య తత్పిబేత్ । ఏవంనపతతేగర్భఃసచశూలఃప్రశామ్యతి ॥

తా॥ 3వమాసమునందు గర్భచలనముగలిగెనేని నాగకేసరములను పాలతో నూరి మఱియు నాపాలలో కలిపి శర్కరచేర్చి పుచ్చుకొనిన గర్భము స్థైర్యమును జెందు. లేక తామరతూండ్లు చందనము వట్టివేరు తామరపూలు వీట్లను శీతోదకముతో నూరి ఆవుపాలలో కలిపి పుచ్చుకొనినను గర్భపతనము కలగక స్థిరత్వము జెందుటయేగాక గర్భశూలయును శాంతిని జెందు.

## చతుర్థమాస చికిత్స.

శ్లో॥ యదిగర్భస్యచలనంచతుర్థేమాసిజాయతే । తృష్ణాశూలవిదాహైశ్చజ్వరేణచనిపీడనం।క్షీరంచకదళీమూలంఉత్పలంవాలకం తథా । ఆలోఢ్యసమభాగేనపిబేద్రోగోపశాంతయే ॥

తా॥ 4వ మాసమునందు గర్భచలనమువలన దప్పి శూల తాపము జ్వరము ఇవి కలిగెనేని అరటిగడ్డ నల్లకలువ వట్టివేరు వీటిని సమభాగములుగ పాలలోనూరి పానము జేసిన గర్భముస్థిరమును జెందుటయేగాక జ్వరాదులు నగా మానును.

పఞ్చమమాస చికిత్స.

శ్లో॥ పఞ్చమేమాసిగర్భస్యచలనంకుత్రచిద్భవేత్ । దధ్నాచమధునా
పేయందాడిమీపత్రచందనం । నీలోత్పలంమృణాలంచకాకోళీక్షీ
రంతథైవచ। కేసరంపద్మకంచైవతోయేనాలోడ్యతత్పిబేత్ ।ఏ
వంనపతతేగర్భఃసచశూలఃప్రశామ్యతి ॥

తా॥ 5వ మాసమునందు గర్భచలనము శూల ఇవి కలిగెనేని దాళింబచిగురు చందనము వీటినినూరి పెరుగులోకలిపి తేనెచేర్చి పుచ్చుకొనినను లేక నల్లకలువలు తామరతూండ్లు రేగుఆకులు నాగకేసరములు వీట్లను శీతోదకముతోనూరి పాలలోకలిపి పుచ్చుకొనినను గర్భచలనము కలగకపోవుటయేగాక గర్భశూలలు నగానివర్తించు.

షష్ఠమాస చికిత్స.

శ్లో॥ షష్ఠేమాసేతుగర్భస్య చలతాజాయతేయదా । గైరికంకోమ
యంభస్మకృష్ణామృత్సాచతథైవచ। ఏతేషాంసాధితంప్రాజ్ఞభి
షజాచశ్శృతంతదా। పేయంశీతంచపయసాసితయాచందనేసచ॥

తా॥ 6 వ మాసమునందు గర్భముచలించెనేని కావిరాయి ఆవుపేడయొక్క భస్మము కృష్ణరేగడ వీట్లను కషాయముపెట్టి చల్లారిన పిదప పాలు చందనము శర్కర వీటినిజేర్చి కలిపి పుచ్చుకొనిన గర్భముచలించదు.

సప్తమమాస చికిత్స.

శ్లో॥ సప్తమేమాసిగర్భస్యచలనంజాయతేయదా ।
పుశీరగోక్షురఘనాసమంగానాగకేసరం ।
సపద్మకంసమధురం పాయయేచ్ఛవిచక్షణః ॥

తా॥ 7 వ మాసమునందు గర్భము చలనముగలిగెనేని వట్టివేరు యేనుగపల్లేరు తుంగగడ్డలు మంజిష్ట నాగకేసరములు తామరతూండ్లు వీటిని కషాయముపెట్టి శర్కర వేసి పుచ్చుకొనిన గర్భము స్థిరముగనుండు.

అష్టమమాస చికిత్స.

శ్లో॥ అష్టమేమాసిగర్భస్యచలనంజాయతేయదా ।
లోధ్రిమాగంధికాచూర్ణంమధునాపయసాపిబేత్ ॥

తా॥ 8వ మాసమునందు గర్భచలనముగలిగెనేని లొద్దుగచెక్క పిప్పళ్లు వీటిని చూర్ణముచేసి తేనెవేసి కలిపి పుచ్చుకొనిన గర్భము స్థైర్యమును జెందు.

## నవమమాస చికిత్స.

శ్లో॥ నవమేసుప్రసూతిస్స్యాదేవంగర్భస్యపోషణే ॥

తా॥ ప్రథమమాసము మొదలుగర్భచలనాదులయందు పైజెప్పంబడిన చికిత్సలు చేసిన 9వ మాసమునందు సుఖప్రసవమగునుగాన యీరీతిగ గర్భపోషణ చేయవలయు.

## గర్భపతనమునకు కారణము.

శ్లో॥ భయాభిఘాతతీక్ష్ణోష్ణపానాశననిషేవణాత్ ।
గర్భేపతతిరక్తస్యసశూలందర్శనంభవేత్ ॥

తా॥ భయము తాడనాదులచే నభిఘాతము తీక్ష్ణము ఉష్ణము అగునట్టి జలపానము అన భక్షణము వీటివలన గర్భము పతనమగు. అట్టికాలమున శూలతోగూడిన రజోదర్శనమగును. గాన గర్భిణీస్త్రీ భయాభిఘాతాదుల వర్జించవలయు.

## స్రావము పాతములు.

శ్లో॥ ఆచతుర్థాత్తతోమాసాత్ప్రస్రవేద్గర్భవిద్రతః ।
తతఃస్థిరశరీరస్యపాతఃపంచమషష్ఠయోః ॥

తా॥ ప్రథమమాసము మొదలు 4వ మాసమువరకు గర్భము పతనమయ్యెనేని అది యత్యంతద్రవముగనుండుటవలన స్రావమనంబడు. మఱియు 5 6వ మాసముల యందు దేహాకారము కలుగుచుండగా గర్భము పతనమయ్యెనేని నది పాతమనంబడు.

## గర్భిణీస్త్రీ అభిఘాతాదుల వర్జించుట.

శ్లో॥ గర్భాభిఘాతవిషమాసన పీడనాద్యైః పక్వంద్రుమాదివ ఫలం పతతిక్షణేన ॥

తా॥ అభిఘాతము విషమముగ ఆసనాదులయందు కూర్చుండుట వ్యథ ఇట్టికారణములచే పండినపండు చెట్టునుండి పడునట్టిచందంబున గర్భము పతనమును జెందుగాన గర్భిణీస్త్రీ గర్భసంరక్షణార్థమై అభిఘాతాదులను వర్జింపవలయు.

## గర్భపాతమునందు గలిగెడి ఉపద్రవములు.

శ్లో॥ ప్రస్రంసమానేగర్భేస్యాద్దాహశ్శూలశ్చపార్శ్వయోః ।
పృష్టరుగ్ప్రదరానాహోమూత్రబంధశ్చజాయతే ॥

తా॥ గర్భపాతమునందు దాహము పార్శ్వము పృష్ఠము నడుము వీటియందు శూల ప్రదరము ఆనాహవాతము మూత్రబద్ధము ఇవి గలిగియుండు.

## స్థానాంతర గర్భోపద్రవములు.

శ్లో॥ స్థానాత్స్థానాంతరేతస్మిన్ప్రయాత్యపిచజాయతే ।
ఆమపక్వాశయాదౌతుక్షోభఃపూర్వాశ్చాప్యుపద్రవాః ॥

తా॥ గర్భము స్వస్థానమువిడిచి స్థానాంతరమునకు బోయెనేని ఆమపక్వాశయాదులయందు వేదనగలుగుటయాగాక పైనజెప్పంబడిన దాహాద్యుపద్రవములును సగా జనించు.

## స్రావపాతములయందు మాసక్రమముగ పన్నెంపు.

## మాసములవరకు చికిత్స.

శ్లో॥ మధుకంశాకబీజంచపయస్యాసురదారుచ । అశ్మంతకఃకృష్ణతి
లాస్తామ్రవల్లీశతావరీ । వృక్షాదనీపయస్యాచలతాచోత్పలసా
రివా। అనంతాసారివారాస్నాపద్మామధుకమేవచ। బృహతీద్వ
యకాశ్మర్యక్షీరీశృంగాంస్త్వచోఘృతం। పృశ్నిపర్ణీబలాశిగ్రు
శ్వదంష్ట్రామధుపర్ణికా । శృంగాటకంబిసంద్రాక్షాకసేరుమధు
కంసితా॥ సప్తైతాన్యయశాయోగానర్ధశ్లోకసమాపనాత్ । క్ర
మాత్సప్తసుమాసేషుగర్భస్రావేవియోజయేత్ ।యేతాఔష
ధయకార్షమితాశ్శితంశోయేనసంపిష్ట్వపలమితేనదుగ్ధేనాలోడి
తాఃపాతవ్యాః ॥

తా॥ ప్రథమమాసము మొదలు సప్తమమాసమువరకు స్త్రీలకు గర్భస్రావ పాతములు గలిగెనేని క్రమముగ ప్రథమమాసమునందు యష్టిమధుకము శాకబీజము క్షీరకాకోళి దేవదారు.

2 వ మాసమునందు అశ్మంతక నల్లనువ్వులు తామ్రవల్లీ పిల్లపీచర

3 వ మాసమునందు ముయ్యాకుపొన్న క్షీరకాకోళీ నల్లకలువ సుగంధపాల

4 వ మాసమునందు తీటకసింద నల్లసుగంధపాల సన్నరాష్ట్రము తామరపూలు యష్టిమధుకము

5 వ మాసమునందు పెద్దవాకుడు చిన్నవాకుడు గుమ్మడు క్షీరకాకోలి నేల గుమ్మడు లవంగపత్రి నెయ్యి

6 వ మాసమునందు కోలపొన్న చిట్టాముట్టిమునగపట్ట యేనుగపల్లేరు గుమ్మడు

7 వ మాసమునందు శింగాడికాయలు తామరగడ్డ ద్రాక్షపండు తుంగముస్తెలు యష్టిమధుకము శర్కర వీట్లను ఆయానెలలకు క్రమముగ నొకటొకటి కర్షప్రమాణముచేర్చి శీతోదకముతోనూరి 4 తులముల పాలలోకలిపి పుచ్చుకొనిన గర్భశూలాదులు నివర్తించును.

శ్లో॥ కపిత్థబిల్వబృహతీపటోలేక్షునిదగ్ధికైః ।
మూలైశ్శృతంప్రయుంజీతక్షీరంమాసేతిథాష్టమే ॥

తా॥ 8 వ మాసమునందు వెలగబిల్వమువాకుడు చేతిపొట్ల చెరకు పెద్దములక వీటివేళ్ళను పాలయందువైచి పాలతోసమముగ ఉదకమునేసి పాలుమిగులునట్లుకాచి స్త్రీపుచ్చుకొనిన శూలాదులు మానును.

శ్లో॥ నవమేమధుకానంతాపయస్యాసారివాపిబేత్ ॥

తా॥ 9 వ మాసమునందు యష్టిమధుకము దూలగొండివేరు కాకోళి సుగంధపాల వీటిని పాలలోవైచి కాచి స్త్రీపుచ్చుకొనిన గర్భశూలాదులు మానును.

శ్లో॥ క్షీరంశుంఠీపయస్యాభ్యాంసిద్ధంస్యాత్ దశమేహితం ।
సక్షీరావిహితాశుంఠీమధుకంసురదారుచ ॥

తా॥ 10 వ మాసమునందుశొంఠి క్షీరకాకోళీ వీట్లను పాలలోవైచి కషాయము కాచి పుచ్చుకొనినను లేక శొంఠి యష్టిమధుకము దేవదారు వీట్లను కషాయముకాచి పుచ్చుకొనినను గర్భిణీశూలలు మానును.

శ్లో॥ క్షీరికాముత్పలంముగ్ధంసమంగామూలకంశివా ।
పిబేదేకాదశేమాసిగర్భిణీశూలశాంతయే ॥

తా॥ 11వ మాసమునందు తవక్షీరి నల్లకలువలు మంజిష్ఠవునిరికవోలుపు కరక్కాయవోలుపు వీట్లను పాలలోవేసి కషాయముకాచి పుచ్చుకొనిన గర్భశూలలు మానును.

శ్లో॥ సితావిదారికాకాకోళీక్షీరీచైవమృణాళికా ।
గర్భిణీద్వాదశేమాసిపిబేచ్ఛూలఘ్నమౌషధం ।
ఏవమాప్యాయతేగర్భ స్తీవ్రరుక్చోపశామ్యతి ॥

తా॥ 12 వ మాసమునందు తెల్లగువ్వకుమేరు తేలగొండి క్షీరకాకోళి తామర గడ్డలు వీట్లను కషాయము పెట్టి పుచ్చుకొనిన గర్భిణీస్త్రీకి 12 వ మాసమునందు కలిగెడి గర్భశూలలు మొదలగునవి శాన్తిని జెందుటయేగాక గర్భము పుష్టినిజెందు.

## గర్భకోశమువలనకలిగెడి రక్తస్రావచికిత్స.

శ్లో॥ గుర్విణ్యాగర్భతోరక్తంస్రవేద్యదిముహుర్ముహుః ।
తన్నిరోధాయసాదుగ్ధముత్పలాదిశృతంపిబేత్ ॥

తా॥ గర్భిణీస్త్రీలకు జరాయువువలన పలుమారు రక్తముస్రవించెనేని ఉత్పలాది గణములోపరించిన ఔషధద్రవ్యముల పాలలోవేసి కాచి పుచ్చుకొనిన రక్తస్రావము మానును.

## ఉత్పలాదిగణము.

శ్లో॥ ఉత్పలంనీలమారక్తంకల్హారంకుముదంతథా ।
శ్వేతాంభోజంచమధుకం ఉత్పలాదిరయంగణః ।
సంశీలితోహరత్యేవదాహంతృష్ణాంహృదామయ ।
రక్తపిత్తంచమూర్ఛాంచ తథాఛర్దిమరోచకం ॥

తా॥ యెఱ్ఱకలువ నల్లకలువ కొంచము యెరుపును వాసనయునుగల కలువ తెల్ల కలువ తెల్లదామర వీటిపూలు యష్టిమధుకము (ఇది వుత్పలాదిగణము) వీట్లను పాల లోవైచి కాచి పుచ్చుకొనిన దాహము తాపము కడుపునొప్పి రక్తపిత్తము మూర్ఛ వాంతి అరోచకము ఇవియన్నియు శాంతినిజెందు.

## గర్భపాతమునకై చికిత్స.

శ్లో॥ లజ్జాలుధాతకీపుష్ప ముత్పలంమధులోధ్రకం ।
జలస్థయాస్త్రియాపీతంగర్భపాతంనివారయేత్ ॥

తా॥ అంతరదామర ఆరెపువ్వు నల్లకలువ యష్టిమధుకము లొద్దుగచెక్క వీటిని కషాయముపెట్టి స్త్రీని రొమ్ములలోతునీళ్లలో కూర్చుండబెట్టి పైకషాయమును తాగించిన గర్భపాతము నివర్తించు.

రెండవ చికిత్స.

శ్లో॥ పతతం స్తంభయేద్గర్భం కులాలకరమృత్తికా ।
మధుఛాగీపయఃపీతాకింవా శ్వేతాపరాజితా ॥

తా॥ అకాలమునందు స్త్రీలగర్భము అభిఘాతాదులచే పతనాభిముఖమయ్యెనేని మేకపాలయందు కుమ్మరవానిచేతిమన్ను వేసికాచి తేనెవైచి పుచ్చుకొనిన లేక తెల్లనేలగుమ్మడు మేకపాలలోవైచి కాచిగాని పుచ్చుకొనిన పతనమగునట్టి గర్భము స్థిరమునుజెందు.

మూడవ చికిత్స.

శ్లో॥ శర్కరాబిసతిలంసమాంశకం మాక్షికేనసహభక్ష్యతేయదా ।
నాస్తిగర్భపతనోద్భవంభయంపాపశాంతిరివతీర్థసేవయా ॥

తా॥ గర్భిణీస్త్రీలకు గర్భపాతశంకగలిగెనేని తామరగడ్డలు నువ్వులు వీటిని సమభాగములుగనూరి శర్కర తేనెవైచి పుచ్చుకొనిన గర్భపాతమువలన కలిగెడి భయము తీర్థసేవచే పాపముతొలగుచందంబున నివర్తించు.

నాలవ చికిత్స.

శ్లో॥ కంకతీమూలమాబద్ధంకుమారీసూత్రకైస్సమైః ।
కటిదేశేనితంబిన్యాగర్భపాతంనివారయేత్ ॥

తా॥ గర్భిణీస్త్రీలకు గర్భపాతశంకగలిగెనేని అడవిప్రత్తివేరును వివాహము కానికన్యకచే వడకబడిన సూత్రముతో బంధించి కటిప్రదేశమునందు ఆకన్యకచేతితోనే గర్భిణీస్త్రీకి రక్షకట్టించిన ఆశంక మానును.

గర్భిణీరక్తపాత చికిత్స.

శ్లో॥ పారావతమలంపీతం త్ర్యహంతాంబూలవారిణా ।
గర్భిణ్యాగర్భజంరక్తం స్తంభయేన్నిరుపద్రవం ॥

తా॥ గర్భిణీస్త్రీలకు రక్తస్రావము గలిగెనేని పావురాయిమలములో తమల పాకురసముబోసి నూరి 3 దినములు పుచ్చుకొనిన రక్తస్రావము మానును.

### గర్భచలన నివారణ చికిత్స.

శ్లో॥ హ్రీబేరాతివిషాముస్తామోచశక్రైశ్శృతంజలం ।
తదార్యద్గర్భేప్రచలితేప్రదరేకుక్షిరుజ్యపి ॥

తా॥ వట్టివేళ్లు అతివస తుంగముస్తలు బూరుగపట్ట కొడిశపాలవిత్తులు వీటిని కషాయముపెట్టి గర్భిణీస్త్రీలు పుచ్చుకొనిన గర్భచలనము ప్రదరము కడుపుశూలలు ఇవి మానును.

### మూఢగర్భ నిదానము.

శ్లో॥ మూఢఃకరోతిపవనఃఖలుమూఢగర్భం శూలంచయోనిజఠరా
దిషుమూత్రసంగం ॥

తా॥ కుంఠితగతిగలవాయువు గర్భమును వారచేసి యోని కడుపు వీట్లయందు శూల గలుగంజేయుటయేగాక మూత్రావరోధమును సగా గలుగంజేయు.

### మూఢగర్భము యెనిమిది విధములు.

శ్లో॥ భుగ్నోనిలేన విగుణేన తతస్సగర్భః సంఖ్యామతీత్య బహుధా
సముపైత్రియోనిం । ద్వారంనిరుధ్యశిరసాజఠరేణకశ్చిత్ కశ్చి
చ్ఛరీర పరివర్తితకుబ్జదేహః । ఏకేనకశ్చిదపరస్తు భుజద్వయేన
తిర్యగ్గతోభవతి కశ్చిదవాఙ్ముఖోస్యః । పార్శ్వాపవృత్తగతి
రేతిత్తథైవ కశ్చిదిత్యష్టధాగతిరియం హిపరాచతుర్ధా । సంకీ
లకఃప్రతిముఖఃపరిఘోథబీజస్తేషూర్ధ్వబాహుచరణైశ్శిరసాచ
యోనిం । సంగీచయోభవతి కీలకవత్సకీలోదృశ్యైః ఖురైః
ప్రతిఖురః సహికాయసంగీ । గచ్ఛేద్భుజద్వయ శిరాస్సచబీజ
కాఖ్యో యోనౌస్థితః సపరిఘః పరిఘేనతుల్యః ॥

తా॥ గర్భిణీస్త్రీలకు గర్భస్థమైన శిశువు దోషయుక్తమగు వాయువుచే భుగ్నమై సంఖ్యాతీతమగు అనేకవిధములుగా యోనిద్వారమును పొందుచున్నది. వాటిలో ముఖ్యముగ 8 విధంబులు వివరించెద. వాటిలోనొకటి శిరస్సుచే యోనిద్వారము స

గించు. మఱియు వుదరముచే నొకటి యోనిద్వారము నడ్డగించు. మఱియు నొకటి శరీరముయొక్క పరివర్తనముచే సంకుచితమైన దేహముకలదై యోనిద్వారమునడ్డగించు. మఱియు నొకటి 1 భుజముచే లేక 2 భుజములచేగాని నడ్డపడి యోనిద్వారము నడ్డగించు. మఱియు నొకటి అథోముఖంబై యోనిద్వారము నడ్డగించు. మఱియు నొకటి కుడి యెడమ వీటిపార్శ్వములచే అపవృత్తమైన గతిగలదై యోనిద్వారమును పొందుచున్నది. మఱియు నొకటి గర్భస్థమైన శిశువు యోనిని నడ్డగించు విధంబులు సంకీలకమని ప్రతిఖురమని పరిఘుని బీజమని 4 విధములుగ నుండు. ఊర్ధ్వబాహువులు పాదములు శిరస్సు వీట్లచే యోనిద్వారమును గూటమువలె నడ్డగించునది సంకీలకమనియు అశ్వాదులయొక్క గొరిశలువలె అడ్డగించునది ప్రతిఖురమనియు తలుపుగడియవలె నడ్డగించునది పరిఘయనియు. 2 భుజములు శిరస్సు వీట్లచే అడ్డగించునది బీజమనియు బరంగు.

## అసాధ్యమూఢగర్భము.

శ్లో॥ అపవిద్ధాశిరాయాతుశీతాంగీనిరపత్రపా ।
నీలోద్ధతశిరాహంతిసాగర్భంసచతాంతథా ॥

తా॥ గర్భిణీస్త్రీకి మెడనిలవకను శరీరము చల్లగను ప్రజ్ఞ తెలియకను ప్రక్కలయందు శిరలు నీలవర్ణముగనుండునో అట్టి గర్భిణీస్త్రీ ఆ గర్భపిండమును ఆ గర్భపిండము ఆ గర్భిణీస్త్రీని అన్యోన్యముగ నొకరి కొకరు నశింపంజేసికొనుదురు.

## గర్భమరణహేతువు.

శ్లో॥ మానసా గంతుభిర్మాతు రుపతాపైః ప్రపీడితః ।
గర్భోవ్యాపద్యతే కుక్షౌ వ్యాధిభిశ్చ ప్రపీడితః ॥

తా॥ గర్భిణీస్త్రీయొక్క మానసిక ఆగంతుక ఉపతాపములచే లేక వ్యాధులచే పీడింపబడిన గర్భము కుక్షియందే మృతినొందు.

## గర్భిణికి రెండవ అసాధ్యలక్షణము.

శ్లో॥ యోనిసంవరణంసంగః కుక్షౌమక్కల్లఏవచ ।
హన్యుఃస్త్రియంమూఢగర్భోయథోక్తాశ్చాప్యుపద్రవాః ॥

తా॥ వాతదోషమువలన యోనిసంకోచము జెందిన సంగము మక్కల్లశూల మూఢగర్భము ఇత్యాది వుపద్రవములు గలిగెనేని గర్భస్త్రీ మరణమును జెందును.

## పరిఘగర్భ లక్షణము.

శ్లో॥ యోనిమావృత్యయస్తిష్ఠేపరిఘోగోపురంయథా ।
తథాంతర్గర్భమాయాంతంవిద్యాత్పరిఘసంజ్ఞితం ॥

తా॥ ప్రసవకాలమునందు గర్భము గోపురద్వారమున తలుపుగడియవలె నడ్డముగ పిండము తిరిగియుండెనేని నది పరిఘయనంబడు. ఇది అసాధ్యము.

## వికృతాకృతి గర్భ లక్షణము.

శ్లో॥ ఋతుస్నాతాతుయానారీ స్వప్నేమైథునమావహేత్ । ఆర్తవంవాయురాదాయ కుక్షౌగర్భంకరోతిహి । మాసిమాసి వివర్ధేత గర్భిణ్యాగర్భలక్షణం । కలలం జాయతేతస్యా వర్జితం పైతృకైర్గుణైః । సర్పవృశ్చిక కూష్మాండ వికృతా కృతయశ్చయే । గర్భాశ్తే త్రయశ్చైవజ్ఞేయాఃపాపకృతోభృశం॥

తా॥ ఋతుస్నానము జేసిన పిదప స్త్రీ స్వప్నమునందు సంగమము నొనర్చినటుల స్వప్నము గాంచెనేని గర్భోత్పత్తికి కారణమగు. ఆర్తవమును వాయువు గ్రహించి కుక్షియందు గర్భమును గలుగజేయుచున్నది. అపుడు ప్రథమమాసము మొదలు కలలోత్పత్తిక్రమముగ గర్భము వృద్ధిని జెందుచున్నది. మఱియు పిత్తము వలన గలిగెడి వాంతి మొదలగు చిహ్నములు కలుగకపోవుటయగాక గర్భపిండము అస్థికేశములు ఇవి మొదలగు పితృగుణరహితమై తేలు పాము కూష్మాండము ఇవిమొదలగు ఆకృతి గలిగియుండు. ఇటులగలుగుట జన్మాంతర పాపవిశేషమని యెఱుంగవలయు.

## యోనిసంవరణవ్యాధి నిదానము.

శ్లో॥ వాతలాన్యన్నపానాని గ్రామ్యధర్మం ప్రజాగరం । అత్యర్థసేవమానాయగర్భిణ్యాయోనిమార్గజః । మాతరిశ్వా ప్రకుపితో యోనిద్వారస్యసంవృతిం । కురుతేబుద్ధమార్గత్వాత్పునరంతర్గతోనిలః । నిరుణద్ధ్యాశయద్వారం పీడయన్ గర్భసంస్థితిం । నిరుద్ధ వదనోచ్ఛ్వాసో గర్భశ్చాశు విపద్యతే । ఇచ్ఛ్వాసబుద్ధహృదయాం నాశయత్యథ గర్భిణీం । యోని సంవరణంనామ

వ్యాధిమేనం ప్రచక్షతే । అంతక ప్రతిమంఘోరం నారభేత్తు చికిత్సితుం ॥

తా॥ వాతకరమగు అన్నభక్షణము జలపానము మైధునము జాగరణము వీట్లను గర్భిణీ స్త్రీ మిగుల సేవించెనేని యోనిమార్గమునందుండెడి వాయువు ప్రకుపితమై యోనిద్వారమును సంకోచమును జేయుచున్నది. ఇటుల సంకోచము చేయుటచే వాయువు లోపల ప్రవేశించినదై గర్భాశయద్వారమును నడ్డగించి గర్భమును పీడించుచు ఉచ్ఛ్వాస నిశ్వాసములను అడ్డగించుటచే గర్భము నాశమును జెందుటయేగాక ఉచ్ఛ్వాసముచే అడ్డగించబడిన హృదయముకలదై గర్భిణీ స్త్రీయును నాశమును జెందు. గాన వాతలమగు అన్నపానాదుల వర్జించవలయు. ఇదియ యోనిసంవరణమను జాడ్యమని యెరంగు. ఇటుల మృత్యుతుల్యమగు యోనిసంవరణమను వ్యాధికి చికిత్సించుటకు బుద్ధిమంతులు మానుకొనవలయు.

వాతసంకుచితవ్యాధి శమనోపాయము.

శ్లో॥ వాతేనగర్భసంకోచాత్ప్రసూతిసమయేపివా । గర్భంనజనయే న్నారీ తస్యాశ్శృణుచికిత్సితం । కుట్టయేన్ముసలేనైషా కృత్వా ధాన్యముములూఖలే । విషమంచాసనంయానం సేవేతప్రసవార్థినీ ॥

తా॥ వాతదోషముచే గర్భమార్గము ప్రసవసమయమునందు సంకోచమును జెందెనేని స్త్రీ ప్రసవించుటకు అసమర్థురాలగు. అపుడు ఆ గర్భిణీ స్త్రీ రోటియందు ధాన్యమును వైచి రోకలితో దంచినను లేక విషమాసనమునుగాని విషమవాహనమును గాని సేవించినను సుఖప్రసవమగును.

వాతశుష్కగర్భ చికిత్స.

శ్లో॥ గర్భేవాతేనసంశుష్కేనోదరంపూరయేద్యది ।
సాబ్బృంహణైర్మైస్సంసిద్ధందుగ్ధంమాంసరసంపిబేత్ ॥

తా॥ దుష్టమైన వాతముచే గర్భము శోషించి యుదరమును పూరించకపోయెనేని నపుడు గర్భపిండము ఉబ్బునట్టి ద్రవ్యముల పాలలో వైచిగాని లేక మాంసరసమునుగాని పానముజేసిన గర్భము వృద్ధిజెంది యుదరము పూరించు.

## నాగోదరమను గర్భలక్షణము.

శ్లో॥ శుక్రార్తవనుజాతాంగం ప్రత్యంగం మరుతార్దితం । త్యక్తం జీవేనతత్తస్మాత్కాలంచావతిష్ఠతే । శుక్రార్తవార్ద్రికోవాయు రుదధ్మానకృతద్భవేత్ । కదాచిచ్ఛేత్తజాఘ్మానంస్వయమేవో త్పచేత్తరాం । సచాపిగర్భోభవతిలోకేనాగోదరాహ్వయః । ధాన్యకుష్ఠనముఖ్యాస్యాచికిత్సాతూభయోరపి ॥

తా॥ పై జెప్పంబడిన వాతలాన్నపానాదులచే దుష్టమైన శుక్రార్తవార్ద్రిక మను వాయువుచే శుక్రశోణితంబులు దూషితంబులై మాసక్రమముగ వృద్ధిని జెందక నిర్జీవితమయి కలలాకృతిగ నేనుండు. లేక పై జెప్పంబడిన వాయువే కడుపుబ్బరము యొకానొకసమయంబున గలుగంజేయు. దానిచే పై జెప్పంబడిన శుక్లశోణితంబులే వృద్ధిని జెంది యా గర్భమే నాగోదరమని పేర్కొనంబడు. ఇట్టి 2 విధములగు గర్భ మునకు చికిత్స రోకలితో వడ్లుదంచుటయే.

## సుఖ ప్రసవోపాయము.

శ్లో॥ ప్రసవస్య విలంబేతు ధూపయే దభితోభగం ।
కృష్ణసర్పస్యనిర్మోకై స్తథాపిండీతకేనవా ।
తంతునా లాంగలీమూలంబధ్నీయాద్ధస్తపాదయోః ।
సువర్చలాంవిశల్యాంవాధారయేదాశుసూయతే ॥

తా॥ స్త్రీ ప్రసవించుటకు కాలవిలంబమయ్యెనేని నపుడు భగద్వారమునందు కృష్ణసర్పముయొక్క కుసుముగాని లేక గ్రంధితగరముగాని ధూపమువేసినను లేక నీటిపిప్పలిమూలముగాని లేక ఆదిత్యభక్తిఁగాని లేక వెఱ్ఱిపుచ్చవేరుగాని సూత్ర ముతో హస్తపాదములయందు రక్షగట్టినను సుఖప్రసవమగును.

## సుఖప్రసవ చికిత్స.

శ్లో॥ కృష్ణావబాచాపి జలేనపిష్టా సైరండతైలా ఖలునాభిలేపాత్ । సుఖప్రసూతిం కురుతేంగనానాం నిపీడితానాం బహుభిః ప్రమాదైః ॥

తా॥ పిల్పిస్పి వస వీటిని వుదకముతో నూరి ఆముదము వేసి కలిపి స్త్రీయొక్క నాభియందు లేపముజేసిన కేసే వుపద్రవమువలన పీడకలిగియుండినను అదిమాని సుఖ ప్రసవమగును.

రెండవ చికిత్స.

శ్లో॥ మాతులుంగస్యమూలంతుమధూకంసంయుతంతథా ।
ఘృతేనసహితంపీత్వాసుఖంనారీప్రసూయతే ॥

తా॥ మాదీఫలపువేరు యష్టిమధుకము వీటిని చూర్ణముచేసి నేతితో భక్షించిన స్త్రీ సుఖముగ ప్రసవించు.

సుఖప్రసవ రక్ష.

శ్లో॥ ఇక్షోరుత్తరమూలంనిజతనుమానేనతంతునాబధ్వా ।
కటివిషయేగర్భవతీసుఖేనసూతేవిలంబతేనాపి ॥

తా॥ ఉత్తరదిశయందుండెడి చెరకువేరును గర్భిణీ స్త్రీయొక్క ప్రమాణముగల దారముతో వేరునుబంధించి కటిప్రదేశమునందు రక్షకట్టిన త్వరలో సుఖప్రసవమగును.

సుఖప్రసవమునకు రక్ష.

శ్లో॥ తాలస్యచోత్తరంమూలంస్వప్రమాణేనతంతునా ।
బధ్వాకట్యాంతునియతంసుఖంనారీప్రసూతయే ॥

తా॥ ఉత్తరదిశయందుండెడి తాటిచెట్టువేరును స్త్రీప్రమాణము పొడవుగల దారముతో నా వేరునుకట్టి కటిప్రదేశమునందు బంధించిన గర్భిణీస్త్రీ సుఖముగ ప్రసవించు.

రెండవ రక్ష.

శ్లో॥ ప్రత్యక్పుష్ప్యాః పారిభద్రస్యయద్వా మూలం యద్వాకాక
జంఘాసముత్థం । కట్యాంబద్ధం యోషితాం సత్ప్రసూతిం
యోగేయుక్త్యాసంహృతంసాధుకుర్యాత్ ॥

తా॥ వేప లేక బాడిజపు లేక వెలుమసంధి వీటియొక్క వుత్తరదిశయందుండెడు వేరును స్త్రీ ప్రమాణము పొడవుగల దారముతోకట్టి స్త్రీయొక్క కటిప్రదేశమునందు బంధించిన సుఖప్రసవమగును.

## మృతగర్భ చికిత్స.

శ్లో॥ యాభిఃసంకటకాలేవైదైర్నార్యఃప్రసవితాస్సమ్యక్ ।
లబ్ధంయశస్సమగ్రాస్తాయేవాత్రక్రియాఃకుర్యుః ॥

తా॥ ప్రసవకాలమునందు మిగుల సంకటముగనుండెనేని వైద్యులు స్త్రీ ప్రసవించునటుల చికిత్సచేసి యశస్సుపొందే క్రియలు చాయవలయు.

## గర్భోద్ధారణ.

శ్లో॥ హస్తేనసర్పిషాక్తేనయోనేరంతర్గతేనసా ।
మృతేతుగర్భేగర్భిణ్యాయోనౌశస్త్రింప్రవేశయేత్ ।
శస్త్రీశాస్త్రార్థవిదుషాలఘుహస్తాభయోజ్ఝితాః ॥

తా॥ గర్భమునందు శిశువు మృతినొందెనేని అపుడు శస్త్రశాస్త్రార్థమును దెలిసి లఘుహస్తుడైన వైద్యుడు నెయ్యి తన హస్తమునకు పూసికొని గర్భిణీస్త్రీయొక్క యోనియందు శస్త్రమును బ్రవేశింపజేయవలయు.

శ్లో॥ సచేతనంతుశస్త్రేణ నకథంచనదారయేత్ ।
సదార్యమాణోజననీమాత్మానంచాపిమారయేత్ ।
నోపేక్షేతమృతంగర్భంముహూర్తమపిపండితః ।
సదాశుజననీంహంతిప్రభూతాన్నంయథాపశుం ॥

తా॥ గర్భమునందుండెడి శిశువు జీవించియుండెనేని సాహసాదులచే ఖండింపందగదు. అటుల ఖండించెనేని శిశువు మరణము నొందుటయేగాక మాతను సగా మరణము నొందించును. మఱియు మృతమైన గర్భశిశువును బుద్ధిమంతుడు క్షణకాలమునైనను ఉపేక్ష జేయందగదు. అటుల వుపేక్షజేసిన మృతినొందిన శిశువు గురువైన అన్నము జీర్ణముగాక జంతువుల వధించునటులనే మాతను మృతినొందజేయును.

## మృతగర్భచ్ఛేదన ప్రకారము.

శ్లో॥ యద్యదంగంహిగర్భస్యయోనౌసజ్జతితద్భిషక్ ।
సమ్యగ్వినిర్హరేచ్ఛిత్వారక్షన్నారీంప్రయత్నతః ॥

తా॥ మఱియు మృతమైన శిశువుయొక్క యేయే అంగములు యోనిద్వారము

నందు తగులుకొనియున్నచో ఆయాయంగములను జాగరూకుడై ఛేదించి బయిటికి తీసి స్త్రీని రక్షించవలయు.

## ఛేదనానంతర చికిత్స.

శ్లో॥ ఏవంవిహృతశల్యాంతాంసించేదుష్ణేనవారిణా ।
తతోభ్య క్తశరీరాద్యా యోనౌస్నేహంనిధాపయేత్ ।
ఏవంమృద్వీభవేద్యోనిః తచ్ఛూలంచోపశామ్యతి ॥

తా॥ గర్భమునందుండెడి మృతశిశువుయొక్క శల్యములను బయలు వెడలంజేసి పిదప శరీరమునకు చమురుబూసి ఉష్ణోదకముతో సేచనముజేసి యోనిని తైలముతో పూరింపజేయవలయు. ఇటులజేసిన యోని మృదువగుటయేగాక శూలమానును.

## మృతమైన శిశువు బయలువెడలుటకు చికిత్స.

శ్లో॥ అసురీహింగుకృష్ణాంకాంజికేనావలోడితం ।
గర్భాశయేమృతంగర్భంపాతయేత్పానయోగతః ॥

తా॥ గర్భాశయమునందు శిశువు మృతిజెందెనేని నల్లఆవాలు యింగువ వీటిని చూర్ణముచేసి కాంజికమునందునూరి స్త్రీపుచ్చుకొనిన మృతమైన శిశువు బయలువెడలు.

## మూఢగర్భ చికిత్స.

శ్లో॥ పాఠాయాఃశిఫాలేపః మూలకృత్వోథవా ।
నాభిబస్తిభగాద్యేషుమూఢగర్భప్రకర్షణః ॥

తా॥ పాలపాచెట్టుయొక్క వేరునుగాని లేక ముయ్యాకుపొన్న వేరునుగాని ఉదకముతోనూరి పొత్తికడుపు నాభి భగము వీట్లయందు లేపనముజేసిన మూఢగర్భము బయలు వెడలు.

## ప్రసవించినస్త్రీకిమావి పడకపోయినట్లైతె దానివలన కలిగెడి వుపద్రవములు.

శ్లో॥ ప్రసూతాయాసపతితాజఠరాత్తుజరాయది ।
తదానాహరుతేశూలమాధ్మానంవహ్నిమందతాం ॥

తా॥ స్త్రీ ప్రసవించుకాలమునందు ఉదరమువలన జరాయు (అనగా మావి) బయలువెడలకపోయెనేని అది యుదరమునందు శూల ఆధ్మానము అగ్నిమాంద్యము వీట్లను జనింపంజేయు.

వాటికి చికిత్స.

శ్లో॥ కేశవేష్టితయాంగుళ్యాతస్యాఃకరంప్రఘర్షయేత్ ।
నిర్మోకకటుకాలాబుకృతంవై ఘనసర్షపైః ।
చూర్ణితైఃకటుతైలాక్తైర్ధూపయేదభితోభగం ॥

తా॥ కేశములను చేతివ్రేళ్ళకు చుట్టుకొని స్త్రీయొక్క నోటియందు ఘర్షణ చేసిన లేక పాముకుసుము చేదుసొర కుంగముస్తెలు తెల్లఆవాలు వీటిని చూర్ణము చేసి ఆవనూనెలోకలిపి భగమునకు ధూపమువేసిన ఆ జరాయువు బయలువెడలు.

రెండవ చికిత్స.

శ్లో॥ లాంగలీమూలకల్కేనపాణిపాదతలానిహి ।
ప్రలింపేత్సూతికాయోషిదపరాపాతనాయవై ॥

తా॥ నీటిపిప్పలివేళ్లను ఉదకముతోనూరి కల్కముజేసి ప్రసూతి స్త్రీయొక్క పాదములకు హస్తములకు లేపనముజేసిన ఆమావి బయలువెడలు.

మూడవ చికిత్స.

శ్లో॥ హస్తంఛిన్ననఖంస్నిగ్ధంసూతాయోనౌశనైఃక్షిపేత్ ।
అపరాంతేనహస్తేనజనయిత్రీవినిర్హరేత్ ॥

తా॥ హస్తమునందుండు గోళ్ళనుతీసి తైలమునుపూసికొని ప్రసవించిన స్త్రీ యొక్క యోనియందు తిన్నగ ప్రవేశింపజేసి ఆమావిని తీసివేయవలయు.

యోనిగాయమునకు చికిత్స.

శ్లో॥ తుంబీపత్రంతథాలోధ్రంసమభాగంతుపేషయేత్ ।
తేనలేపోభగేకార్యఃశీఘ్రంసాద్యోనిరక్షతా ॥

తా॥ సొరాకు లొద్దుగపట్ట వీటిని ఉదకముచేనూరి యోనికి లేపనముజేసిన ప్రసవకాలమునందు జనించిన గాయములు మానును.

## యోనిసంకుచిత చికిత్స.

శ్లో॥ పలాశోదుంబరఫలంతిలతైలసమన్వితమ్ ।
యోనౌప్రలిప్తంమధునాగాఢీకారకముత్తమం ॥

తా॥ మోదుగవిత్తులు అత్తిపండ్లు వీటినినూరి తిలతైలమునందుకలిపి యోనికి లేపనముజేసిన ప్రసవించిన స్త్రీయొక్క యోని సంకుచిత మగును.

## మక్కల్ల నిదానము.

శ్లో॥ పృథివ్యాంపతితేవత్సేయోనౌపీడనమిష్యతే ।
అప్రవేశోయథావాయోస్తథాసంరక్షణక్రియా ।
వాయుఃప్రకుపితఃకుర్యాత్సంరుధ్యరుధిరంచ్యుతం ।
ప్రసూతాయాహృచ్ఛిరోబస్తిశూలంమక్కల్లసంజ్ఞితం ॥

తా॥ స్త్రీ ప్రసవించిన తక్షణమే యోనిని బాగుగపిసికి ఆయోనియందు బాహ్యవాయువు ప్రవేశించనటుల వస్త్రాదులబంధించి సంరక్షణచేయవలయు. అటుల చేయకపోయేనేని యోనిగతవాయువు ప్రకుపితమై స్రవించునట్టి రజన్సును నిరోధించి స్త్రీలయొక్క హృదయము శిరస్సు పొత్తికడుపు వీటియందు మక్కల్లమను శూలను జనింపంజేయు.

## మక్కల్ల చికిత్స.

శ్లో॥ సంచూర్ణితంయవక్షారంపిబేతోష్ణేనవారిణా ।
సర్పిషావాపిబేన్నారీమక్కల్లస్యనివృత్తయే ॥

తా॥ మక్కల్లవాయువు జనించెనేని యవక్షారమును చూర్ణముచేసి ఉష్ణోదకములోగాని నెయ్యితోగాని పానముజేసిన అది నివర్తించును.

## రెండవ చికిత్స.

శ్లో॥ పిప్పలీపిప్పలీమూలంమరీచంగజపిప్పలీ । నాగరంచిత్రకంచవ్యం
రేణుకైలాజమోదికా । సర్షపోహింగుభార్గీచ పాఠేంద్రయవ
జీరకాః । మహానింబశ్చ మూర్వాచ విషాతిక్తా విడంగకం ।
పిప్పల్యాది గణోహ్యేషః కఫమారుత నాశనః । గుల్మశూల

జ్వరహారో దీపనశ్చామపాచనః । క్వాథమేషాంపిబేన్నారీలవ
ణేనసమన్వితం। మక్కల్లశూలగుల్మఘ్నంకఫానిలహరంపరం॥

తా॥ పిప్పళ్ళు మోడి మిరియాలు ఏనుగపిప్పళ్ళు శొంఠి చిత్రమూలము చవ్యము రేణుకబీజము లవంగపట్ట ఓమము ఆవాలు వేల్చిన ఇంగువ గంటుభారంగి అగళుశొంఠి కొడిశపాలవిత్తులు జీలకఱ్ఱ తురకవేప చాగ అతివస కటుకరోహిణి వాయువిడంగములు ఇవి పిప్పల్యాదిగణము. దీనిని కషాయముజెట్టి వుప్పువైచిపుచ్చుకొనిన కఫరోగము వాతరోగము గుల్మము శూల జ్వరము మక్కల్లశూల ఇవి నివర్తించుటయేగాక అగ్నిదీపనము ఆమపాచనము వీటిని గలుగంజేయు.

మూడవ చికిత్స.

శ్లో॥ త్రికటుకచాతుర్జాతకకుస్తుంబరిచూర్ణసంయుక్తం ।
ఖాదేద్గుడంపురాణంనిత్యంనారీమక్కల్లదళనాయ ॥

తా॥ శొంఠి పిప్పలి మిరియాలు దాల్చిన్ని లవంగపత్రి నాగకేసరములు ఏలకులు ధనియాలు వీటిని చూర్ణముచేసి పాతబెల్లముతో మిశ్రమముజేసి స్త్రీభక్షించిన మక్కల్లశూల నివర్తించు.

నాలవ చికిత్స.

శ్లో॥ హింగుశుద్ధంససర్పిష్కంభుక్తంమక్కల్లశూలనుత్ ॥

తా॥ పొంగించిన యింగువ నేతితోచేర్చి స్త్రీపుచ్చుకొనిన మక్కల్లశూల నివర్తించు.

గర్భిణీస్త్రీకి వర్జావర్జ్యములు.

శ్లో॥ ప్రసూతాయుక్తమాహారంవిహారంచసమాచరేత్ ।
వ్యాయామంమైథునంక్రోధంశీతశేవాంచవర్జయేత్॥

తా॥ ప్రసవించినస్త్రీ పథ్యకరమైన ఆహారము యుక్తవిహారము ఇవి జేయవలయు దూరదేశసంచారము మైథునము కోపము శీతపదార్థము వీటిని సేవించుట వర్జించవలయు.

## మిథ్యాచార వర్జన.

శ్లో॥ మిథ్యాచారాత్సూతికాయాయోవ్యాధిరుపజాయతే ।
సకృచ్ఛ్రసాధ్యోవాసాధ్యోభవేత్తత్పథ్యమాచరేత్ ॥

తా॥ ప్రసవించినస్త్రీ (మిథ్యాచారము) అనగా అపథ్యసేవ వ్యాయామము మైథునము కోపము ఇత్యాదులను జేయుటవలన రోగము జనించెనేని అది కృచ్ఛ్రసాధ్యము లేక అసాధ్యముగ గాని యుండుగాన మిథ్యాచారములను వర్జించవలయు.

## గర్భోత్పత్తి క్రమము.

శ్లో॥ వామనాడ్యాంభవేత్కన్యాదక్షిణేపుత్రనిశ్చయః ।
రక్తాధికేభవేత్కన్యాపుత్రశ్శుక్రాధికేభవేత్ ।
శుక్రశోణితసామ్యేనభవేద్యోసానపుంసకః ॥

తా॥ స్త్రీలయొక్క వామనాడియందు అనగా యెడమప్రక్కయందు శిశువు చలించెనేని ఆశిశువు స్త్రీప్రజయనియు కుడిప్రక్కయందు చలించెనేని అది పురుషప్రజయనియు మఱియును గర్భోత్పత్తికాలమునందు శుక్రశోణితములలో శోణితాధిక్యము కలిగెనేని స్త్రీప్రజయనియు శుక్లాధిక్యము కలిగెనేని పురుషప్రజయనియు సమభాగములుగా కలిగెనేని నపుంసక ప్రజయనియు నెఱుంగవలయు.

## గర్భోత్పత్త్యుపాయము.

శ్లో॥ ఏరండస్యతుబీజానిమాతులుంగస్యచైవహి ।
సర్పిషాపరిపిష్టానిపిబేద్గర్భప్రదానిచ ॥

తా॥ గర్భముకలగకనుండునట్టిస్త్రీ ఆముదపువిత్తులు మాదీఫలపువిత్తులు వీటిని నూరి నేతిలోమిళితముచేసి పుచ్చుకొనిన గర్భముము ధరించు.

శ్లో॥ తిలతైలదుగ్ధఫాణితదధిఘృతమేకత్రపాణినామథితం ।
పీతంసపిప్పలీకంజనయతిపుత్రంపరమంమహిలా ॥

తా॥ గర్భిణీస్త్రీ నువ్వులనూనె ఆవుపాలు శర్కర పెరుగు నెయ్యి వీట్లను నొకపాత్రయందునిచి మిశ్రమముజేసి హస్తముతోమర్దించి పిప్పలి చూర్ణము వేసి పుచ్చుకొనిన స్త్రీకి పురుషప్రజ జనించు.

శ్లో॥ ఏకస్యమాతులుంగస్యబీజానిసకలాన్యపి ।
ఋత్వంతేమగ్ధపిష్టానిపీత్వాపస్నేత్యబలాసుతం ॥

తా॥ స్త్రీ ఋతుస్నానముజేసిన దినమునందు ఒకమాదీఫలముయొక్క విత్తులన్నియు సంపూర్ణముగ పాలతోనూరి పుచ్చుకొనిన పురుషప్రజగలుగు.

శ్లో॥ అశ్వగంధాకషాయేణసిద్ధందుగ్ధంఘృతాన్వితం ।
ఋతుస్నాతాంగనాప్రాతః పీత్వాగర్భందధాతిహి ॥

తా॥ స్త్రీ ఋతుస్నానముజేసిన దినమునందు పెన్నేరుగడ్డను కషాయముపెట్టి అందుపాలువేసి పాలుమిగులునట్లుకాచి ఆపాలలో నెయ్యివేసి పుచ్చుకొనిన గర్భము ను ధరించు.

శ్లో॥ పుష్యోధృతంలక్ష్మణాయామూలందుగ్ధేకన్యయా ।
పిష్టంపీత్వాఋతుస్నాతాగర్భంధత్తేనసంశయః ॥

తా॥ స్త్రీ ఋతుస్నానముచేసిన దినమునందు పుష్యనక్షత్రమున లక్ష్మణయొక్కవేరును తీసుకవచ్చి పాలువేసి పెండ్లికానికన్యపడుచుచే నూరించి పుచ్చుకొనిన గర్భమునుధరించు. ఇందుకు సందేహములేదు.

శ్లో॥ క్షీరేణశ్వేతబృహతీమూలంనాసాపుటేపిబేత్ ।
పుత్రార్థందక్షిణానాసావామయాకన్యకాప్రదా ॥

తా॥ స్త్రీ ఋతుస్నానముజేసిన దినమునందు తెల్లములకవేళ్ళు పాలతోనూరి కుడిముక్కులో పానముజేసిన పురుషప్రజయు లేక యెడమముక్కులో పానముజేసిన స్త్రీ ప్రజయుగలుగు.

## గర్భనివారక క్రియ.

శ్లో॥ పిప్పలివిడంగటంకణసమచూర్ణయాపిబేత్పయసా ।
ఋతుసమయేనహితస్యాగర్భఃసంజాయతేక్వాపి ॥

తా॥ స్త్రీ ఋతుకాలమునందు పిప్పళ్లు వాయువిడంగములు వెలిగారము వీటిని సమముగ చూర్ణముచేసి పాలలోకలిపి పుచ్చుకొనిన యెప్పటికి గర్భము ధరించదు.

రెండవ చికిత్స.

శ్లో॥ ఆరనాళపరిపేషితంత్ర్యహంయాజపాకుసుమ త్రిపుష్పిణీ ।
సత్పురాణగుడముష్టిసేవినీనాదధాతిచహిగర్భమంగనా ॥

తా॥ స్త్రీ ఋతుకాలమునందు దాసానిపువ్వును కూటినీళ్ళతోనూరి మూడు దినములు పానముజేసిన లేక పిడికెడు పాతబెల్లమును భక్షించిన గర్భము ధరించదు.

మూడవ చికిత్స.

శ్లో॥ తైలావిలంసైంధవఖండమాదౌనిధాయరండానిజయోనిమధ్యే।
నరేణసార్ధంరతిమాతనోతియాసానగర్భంలభతేకదాచిత్ ॥

తా॥ గర్భమునందు ఇచ్ఛలేని స్త్రీ సైంధవలవణపుతునుకను నూనెలోతడిపి యోనిమధ్యమునందుంచుకొని పురుషసంపర్కముజేసిన గర్భముధరించదు.

నాలవ చికిత్స.

శ్లో॥ తండులీయకమూలానిపిష్ట్వాతండులవారిణా ।
ఋత్వంతేతుత్ర్యహంపీత్వావంధ్యాఃకుర్వంతియోషితః ॥

తా॥ స్త్రీ ఋతుస్నానముజేసిన దినము మొదలు మూడుదినములు చిర్రికూర మొక్కవేళ్ళను బియ్యపుకడుగుతోనూరి పానముజేసిన గొడ్రాలగును.

సూతికారోగ నిదానము.

శ్లో॥ అంగమర్దోజ్వరఃకంపఃపిపాసాగురుగాత్రతా । శోథశ్శూలాతిసారౌచ సూతికా రోగలక్షణం । మిథ్యోపచారా త్సంక్లేశా ద్విషమాజీర్ణభోజనాత్ । సూతికాయాశ్చయేరోగాజాయంతే దారుణాస్తుతే । వాయుః ప్రకుపితఃకుర్యా త్సంరుధ్య రుధిరం చ్యుతం । సూతాయాస్తు హృచ్ఛిరోవస్తి శూలం మక్కల్ల సంజ్ఞికం । జ్వరాతిసారశోథాశ్చశూలానాహామలక్షయాత్ । తంద్రారుచిప్రసేకాద్యాఃకఫవాతామయోద్భవాః । కృచ్ఛ్రసాధ్యాహితేరోగాఃక్షీణమాంసబలాగ్నితః । తేసర్వేసూతికానామ్నారోగాస్తేచాప్యుపద్రవాః ॥

తా॥ వొడలునొప్పులు జ్వరము వణుకు దప్పి శరీరముబరువుగనుండుట వాపు శూల అతిసారము ఇవి గలిగెనేని యది సూతికారోగలక్షణమని యెరుంగవలయు. మఱియు సూతికాస్త్రీలకు జేయందగిన ఉపచారములు అన్యథాజేయుట క్లేశము అజీర్ణభోజనము వీట్లవలన వాయువు ప్రకోపించి రక్తసారివయును నిరోధించి హృదయము శిరస్సు పొత్తికడుపు వీట్లయందు మక్కల్లశూలను జనింపంచేయుటయేగాక అతిసారము వాపు శూల ఆనాహము తంద్ర అరుచి చమట కఫవాతమువలన గలిగెడు రోగములు ఇవి జనించి వాటిచే మాంసక్షయము బలక్షయము మందాగ్నిత్వము వీట్లచే కృచ్ఛ్రసాధ్యములగుచున్నవి ఇవే సూతికారోగములనంబడు.

## బాలింతరోగమునకు సామాన్య చికిత్స.

శ్లో॥ సూతికారోగశాంత్యర్థంకుర్యాద్వాతహరీంక్రియాం ॥

తా॥ పైజెప్పంబడిన సూతికారోగమును శమింపంజేయుటకై సామాన్యముగ వాతహరమైన క్రియలు జేయవలయు.

## రెండవ చికిత్స.

శ్లో॥ దశమూలకృతంక్వాథంకోష్ణందద్యాద్ఘృతాన్వితం ॥

తా॥ దశమూలములయొక్క కషాయము కొంచము ఉష్ణముగ నుండునపుడు ఆవునెయ్యివైచి పుచ్చుకొనిన సూతికారోగము నివర్తించు.

## మూడవ చికిత్స.

శ్లో॥ అమృతానాగరసహచరభద్రోత్కటపంచమూలకంజలదః ।
శృతశీతంమధుయుక్తంశమయత్యచిరేణసూతికాంతకం ॥

తా॥ మఱియు తిప్పతీగె శొంఠి పచ్చములుగోరింట సుగంధపాల తేక సీకి లవంగపట్ట పంచమూలము తుంగముస్తెలు వీటిని కషాయముపెట్టి చల్లార్చి తేనెవేసి పుచ్చుకొనిన సూతికారోగము నివర్తించు.

## నాలవ చికిత్స.

శ్లో॥ దేవదారు వచాకుష్ఠం పిప్పలీ విశ్వభేషజం । కట్ఫలం ముస్త భూనింబతిక్తాధాన్యంహరీతకీ । గజకృష్ణాచదుస్పర్శాగోక్షురం ధన్వయాసకం । బృహత్యతివిషాచ్ఛిన్నాకర్కటంకృష్ణజీరకం ।

సమభాగా న్వితై రేతైః సింధూరామఠ సంయుతైః । క్వాథ
మష్టావశేషంతు ప్రసూతాంపాయయేత్ప్రియం । శూలకాస
జ్వరశ్వాస మూర్ఛాకంప శిరోర్తిభిః । యుక్తంప్రలాపతృట్
దాహ తంద్రాతి సారవాంతిభిః । నిహంతి సూతికారోగం
వాతపిత్తకఫాన్వితం ॥

తా॥ దేవదారు వస కోష్ఠము పిప్పళ్ళు శొంఠి కాయఫలము తుంగముస్తెలు సీమనేలవేము కటుకరోహిణి ధనియాలు కరక్కాయలు గజపిప్పలి పల్లేరు దూలగొండి చిన్నములక అతివస తిప్పతీగ నల్లచెరుకు నల్లజీలకర్ర వీటిని సమభాగములుగ వేసి కషాయముబెట్టి అష్టమాంశముదించుకొని వేల్చినయింగువ సైంధవలవణము వీటిని వేసి బాలింతలు పుచ్చుకొనిన వాతాదిదోషములవలన జనించిన శూల దగ్గు జ్వరము శ్వాస మూర్ఛ వణుకు తలపోటు ప్రలాపము దప్పి తాపము ఆలస్యము అతిసారము వాంతి ఇవి మానుటయేగాక త్రిదోషాత్మకమైన వుపద్రవములు సగా మానును.

అయిదవ చికిత్స.

శ్లో॥ సహచరకులిత్థపుష్కరదారువేతసః క్వాథః ।
పీతస్సహింగులవణశ్శమయతిశూలజ్వరౌసూతాయ్యాః ॥

తా॥ పచ్చములుగోరింట వులవలు ఆముదపువేరు దేవదారు ప్రబ్బలి వీట్లను కషాయముబెట్టి ఇంగువ లవణమువేసి బాలింత స్త్రీ పుచ్చుకొనిన శూల జ్వరము ఇవి నివర్తించు.

ఆరవ చికిత్స.

శ్లో॥ పంచమూలస్యవాక్వాథంతప్తలోహేనసంగతం ।
సూతికారోగనాశాయపిబేద్వాసహితాంసురాం ॥

తా॥ పంచమూలములను కషాయముబెట్టి ఇనుమునుకాచి ఆకషాయమునందు నైచి ఆకషాయమును బాలింతపుచ్చుకొనిన సూతికారోగములు నివర్తించు.

యేడవ చికిత్స.

శ్లో॥ పిప్పలీపిప్పలీమూలంచవ్యంశుంఠీయవానికా । జీరకేద్వేహరి
ద్రేచబిడసౌవర్చలంతథా । ఏతై రేవౌషధైః పిష్టైః ధారనాలం

విపాచయేత్ । ఆమవాతహరంవృష్యంకఫఘ్నంవహ్నిదీపనం ।
వజ్రకంకాంజికంనామస్త్రీణామగ్నివివర్ధనం । సూతికారోగశ
మనంశూలఘ్నంక్షీరవర్ధనం ॥

తా॥ పిప్పళ్లు మోడి చవ్యము శొంఠి ఓమము నల్లజీలకఱ్ఱ శుద్ధజీలకఱ్ఱ మాని పసపు పసపు బిడాలవణము సౌవర్చలవణము వీటిని పుల్లనికలితోనూరి వుడికించి పుచ్చుకొనిన ఆమవాతము నివర్తించుటయేగాక వీర్యవృద్ధికరముగనుండు. మఱియు కఫమును బోగొట్టి వహ్నిదీపనమును కలుగంజేయు. మఱియు ప్రసవించిన స్త్రీలకు వహ్నిదీపనమును కలుగంజేసి సకలమైన సూతికారోగములు శూల వీటిని బోగొట్టి క్షీరవృద్ధిని గలుగంజేయు. ఇదియ వజ్రకాంజికమను ఔషధము.

యెనిమిదవ చికిత్స.

శ్లో॥ వాతవ్యాధివిధానేనసూతికాంసముపాచరేత్ ।
జలౌకాభిర్హరేద్రక్తంవస్తినాచోపనాహయేత్ ॥

తా॥ మఱియు వాతవ్యాధికి యేవుపచారములు జేయందగునో అట్టివుపచారములచే సూతికాస్త్రీకి కలిగినజాడ్యములకు వుపచరించవలయు. మఱియు వాతరక్తము గలిగియుండెనేని జలగలనంటించి రక్తముదీయుటయేగాక పొత్తికడుపుయందు వొత్తడము మొదలగు వస్తికర్మ జేయవలయు.

సూతికావాయువులకు పంచజీరకావలేహము.

శ్లో॥ జీరకంసహజీరశ్చశతపుష్పాద్వయంతథా । యవానీచాజమోదాచధాన్యకంమేధికాపిచ । శుంఠీకృష్ణాకణామూలంచిత్రకంహపుషాపిచ । విదారీఫలచూర్ణంచకుష్ఠకంపిల్లకంతథాఏతాని పలమాత్రాణిగుడంపలశతంమతం । క్షీరప్రస్థద్వయందద్యాత్సర్పిషఃకుడశోగతః । పంచజీరకపాకోయంప్రసూతాయాంప్రశస్యతే । యుజ్యతేసూతికారోగేయోనిరోగేజ్వరేక్షయే । కాసేశ్వాసేపాండురోగేకార్శ్యేవాతామయేషుచ ॥

తా॥ జీలకఱ్ఱ సహజీర చిన్నసోపు పెద్దసోపు ఓమము అజామోదము ధనియాలు మెంతులు శొంఠి పిప్పళ్లు మోడి చిత్రమూలము తెల్లనేలగుమ్మడు చూర్ణము కోష్ఠు కంపిల్లకము వీట్లను దినుసు 1కి వొకపలమువంతున చూర్ణముచేసి 100 పలముల బెల్లము

2 ప్రస్థములు ఆవుపాలు నెయ్యి 1 కుడవము వీటిని చేర్చి లేహ్యపక్వముగవండి దించుకొని సూతికాస్త్రీ ప్రాతకు తులమువంతున భక్షించిన సకలమైన సూతికావాయువులు నివర్తించు.

## సూతికాస్త్రీకి నాగరఖండము.

శ్లో॥ అజ్యస్యాంజలియుగ్మసత్రిపయసఃప్రస్థద్వయంఖండతః । పంచాశత్పలమత్రచూర్ణితమథప్రక్షిప్యతేనాగరం । ప్రస్థార్థంకుడవద్వయాచ్చవిధినామూర్చిత్రయంధాన్యకాత్ । మిశ్యాఃపంచపలంపలంక్రిమిరిపోస్సాజాజికేరాదపి । వ్యోషాంబోధదలోరగేంద్రనుమనఃసద్రావిడానాంపలం । పక్వంనాగరఖండసంజ్ఞకమిదం సౌభాగ్యదంయోషితాం । తృట్ఛర్దిజ్వరదాహశోషశమనం సశ్వాసకాసాపహం । ప్లీహవ్యాధివినాశనంక్రిమిహరంమదాగ్నిసందీపనం ॥

తా॥ నెయ్యితులము 32 ఆవుపాలు తు 512 చక్కెర తు 200 వీటిని పాకపట్టుకొని అందులో 200 తులముల శొంఠి చూర్ణముచేసి బాగుగకలియబెట్టి అందు ధనియాలు తులములు 12 పెద్దసోపు తులములు 20 వాయువిడంగములు తు 4 ఓమము తు 4 జీలకఱ్ఱ తు 4 శొంఠి తు 4 పిప్పళ్ళు తు 4 మిరియాలు తు 4 తుంగగడ్డలు తు 4 లవంగపత్రి తు 4 నాగకేసరములు తు 4 సన్నయేలకులు తు 4 వీట్లను చూర్ణముచేసి పైపాకులోవైచి లేహపక్వముగదించుకొనిన దీనిని నాగరఖండమనియును వచించెదరు. ఈఖండమును సూతికాస్త్రీలు పుచ్చుకొనిన దప్పి వాంతి జ్వరము శోష వగ్గు ప్లీహ గుల్మము క్రిమి మఱియు మందాగ్ని వీటిని బోగొట్టును.

## సూతికకు నాగరాదిలేహము.

శ్లో॥ నాగరస్యరసాన్నష్టౌప్రస్యసలవింశతిః । క్షీరాద్ధకేసనసంయుక్తంఖండస్యార్థతులాంపచేత్ । శతాహ్వాజీరకవ్యోషత్రిసుగంధియవానికాః । కారవీమిశిచవ్యాగ్నిముస్తానాంచపలంపలం । లేహీభూతమిదంసిక్తంఘృతభాండేవిధాపయేత్ । తద్యథాగ్ని బలాపూర్వేత్సూతికాతువిశేషతః । బల్యంవర్ణ్యంతథాపుష్టం చసర్వశరీరనాశనం । పయసఃస్నాతంపూర్వంమందాగ్నేర్

పనంపరం । ఆమవాతప్రశమనం సౌభాగ్యకర ముత్తమం ।
మక్కల్లశూలశమనంసూతికారోగనాశనం ॥

తా॥ ఆవునెయ్యి తు 80 ఆవుపాలు తు 256 కలకండ తు 200 వీటిని పాకము పెట్టి శొంఠి చూర్ణము తు 32 వైచి కలియబెట్టి పిదప చల్లగడ్డ జీలకఱ్ఱ శొంఠి మిరియాలు పిప్పళ్ళు లవంగపట్ట ఏలకులు లవంగపత్రి వోమము పెద్దసోపు బాలింతసోపు చవ్యము చిత్రమూలము తుంగముస్తెలు వీటిని ప్రత్యేకప్రత్యేకముగ 4 తులములవంతున చూర్ణముచేసి పైపాకములో వైచి లేహపక్వముగవండి దించుకొని నేతితో మాగిన కుండయందునిచి అగ్నివృష్టినెరిగి బాలింత పుచ్చుకొనిన బలము వర్ణము పుష్టియు గలుగుటయేగాక సమస్తమైన సూతికావాయువు మొదలగువాటిని దొలంగజేయు.

## సూతికాపథ్య క్రమము.

శ్లో॥ సర్వతఃపరిశుద్ధాస్యాత్స్నిగ్ధపథ్యాల్పభోజనాత్ ।
స్వేదాభ్యంగపరానిత్యంభవేన్మాసమసంద్రితా ॥

తా॥ ఈరీతిని ప్రసూతస్త్రీ ఈఔషధసేవజేయుటయేగాక సర్వాంశములలో పరిశుద్ధురాలుగను పథ్యముగ అల్పభోజనము చెమట వడియువటులంజేయుట అభ్యంగనము ఇవి క్రమముగ వొకమాసపరియంతము జేయుచుండవలయు.

## హీనసూతికా లక్షణము.

శ్లో॥ ప్రసూతాసార్థమాసాంతేదృష్టేవాపునరార్తవే ।
సూతికానామహీనాస్యాదితిధన్వంతరేర్మతం ॥

తా॥ బాలింత $1\frac{1}{2}$ నెల అయినపిదప రజస్వలయ్యెనేని అది హీనసూతిక యైనదని ఎఱుంగవలయు. ఇది ధన్వంతరియొక్క మతము.

## ఉపచార కాలనియమము.

శ్లో॥ ఉపద్రవైర్విశుద్ధాంచవిజ్ఞాయవరవర్ణినీం ।
ఊర్ధ్వంచతుర్భ్యోమాసేభ్యఃపరిహారంవిసర్జయేత్ ॥

తా॥ ఇటుల చికిత్సచే బాలింతకు రోగము నివర్తించి విశుద్ధురాలైనదని యెరింగి పిదప 4 మాసములయ్యేవరకు చికిత్సనుమాని తగుపాటి వుపచారములు చేయవలయు.

## స్తనరోగనిదానము.

శ్లో॥ సక్షీరౌవాప్యదుగ్ధౌవాదోషః ప్రాప్య స్తనౌ స్త్రియః ।
ప్రదుష్యమాంసరుధిరే స్తనరోగాయకల్పతే ।
పంచానామపితేషాంహిరక్తజంవిద్రధింవినా ।
లక్షణానిసమానానిబాహ్యావిద్రధిలక్షణైః ॥

తా॥ క్షీరములతో యుక్తములైనను లేక క్షీరహీనములయినను స్త్రీ స్తనముల యందు వాతాదిదోషంబులు ప్రకోపించి మాంసరక్తంబులనుచేర్చి వాతపిత్త శ్లేష్మ ఆగంతుక సన్నిపాతాత్మకరోగంబులను జనింపంజేయు. వాటిలక్షణంబులు రక్తవిద్రధి తప్ప ఇతర బాహ్యవిద్రధులయందు జెప్పంబడిన లక్షణంబులే వీటికిని యెఱుంగవలయు.

## స్తనరోగ చికిత్స.

శ్లో॥ లేపోవిశాలమూలేనహంతిపీడాం స్తనోత్థితాం ।
వనకార్పాసికేక్ష్వాకుమూలంసౌవీరకేనవా ॥

తా॥ వెఱ్ఱిపుచ్చవేరుచాది లేపనముజేసిన లేక అడవిప్రత్తి చేదుసొరవేరు వీటిని గోధుముల కాంజికములోనూరి లేపనముచేసిన స్తనములయందు జనించినపీడ తొలఁగు.

## స్తన్యవాతరోగ చికిత్స.

శ్లో॥ జాతేవాతాత్మకే స్తన్యేదశమూలంత్ర్యహంపిబేత్ ।
వాతవ్యాధిహరంసర్పిఃపీత్వామృదువిరేచయేత్ ॥

తా॥ వాతవ్యాధివలన స్తన్యము దుష్టమయ్యేనేని దశమూలకషాయము 3 దినములు పుచ్చుకొనిన లేక వాతహరమగు ఘృతమును సేవించినను లేక మెత్తనగ విరేచనమునకు పుచ్చుకొనినను అది నివర్తించును.

## స్తనములయందుగలిగెడి వాపులకు చికిత్స.

శ్లో॥ శోఫం స్తనోత్థిత మవేక్ష్య భిషగ్విదధ్యాద్విద్రధావభిహితం బహుధావిధానం। ఆమేవిదహ్యతితథైవగతేచపాకంయస్యాః స్తనౌసతతమేవచనిర్గృహీతౌ ॥

తా॥ వాత పిత్త శ్లేష్మాదులవలన స్త్రీకి స్తనములయందు వాపుకలిగి ఆదిపంచక తాపముకలిగి వ్రణములు జనించెనేని విద్రధియందు జెప్పంబడిన నానావిధచికిత్సలు చేయవలయు.

స్తనములు దృఢపడుటకు చికిత్స.

శ్లో॥ శ్రీపర్ణీరసకల్కాభ్యాం తైలంసిద్ధంతిలోద్భవం ।
తత్తైలంతూలకేనస్య స్తనయోఃపరిధారయేత్ ।
పాపితావృద్ధితౌ స్త్రీణాంభవేతాం తేపయోధరౌ ।
గజకుంభసమాకారౌ వృత్తసౌ స్తనమండలౌ ॥

తా॥ కూరనెల్లి అందుగ వీటియొక్క కల్కములో నువ్వులనూనెపైచి తైల పక్వముగకాచి నాతైలమునందు ప్రత్తినితడిపి స్తనములమీదకట్టిన నవి గట్టిపడును.

రెండవ చికిత్స.

శ్లో॥ జలేనాగబలామూలం పిష్ట్వామర్దనమాచరేత్ ।
కఠినంపీనతుంగాఢ్యంభవతి స్తనమండలం ॥

తా॥ చిట్టాముట్టిని నీటితోనూరి స్తనములకు లేపనముజేసిరుద్దిన స్తనములు పృష్టము ఇవి కఠినములగు.

మూడవ చికిత్స.

శ్లో॥ సపద్మబీజాసితయాభక్షితంపయవారిణా ।
దృఢంస్త్రీణాం స్తనద్వంద్వంమాసేనకురుతేకిలా ॥

తా॥ తామరకాయలు పాలయందునూరి శర్కరచేర్చి 1 మాసము పుచ్చుకొనిన స్తనములు ఘట్టిపడును.

వాతాదులవలన దూషితమైన స్తన్యలక్షణము.

శ్లో॥ కషాయంసలిలప్లావి స్తన్యంమారుతదూషితం । కట్వామ్లలవణం పీతరాజమత్పిత్తసంజ్ఞితం । కఫదుష్టంఘనంతోయేనిమజ్జ సుపిచ్ఛిలం । ద్విలింగంద్వంద్వజంవింద్యాత్సర్వలింగంత్రిదోషజం॥

తా॥ (స్తన్యము అనగా) చనుపాలు వగరుగను ఉదకముపై తేలునదిగనుండె నేని అది వాతదోషదూషితమనియు కారముగను పులుసుగను ఉప్పగనుండుటయే

గాక దానిపై పసుపు రేఖలు కనుబడెనేని అది పిత్తదూషితమనియు బరువుగను బంకగనుండుటయేగాక నీటియందు వేసిన నది మునిగెనేని కఫదుష్టమనియు ద్విదోషలక్షణములు కనుపడెనేని నది ద్వంద్వదోషమనియు అనేకదోషములు కనుపడెనేని అది సన్నిపాతదుష్టమని యెరంగు.

## నిర్దుష్టమైన స్తన్య లక్షణము.

శ్లో॥ అదుష్టంచాంబునిక్షిప్తంపకీభవతిపాండురం ।
మధురంచవివర్ణంచప్రసన్నంవినిర్దిశేత్ ॥

తా॥ స్తన్యము నీటియందు వేసిన ఆనీటితో కలిసి వివర్ణముగనుండక తెలుపు వర్ణముగలదిగనుండెనేని అది నిర్దుష్టమని యెఱుంగవలయు.

## పిత్తదుష్ట స్తన్య చికిత్స.

శ్లో॥ పిత్తదుష్టేమృతాభీరుపటోలంనింబచందనం ।
ధాత్రీకుమారశ్చపిబేత్క్వథయిత్వాసశర్కరం ॥

తా॥ స్తన్యము పిత్తదుష్టమయ్యెనేని తిప్పతీగె శతావరి చేదుపొట్ల వేప చందనము వీటిని కషాయముపెట్టి శర్కరవైచి తల్లి బాలుడు వీరిరువురు పానముజేసిన అది నివర్తియగు.

## కఫదుష్ట స్తన్య చికిత్స.

శ్లో॥ కఫదుష్టేఘృతంపేయంయష్టిసైంధవసంయుతం ।
రామపుష్పైః స్తనౌలింపేచ్ఛిశూశ్చదశనచ్ఛదౌ ।
సుఖమేవంపమేద్బాలఃకఫకోపశ్చశామ్యతి ॥

తా॥ స్తన్యము కఫదుష్టమైనను అతిమధురము సైంధవలవణము వీటిని చూర్ణము జేసి నేతివైచి పుచ్చుకొనినను లేక అశోకపుష్పములునూరి స్తన్యమునకు బాలుని పెదవులకు దంతములకు వీటికి లేపనముజేసిన జక్కగవమనంబై స్తన్యదోషమువలన జనించిన జాడ్యము సదా నివర్తియగు.

## ద్వంద్వదు స్తన్య చికిత్స.

శ్లో॥ ద్వంద్వదుష్టంహిదోషాభ్యాంపూర్వోక్తాభ్యాంవిశోధయేత్ ॥

తా॥ 2 దోషములవలన స్తన్యము దుష్టమయ్యేనేని పూర్వోక్తరోగములను కని ద్వంద్వచికిత్స జేయవలయు.

## త్రిదోష స్తన్య చికిత్స.

శ్లో॥ స్తన్యేత్రిదోషసందుష్టే శకృదామంబలోపమం ।
నానావర్ణబుజంచార్ధంవిబద్ధముపవేశ్యతే ॥

తా॥ త్రిదోషమువలనజనించిన స్తన్యము దుష్టమయ్యేనేని నాపాలను పానము జేసినశిశువు నీళ్లవలె ఆమయుక్తమై అనేకవర్ణములై కొంచెముగట్టియై కడుపు నులిమి నులిమి మలమునిడుచును.

## స్తన్య చికిత్స.

శ్లో॥ పాఠామూర్వాచభూనింబదారుశుంఠికలింగకా ।
సారివానత తిక్తాఖ్యా స్తత స్తన్యవిశోధనః ॥

తా॥ అగరుశొంఠి చాగ సీమనేలవేము దేవదారు శొంఠి కొడిశపాలవిత్తులు నుగంధపాలవేరు గ్రంధితగరము కటుకరోహిణీ వీటిని కషాయము పెట్టిపుచ్చుకొనిన స్తన్యదోషము నివర్తియగు.

## స్తన్యజనన విధి.

శ్లో॥ భూమికూష్మాండమూలస్య క్షీరపిష్టస్యయోరసం ।
విబేత్సశర్కరంతస్యాః క్షీరంబహువివర్ధతే ॥

తా॥ నేలగుమ్మడువేరును పాలతో నూరి రసముమపిండి అందు శర్కరవైచి పుచ్చుకొనిన స్త్రీకి స్తన్యవృద్ధియగు.

## రెండవ చికిత్స.

శ్లో॥ శతావరీక్షీరపిష్టాపీతా స్తన్యవివర్ధినీ ।
కవోష్ణంకణయాపీతంక్షీరంక్షీరవివర్ధనం ॥

తా॥ శతావరి పాలలోనూరి పుచ్చుకొనినను లేక మందోష్ణమైనపాలలో పిప్పలి చూర్ణమువేసి పుచ్చుకొనిన స్త్రీకి క్షీరవృద్ధియగు.

## మూడవ చికిత్స.

శ్లో॥ నసకార్పాసికేక్షూణాంమూలంసౌవీరకేణవా ।

విదారీకందసంసూరయూపిబేద్వా స్తన్యవర్ధనం ॥

తా॥ అడవిపత్తివేరు చెరుకువేరు వీటిని కాంజికములోనూరి పుచ్చుకొనినను లేక నేలగుమ్మడు మూలము నరయందునూరి పుచ్చుకొనినను స్తన్యవృద్ధిగలుగు.

నాలవ చికిత్స.

శ్లో॥ కార్పాసికేక్షూణాంమూలంవాపర్పాటోద్భవం ।
విదారీకందసురయాపిబేద్వా స్తన్యవర్ధనం ॥

తా॥ అడవిపత్తివేరు చెరుకువేరు లేక పర్పాటకము నేలగుమ్మడువేరు వీట్లను సురయందునూరి పుచ్చుకొనినను క్షీరవృద్ధియగు.

అయిదవ చికిత్స.

శ్లో॥ విదారీకందసురయాపిబేత్ స్తన్యవివర్ధనం ।
పాఠామూర్వాశ్వగంధానింబదారుశుంఠీకలింగకైః ।
పాలవామృతతిక్తాఖ్యైఃక్వాథః స్తన్యవివర్ధనః ॥

తా॥ నేలగుమ్మడు మద్యముతోనూరి పుచ్చుకొనినను లేక అగరుశొంఠి పాగ సనునేలవేము దేవదారు శొంఠి కొడిశపాలవిత్తులు సుగంధపాలవేరు తిప్పతీగ కటుకరోహిణి వీటినికషాయముపెట్టి పుచ్చుకొనినను స్త్రీకి స్తన్యవృద్ధియగు.

ఆరవ చికిత్స.

శ్లో॥ గోధూమమూర్వాతుల్యాఃశాకోటదలనిర్మితోయూషః ।
ఘృతతైలసహితోవాస్తన్యాభివృద్ధిమగ్రః ॥

తా॥ గోధుమలు ఆక్రోటుఆకులు వీటిని సమభాగములుగచేర్చి పిసికి ఆవు నేతితో పూరీలుకాల్చి 7 దినములు పుచ్చుకొనిన స్తన్యవృద్ధిగలుగు.

స్తనశోథ చికిత్స.

శ్లో॥ పిత్తఘ్నానిసుశీతానిద్రవ్యాణ్యత్రప్రయోజయేత్ ।
జలౌకాభిర్హరేద్రక్తంతస్తనావ్రసనాశయేత్ ॥

తా॥ స్తనరోగమునందు పిత్తనాశకమైన ద్రవ్యములచే లేపనము మొదలగు వాటియందుపయోగపరచవలయు. మఱియు వాతరక్తాదులయందు జలగలనంటించి రక్తము తీయుటయేగాక గానుగపిండి కట్టవలయు.

## ప్రదరరోగమునందు పథ్యాపథ్య విచారము.

శ్లో॥ యత్పథ్యంయదపథ్యంచరక్తపిత్తేషుకీర్తితమ్ ।
ప్రదరేపియథాదోషంతత్తునారీబుజౌత్యజేత్ ॥

తా॥ రక్తపిత్తమునందు పథ్యాపథ్య క్రమంబునుబోలె వాత పిత్త శ్లేష్మ ద్వంద్వసన్నిపాతాదులచే జనించెడి ప్రదరరోగమునందును పథ్యాపథ్యములని తెలుంగవలయు.

## గర్భిణీ స్త్రీకి చేయదగిన పథ్యము.

శ్లో॥ వాతవ్యాధివతాంపథ్యమపథ్యంచయదీరితం । శాలయఃషష్టి
కాముద్గా గోధూమా లాజసక్తవః ! నవనీతం ఘృతంక్షీరం
రసాన్న మధుశర్కరా । పనసం కాదలంధాత్రీ ద్రాక్షామ్లం
స్వాదుశీతలం । కస్తూరీచందనంమాలాకర్పూరంమధులేపనం।
చంద్రికాస్నానమభ్యంగో మృదుశయ్యాహిమానిలాః । సంత
ర్పణం ప్రియాశ్లేషో విహారాశ్చ మనోరమాః । ప్రియంకరం
చాన్నపానంగర్భిణీనాంహితంసదా ॥

తా॥ వాతవ్యాధియందు జెప్పంబడిన పథ్యాపథ్యంబులు గర్భిణీస్త్రీకిని పథ్యాపథ్యంబులుగ నెఱుంగుటయేగాక 60 దినములలో పండెడిధాన్యముయొక్క బియ్యము పెసలు గోధుములు వరిపేలపిండి వెన్న నెయ్యి పాలు షడ్రసములు తేనె శర్కర పనసపండు అరటిపండు ఉసిరికకాయలు ద్రాక్ష పుల్లదానిమ్మ రుచికరమగువస్తువలు శీతలమగువస్తువలు వీట్లను ఆహారమునందు పుచ్చుకొనుటయేగాక కస్తూరీ చందనము పుష్పమాలికలు పచ్చకర్పూరము మధు వాసనద్రవ్యముల లేపనము వెన్నెల నిత్య స్నానము అభ్యంజనము మృదుశయ్య చల్లనిగాలి ఇంద్రియములకు తృప్తికరమగు వస్తువలు ప్రియాలింగనాదులు మనోహరమగు వనవిహారాదులు ప్రియమైన అన్నపానములు ఇవియన్నియు గర్భిణీస్త్రీకి అత్యంతయిష్టముగాన ఇష్టమగునపుడు వీట్లను సగా సేవించవలయు.

## అపథ్యములు.

శ్లో॥ స్వేదశంపమనంప్రారంకదన్నంవిషమాసనం ।
అపథ్యమిదముద్దిష్టంగర్భిణీనామహర్షిభిః ।
సూతికాఖ్యేషురోగేషువాతశ్లేష్మోద్భవేషుచ ।
తత్రరోగానుకల్పేనపథ్యాపథ్యానినిర్దిశేత్ ॥

తా॥ చమటదీయుట వమనము కారము అపథ్యాన్నము (కదన్నము) విషమ మగు ఆసనము పీటిసన్నియు గర్భిణీస్త్రీ వర్జించవలయునని ఋషులు వచించెదరు. మఱియు సుగుణవైద్యుడు వాత పిత్త శ్లేష్మాదులయందు జనించిన సూతికారోగము నందు రోగానుగుణ్యముగ పథ్యాపథ్యముల నొనర్చవలయు.

ఇతి శ్రీవేంకటదాసాత్మజ జయకృష్ణదాసకృతౌ
చికిత్సారత్నె - ద్వితీయాశ్వాస
స్సమాప్తః.



శ్రీ ర స్తు.

# చికిత్సారత్నము.

## ఆంధ్ర తాత్పర్యము.

### తృతీయాశ్వాసము.

### బాలరోగ నిదానము.

శ్లో॥ ధాత్ర్యాస్తుగురుభిర్భోజ్యై ర్విషమైర్దోషలై స్తథా ।
దోషాదేహేప్రకుప్యంతితతః స్తన్యంప్రదుష్యతి ॥

తా॥ జడాన్నాదిభక్షణము విషమాన్నము దుష్టాన్నభక్షణము వీటివలన స్త్రీకి వాత పిత్త శ్లేష్మములు ప్రకుపితములై అవి స్తన్యమును వికృతిని జెందించు.

అన్యచ్చ.

శ్లో॥ మిథ్యాహారవిహారిణ్యాదుష్టావాతాదయస్త్రియః ।
దూషయంతిపయస్తేనజాయంతేవ్యాధయశ్శిశోః ॥

తా॥ విరుద్ధాహార విహారములు జేయునట్టి స్త్రీయొక్క వాతాది దోషంబులు ప్రకోపించినవై స్తన్యమునకు దోషమునుగలుగంజేయు. అట్టి స్తన్యపానము జేయునట్టి శిశువునకు వ్యాధులుజనించు.

అన్యచ్చ.

శ్లో॥ త్రివిధఃకథితోబాలఃక్షీరాన్నోభయవర్తనః ।
స్వాస్థ్యందాభ్యామదుష్టాభ్యాందుష్టాభ్యాంరోగసంభవః ॥

తా॥ మఱియు కేవల క్షీరపానము స్వల్పముగ అన్నము లేక క్షీరము స్వల్పముగ అన్నము యిటుల 3 విధంబులుగనుండు. అట్టి క్షీరాన్నములు నిర్దుష్టంబులయ్యేనేని శిశువు నిరోగియగు. అవి దుష్టంబులయ్యేనేని రోగము జనించు.

## అన్యచ్చ.

శ్లో॥ దంతోద్భవశ్చరోగాణాంసర్వేషామేవకారణం ।
విశేషాజ్జ్వరవిడ్భేదకార్శ్యక్షోథశిరోరుజాం ।
అభిష్యందశ్చశోథశ్చవిసర్పశ్చప్రజాయతే ॥

తా॥ శిశువులకు దంతోద్భవకాలమునందు జ్వరము భేదులు చిక్కిపోవడము సర్వబాలరోగములు వాంతులు శిరోవ్యథ అభిష్యందము వాపు ఇట్టి విశేషరోగంబులు జనించు.

## వాతదుష్ట స్తన్యజరోగ నిదానము.

శ్లో॥ వాతదుష్టంశిశు స్తన్యంపిబన్వాతగదాతురః ।
క్షామఃస్వరక్షీణాంగస్స్యాత్ బద్ధవిణ్మూత్రమారుతః ॥

తా॥ వాయువువలన దుష్టమైన స్తన్యమును పానముజేసెడి బాలునికి మిగుల వాతరోగంబులు జనించుటయేగాక చిక్కిపోవుట హీనస్వరము మలమూత్రములు వాయువుచే బంధించుట ఇట్టిలక్షణంబులు గలుగు.

## పిత్తదుష్ట స్తన్యజరోగ నిదానము.

శ్లో॥ జిన్నేభిన్నమలోబాలఃకామలాపిత్తరోగవాన్ ।
తృష్ణానురుష్ణసర్వాంగఃపిత్తదుష్టంపయఃపిబన్ ॥

తా॥ పిత్తదుష్టమైన స్తన్యమును శిశువు పానముజేసెనేని ఖేదము భేదులు కామిల పిత్తరోగము దప్పి శరీరమంతయు ఉష్ణము ఇవి జనించు.

## కఫదుష్ట స్తన్యజరోగ నిదానము.

శ్లో॥ కఫదుష్టంపిబన్ క్షీరంబాలాలాలుశ్లేష్మరోగవాన్ ।
నిద్రార్థితోజడశ్శూనఃశుక్లాక్షశ్ఛర్దినశ్శిశుః ॥

తా॥ కఫదుష్టమైన స్తన్యమును శిశువు పానముజేసెనేని శ్లేష్మరోగములు జనించుటయేగాక జొల్లుకారుట శరీరము జడముగనుండుట వాపుకలుగుట కన్నులు పాండువర్ణమై యుండుటయేగాక వాంతులు సగా జనించు.

## బాలులకు అంతర్గతవేదన తెలియుటకై ఉపాయము.

శ్లో॥ శిశోస్తీవ్రామ తీవ్రాంచ రోదనా ల్లక్షయేద్రుజం । స్వయం
స్పృశే ద్భృశందేశం యత్రచ స్పర్శనాక్షమః । తత్రవిద్యా
ద్రుజంమూర్ధ్ని రుజం చాక్షిని మీలనాత్ । కోష్ఠేవిబంధ
వమథు స్తనదం శాంత్రకూజనైః । ఆధ్మానపృష్ఠనమన జఠ
రోన్నమనై రపి। బస్తౌగుహ్యేచవిణ్మూత్రసఙ్గోత్రాసధిగీక్షణైః।
స్రోత్రాంస్యంగానిసంధీంశ్చపశ్యేద్యత్నాన్మహుర్ముహుః ॥

తా॥ వైద్యుడు శిశువులకుజనించెడి మిగులరోగవ్యథ లేక వ్యథలేక పోవుట వీటిని రోదనవిశేషముచే సామాన్యముగ కనిపెట్టవలయు. మఱియు శిశువు యేప్రదేశమును పలుమారు స్పృశించుచున్నదో యేప్రదేశమును నితరులు స్పృశించిన తాకనివ్వక యుండునో ఆప్రదేశమందలి మిగుల రోగవ్యథ కలదనియు కన్నులు పలుమారు మూసుకొనేని శిరమునందు వ్యథకలదనియు మలమూత్రబంధము కక్కుట స్తనముకరుచుట పేగులయందఱుచుట కడుపు వుబ్బుట వీపువంచుట పలుమారు ప్రక్కలెగరవేయుట ఇట్టి లక్షణములచే కుక్షియందు రోగవ్యథ కలదనియు భయపడునటుల పలుమారు దిక్కులుచూచుటచే పొత్తికడుపు గుహ్యస్థలము వీటియందు మూత్రావరోధము కలదని నెఱుంగవలయు. గాన శిశువులయొక్క రోగమును గనుగొనుటకై పలుమారు ఇంద్రియద్వారములను అంగములను సంధిప్రదేశములను గనుగొనవలయు.

## బాలుర పథ్య క్రమము.

శ్లో॥ సర్వంనివార్యతేబాలే స్తన్యంనైవనివార్యతే ।
మాత్రయాలంఘయేద్ధాత్రీంశిరోరేతద్ధిలంఘనం ॥

తా॥ బాలునికి రోగము జనించెనేని సర్వాపథ్య పదార్థములను వర్జించవలయు. అయినను స్తన్యపానము నివారణజేయందగదు. లంఘనము జేయునెడ తల్లి లేక దాది వీరలు లంఘనము జేయవలయు. ఇదియ శిశువులకు లంఘనమని యెఱుంగందగు.

## శిశువులకు ఔషధ క్రమము.

శ్లో॥ భైషజ్యంపూర్వముద్దిష్టంమహతాంయజ్వరాదిషు ।
తదేవకార్యంబాలానాంకింతుదాహాదికంవినా ।

అగ్నిదాహ క్షారవమనవిరేచన శిరావ్యధాదికంవినా ।
మహాకష్టేచోత్పన్నే వమనవిరేకాద్యపిదద్యాత్ ॥

తా॥ జ్వరాదులయందు వయోవంతులకు ఏ ఔషధాదులు శాస్త్రమునందు నుపదేశింపబడియున్నవో అవే బాలులకు నుపయోగపరచవలయు. అయినను అగ్నిదాహము విరేచనము శిరోవ్యధ ఇవి నొనర్చందగదు. అతికష్ట సాధ్యరోగమునందు విరేచనవమనములు ఉపయోగింపందగదు.

అన్యచ్చ.

శ్లో॥ విరేకవస్తివమనాదృ తేకుర్యాశ్చనాత్యయాత్ ।
తఏవదోషదూష్యాశ్చజ్వరాద్యావ్యాధయశ్చయే ।
అతస్తదేవభైషజ్యంమాత్రాత్వస్యకనీయసి ॥

తా॥ బాలులకు చికిత్సజేయునెడల విరేచనము వమనము వస్తికర్మ ఇవితప్ప ఇతర ఔషధంబుల నివ్వందగు. జ్వరాదిదోషంబులు మిగుల ప్రకోపించిన నావమన విరేచనాదులును నొనర్చందగు. మాత్రలొసంగునెడ అల్పముగ నొసంగవలయును.

అన్యచ్చ.

శ్లో॥ రసలోహాదిభైషజ్యంమహతాంయుజ్వరాదిషు ।
యుంజ్యాత్తదేవబాలానాంతత్రమాత్రాకనీయసీ ॥

తా॥ మఱియు వయోవంతులకు జ్వరాదులయందు రసముతో నిర్మించిన ఔషధంబులు లోహాది భస్మంబులు నొసంగుచందంబున బాలురకును అల్పముగనొసంగందగు.

బాలునికి మాత్రాప్రమాణము.

శ్లో॥ విడంగఫలమాత్రంతుజాతమాత్రస్యభేషజం ।
అనేనైవప్రమాణేనమాసిమాసిప్రవర్ధయేత్ ॥

తా॥ బాలుర ఉత్పన్నమైనప్పుడు వాయువిడంగమంత ప్రమాణ ఔషధమివ్వవలయు. ఈ మాసముచేతనే ప్రతిమాసమునకు హెచ్చించుకొనవలయు.

ఔషధ పరిమాణము.

శ్లో॥ ప్రథమే మాసిబాలాయ దేయాభేషజరక్తికా । అవలేహ్యాతు
కర్తవ్యామధుక్షీరసితాఘృతైః । ఏకైకంవర్ధయేత్తావద్యావ

త్సంవత్సరోభ వేత్ । తదూర్ధ్వం మాషవృద్ధిస్స్యాద్యావత్షోడశ వత్సరాః । గుంజాః పఞ్చాద్యమాషకాః ॥

తా॥ అన్యమతము బాలునికి మొదటిమాసమునందు 1 గుంజ మెత్తు ఔషధము తేనె పాలు శర్కర నెయ్యి వీటితో మిళితముజేసి 1 సంవత్సరమువరకు నివ్వవలయు. మఱియు ప్రతిమాసము వొక్కొక్క గురిగింజయెత్తు హెచ్చించవలయు. 1 సంవత్సరమునకుపిదప 16 సంవత్సరములవరకు ప్రతిసంవత్సరమునకు వొక్కొక్క మాష మెత్తు హెచ్చించవలయు. (మాషమనగా అయిదు గురిగింజలయెత్తు.)

అ న్య చ్చ.

శ్లో॥ తతః స్థిరాభ వేత్తావద్యావద్వర్షాణిసప్తతిః ।
తతో బాలకవన్మాత్రాహ్రాసనీయాశనైశ్శనైః ॥

తా॥ 16 వ సంవత్సరమునకు నియమించినమాత్రమే 70 సంవత్సరములవరకు నివ్వందగు. పిదప క్రమముగ తగ్గిస్తూరావలయు.

బాలురకు 16 సంవత్సరములకు పిదప మాత్రా
కషాయాదుల ప్రమాణము.

శ్లో॥ చూర్ణకల్కావలేహానామిదంమాత్రాప్రకీర్తితా ।
కషాయస్యపునస్సైవవిజ్ఞాతవ్యాచతుర్గుణా ॥

తా॥ చూర్ణము కల్కము అవలేహము వీటికి సమానము జెప్పబడినదేగాని కషాయమునిచ్చునెడ నాలుగింతలు నివ్వవలయు.

శ్లో॥ క్షీరంయస్య శిశోర్దేయం ఔషధం క్షీరసర్పిషా । ధాత్ర్యాస్తు కేవలందేయంనక్షీరేణాపిసర్పిషా । క్షీరాన్నాదస్యపూర్వవత్ ॥

తా॥ ఏబాలుడు కేవలము స్తన్యమే పానముజేయునో అట్టిబాలునికి ఔషధమును పాలు నెయ్యి వీటితో నివ్వవలయు తల్లికి ఔషధము నొసంగునెడల పాలు నెయ్యి వీటితో నివ్వందగదు. మఱియు క్షీరము అన్నము వీటిని భక్షించెడి బాలునికి పూర్వోక్తప్రకారము నొసంగుచుండుటనుబట్టి నివ్వందగు.

## కుకూణక బాలరోగ నిదానము.

శ్లో॥ కుకూణకఃక్షీరదోషాచ్ఛిశూనామేవవర్త్మని ।
జాయతేతేననేత్రేచకండూరంభ్రస్రవేన్ముహుః ।
శిశోఃకుర్యాల్లలాటాక్షికూటనాసావిఘర్షణం ।
శక్తోవార్కప్రభాంద్రష్టుంననేత్రోన్మీలనక్షమః ॥

తా॥ శిశువునకు క్షీరదోషమువలన కుకూణకమను రోగముజనించు. అందుచే కన్నులయందు దురద పలుమారు నీరుస్రవించుటయేగాక కన్నులు శిరస్సు ముక్కు పిటిని సగా రుద్దుచుండు. మఱియు నేత్రములు తెరుచుటకు అశక్తమై సూర్యకాంతిని సగా జూడనొల్లదు.

## కకూణక బాలరోగ చికిత్స.

శ్లో॥ ఫలత్రికంలోధ్రపునర్నవేచసశ్రృంగబేరంబృహతీద్వయంచ ।
ఆలేపనంశ్లేష్మహరంసుఖోష్ణంకుకూణకేకార్యముదాహరంతి ॥

తా॥ కరక తాండ్ర ఉశిరికలు లొద్దుగచెక్క తెల్లగలిజేరు అల్లము చిన్నములక పెద్దములక వీట్లనునూరి వుడికించి సుఖోష్ణముగ శరీరమునకు లేపనము చేసిన అది శ్లేష్మమును హరింపంజేసి కుకూణకరోగమును తొలగంజేయు.

## పారిగర్భిక నిదానము.

శ్లో॥ మాతుఃకుమారోగర్భిణ్యాః స్తన్యంప్రాయఃపిబన్నపి ।
కాసాగ్నిసాదవమథుతంద్రాకార్శ్యారుచిభ్రమైః ।
యుజ్యతేకోష్ఠవృధ్యాచతమాహుఃపారిగర్భికం ।
రోగంపరిభవాఖ్యంచదద్యాత్తత్రాగ్నిదీపనం ।
పారిగర్భికరోగేతుయుజ్యతేవహ్నిదీపనం ॥

తా॥ గర్భిణియగు మాతయొక్క స్తన్యము బాలుడు పానముచేసిన దగ్గు అగ్నిమాంద్యము వమనము తంద్ర కాస అరుచి భ్రమ ఇవి గలుగుటయేగాక శిశువుయొక్క కడుపు సగా వృద్ధిగలిగినదిగనుండు. పారిగర్భికము లేక పరిభవము అను నామద్వయముచే బరంగు. ఈరోగము తొలుగుటకై అగ్నిదీపనౌషధముల నివ్వందగు.

## తాలుపాక నిదానము.

శ్లో॥ తాలుమాంసేకఫఃక్రుద్ధఃకురుతేతాలుకంటకం ।
తేనతాలుప్రదేశస్యానిమ్నతామూర్ధ్నిజాయతే ।
తాలుపాతస్తనద్వేషఃకృచ్ఛాత్పానంశకృద్రవం ।
తృడక్షికంఠాస్యరుజాగ్రీవాదుర్ధరపావమిః ॥

తా॥ బాలురకు శ్లేష్మప్రకోపముచే దవడలయందుండు మాంసమునందు తాలుకంటకమనురోగముజనించు. అంగిటియందు పల్లము సగా జనించు. దానిచే దవడలయందు కురుపులు స్తన్యద్వేషము ఇవి కలిగి మిగుల కష్టముగ స్తన్యపానముజేయు. మఱియు దాహముకలిగి నేత్రములు గొంతు ముఖము వీటియందు గలిగెడి నొప్పిచే మెడనిలవకపోవుటయేగాక తాగినపాలు సగా కక్కును.

## తాలుపాక చికిత్స.

శ్లో॥ హరీతకీవచాకుష్ఠకల్కంమాక్షికసంయుతం ।
పీత్వాకుమారః స్తన్యేనముచ్యతేతాలుకంటకాత్ ॥

తా॥ కరక్కాయ వస చెంగల్వకోష్టు వీటిని కల్కముజేసి అందు తేనెవేసి చనుపాలయందుకలిపి తాగించిన తాలుకంటకరోగము నివర్తియగు.

## విసర్పరోగ నిదానము.

శ్లో॥ విసర్పస్తుశిశోఃప్రాణనాశనోవస్తిశీర్షజః ।
పద్మవర్ణోమహాపద్మోరోగోదోషత్రయోద్భవః ।
శంఖాభ్యాంహృదయంయాతిహృదయాద్వాగుదంవ్రజేత్ ॥

తా॥ చిన్నశిశువులకు త్రిదోషమువలన శిరస్సు లేక పొత్తికడుపు వీటియందు లేతదామర చిగురుచందంబున విసర్పమనురోగముజనించి కణతలవలన హృదయమునందును పొత్తికడుపువలన గుదప్రదేశమునందును క్రమముగ ప్రవేశించు. అందుచే శిశువుకు మరణముకలుగు. ఇదియ మహాపద్మకరోగమనియును బరంగు.

శ్లో॥ క్షుద్రరోగేచకథితేఅజగల్యాహిపూతనే ।
జ్వరాద్యావ్యాధయస్సర్వేమహాతాంయేపురేరితాః ।
బాలదేహేపితేతద్వాచ్చాయాఃసర్వత్రైస్సదా ॥

తా॥ వయోవంతులకు క్షుద్రరోగనిదానమునందు అజగల్లీ అహిపూతన యని 2 గ్రహములుగలవు. వాటివలన జ్వరము మొదలగు సమస్తవ్యాధులును జెప్పంబడి యున్నవో అవి శిశువులకు సగా జనించుగాన బుద్ధిమంతులగువారు వాటిని కని పెట్టవలయు.

## సర్వగ్రహ చికిత్స.

శ్లో॥ బలిశాంతిష్టకర్మాణికార్యాణిగ్రహశాంతయే। మంత్రశ్చాయం ప్రయోక్తవ్య స్తత్రాదౌసర్వకామికః ॥ వాక్యమ్ ॥ ఓంనమోభగవతేగరుడాయత్ర్యంబకాయసద్య స్తవస్తుతఃస్వాహా ॥ ఓం కంపండంశంవైనతేయాయనమః ॥ ఓంహ్రీంహ్రూంక్షః। బల దేహప్రమాణేనపుష్పమాలాంతుసర్వతః । ప్రగృహ్యాముచ్ఛి కాభక్తాబలిర్దేయస్తుశాంతికః। ఓంకారీ స్వర్ణపక్షీబాలకంరక్ష రక్షస్వాహా ॥ గరుడబలిః ॥ ఓంనారాయణాయనమః ॥

తా॥ బాలురకు గ్రహంబులు సోకినేని వాటి నివృత్తికొరకై పైనుదహరింప బడిన ఓంనమోయను మంత్రముచే బలులు శాంతిక్రియలు హోమములు అభిమంత్రిం చుట వీటిని నొనర్చవలయు.

వాక్యమ్॥ ప్రథమేదివసేమాసే వర్షేవాగృహ్ణాతినందనానా మమాతృకా। తయాగృహీతమాత్రేణప్రథమంభవతిజ్వరః। అశు భంశబ్దంముంచతి। ఆహారంచకరోతి। స్తన్యంగృహ్ణాతిబలింత స్యప్రవక్ష్యామియేనసంపద్యతేశుభం। నద్యాభయతటమృత్తికాం గృహీత్వాపుత్తళికాంకృత్వాశుక్లౌదనం। శుక్లపుష్పంశుక్లసప్తధ్వ జాః। సప్తప్రదీపాః। సప్తస్వస్తికాః। సప్తవటకాః। సప్తశష్కు లికాః। సప్తజంబుస్వస్తికాః। సప్తముష్టికాః। గంధంపుష్పం। తాంబూలం। మత్స్యమాంసం సురామగ్రభక్తంచ। పూర్వ స్యాందిశి చతుష్పథే మధ్యాహ్నేబలిర్దేయః। తతోఽశ్వత్థపత్రం కుంభేప్రక్షిప్యశాన్త్యుదకేనస్నాపయేత్। రసోనసిద్ధార్థకమేషశృం గనింబపత్రశివనిర్మాల్యైఃబాలకంధూపయేత్। ఓంనమోనారా

యణాయ అముకస్య వ్యాధిం హనహన ముంచముంచ హ్రీంఫట్ స్వాహా । ఏవం దినత్రయం బలిందత్వా చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్ । తతఃసంపద్యతేశుభం ॥

తా॥ శిశువుజనించిన ప్రథమసంవత్సరము ప్రథమమాసము ప్రథమదివసంబున నందయనుగ్రహము శిశువునకుసోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరముజనించుటయే గాక అశుభశబ్దంబులు ఆకారములు వీటినిజేయుచు స్తన్యమును గ్రహించకయుండు. కావున నాగ్రహముదొలిగి శిశువుకు క్షేమముగలిగెడి బలిని వచించెద. యేటియిరు ప్రక్కలయందలి మృత్తికనుదెచ్చి దానిచే ప్రతిమనుగావించి దానితోడ తెల్లఅన్నము తెల్లనిపుష్పములు తెల్లని ధ్వజములు 7 దీపములు 7 స్వస్తికములు 7 పిండివంటలు 7 చక్కిలములు 7 వుండ్రాళ్లు 7 పిండివుంటలు 7 పచ్చిడి గంధము పుష్పము తాంబూలము మత్స్యము మాంసము మద్యము వీటిని మధ్యాహ్నకాలంబున దీసికొని తూర్పు దిక్కుకేగి నాలుగుత్రోవలు కలిసెడి ప్రదేశమునందునిచి బలినిగావించి యొకఘటంబున నుదకంబును దశాశ్వత్థపత్రంబులనునిచి శాంతికరంబులగు మంత్రంబులచే నభిమంత్రించి శిశువుకు స్నానముజేయించి పిదప వెల్లుల్లి తెల్లఆవాలు మేకరోమ్ము వేపాకు మొగిలిపువ్వు వీటిని చూర్ణముజేసి ధూపమువేయవలయు. “ఓంనమోనారాయణాయ అముకస్యవ్యాధిం హనహన ముంచముంచ హ్రీంఫట్స్వాహా” అను నీమంత్రంబును పూజావాహన బలికార్యముల యందుపయోగింపవలయు. ఇటుల 3 దినంబులుగావించి 4 వ దివసంబున బ్రాహ్మణునికి అన్నంబొసంగిన శిశువునకు సోకియుండెడి నందయను గ్రహముతొలగి శుభముపాటిల్లు.

వాక్యమ్॥ ద్వితీయేదివసేమాసేవర్షేవా గృహ్ణాతినునందానామ మాతృకా । తయాగృహీతమాత్రేణప్రథమంభవతిజ్వరః । చక్షురున్మీలయతి । గాత్రముద్వేజయతి । స్వపితి । క్రందతి । స్తన్యం నగృహ్ణాతి । ఆకారశ్చభవతి । బలింతస్యప్రవక్ష్యామియేనసంపద్యతేశుభం । తండులహస్తపృష్టికం। దధిగుడఘృతంచమిశ్రితం। శరావైకం । గన్ధతాంబూలం । పీతపుష్పం । పీతవస్త్రధ్వజాః। సప్తప్రదీపాః । దశస్వస్తికాః । మత్స్యమాంససురాతిలచూర్ణానిపశ్చిమస్యాందిశిచతుష్పథేబలిర్దేయః ॥ దినానిత్రీణిసంధ్యాయాంతతః

స్వాన్తుృదకేనస్నాపయేత్ । శివనిర్మాల్యసిద్ధార్థమారాలరోమవృ
శిర భ్రాలస్యఘృతైర్ధూపందద్యాత్ । ఓంనమోనారాయణాయ
అముకస్యవ్యాధిం హనహన ముంచముంచ । హ్రీంఫట్ స్వాహా।
చతుర్థదివసేబ్రాహ్మణాంభోజయేత్ । తతస్సంపద్యతేశుభం॥

తా॥ శిశువుజనించిన 2 వ వత్సరము 2 వ మాసము 2 వ దివసమున సునంద యనుగ్రహము శిశువునకుసోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరము వచ్చుటయే గాక మిడిగుడ్లిడి శరీరమువణుకుచు నిద్రింపక రోదనముచేయుచు స్తన్యమునొల్లక ఆర్తాకారమొనర్చుచుండుగాన నాగ్రహనివర్తనార్థమై బలినివచించెద. పచ్చిపిండి పెరుగు బెల్లము నెయ్యి వీటిని నేకముగపిసికి చెయ్యవలెచేసి మూకిడియందునిచి అందు గంధము తాంబూలము పసపువర్ణముగల పుష్పములు పసపువర్ణముగల ధ్వజములు 7 దీపములు 7 స్వస్తికములు 10 మత్స్యమాంసము మద్యము నువ్వులగానుగపిండి వీటినన్నిటిని గ్రహించి సంధ్యాసమయంబున పశ్చిమదిశగజని అందు 4 త్రోవలు గలిసెడి ప్రదేశమున బలినొసంగి పిదప శాన్త్యుదకంబుచే శిశువునకు స్నానంబొనర్చి మొగిలిపువ్వు తెల్లఆవాలు పిల్లిబొచ్చు వట్టివేళ్ళు వీటిని చూర్ణముగావించి అందు నెయ్యిచేర్చి ధూపమిడి "ఓంనమోనారాయణాయ అముకస్య వ్యాధిం హనహన ముంచముంచ హ్రీంఫట్ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనాదులయందు ప్రయోగించవలయు. ఇటుల 3 దివసంబులొనర్చి పిదప 4 వ దివసంబున బ్రాహ్మణులకు అన్నం బొసంగిన నాగ్రహము తొలగి శిశువు సుఖము జెందు.

వాక్యమ్॥ తృతీయే దివసేమాసేవర్షేవా గృహ్ణాతిపూతనానామమాతృకా । తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతిజ్వరః । గాత్రముద్వేజయతి । స్తన్యంనగృహ్ణాతి। ముష్టింబధ్నాతి । క్రందతి ఊర్ధ్వంనిరీక్షతే । బలింతస్య ప్రవక్ష్యామి యేనసంపద్యతేశుభం। నద్యుభయతటమృత్తికాంగృహీత్వా పుత్తళికాంకృత్వాగంధపుష్ప । తాంబూలం । రక్తచందనం । రక్తపుష్పం । రక్తసప్తధ్వజాః। సప్తప్రదీపాః । సప్తస్వస్తికాః । పక్షిమాంస । సురా అగ్రభక్తంచ దక్షిణస్యాందిశి । అపరాహ్ణే । చతుష్పథే బలిర్దాతవ్యః । శివనిర్మాల్య । గుగ్గులు । సర్షపనింబపత్రమేషశృంగైర్దినత్రయం

ధూపయేత్ ।ఓంనమోనారాయణాయ బాలస్యవ్యాధింహనహన। ముంచముంచ । గ్రాసయగ్రాసయస్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణంభోజయేత్ । తతస్సంపద్యతేశుభం ॥

తా॥ శిశువుజనించిన 3 వ సంవత్సరము 3 వ మాసము 3 వ దివసంబున పూతన యనుగ్రహంబు శిశువునకుసోకు. అగ్రహము సోకినతోడనే జ్వరమువచ్చుటయేగాక శరీరమువణుకుచు స్తన్యమునొల్లక చేతివ్రేళ్ళుముడిచికొని యేడ్చుటయేగాక మిడిగుడ్లిడి చూచుచుండుగాన నాగ్రహనివర్తనకై బలినివచించెద. యేటియిరుప్రక్కల యందుండు మృత్తికనుదెచ్చి ప్రతిమనుగావించి దానితో గంధము పుష్పము తాంబూలము రక్తచందనము రక్తపుష్పము యెఱ్ఱనిధ్వజములు 7 దీపములు 7 స్వస్తికములు 7 పక్షిమాంసము మద్యము శ్రేష్ఠంబైనయన్నము వీటినిగ్రహించి దక్షిణదిశకేగి 4 త్రోవలు గలిసెడిమార్గంబున పరాహ్ణకాలంబున బలినొసంగి శాంత్యుదకంబుచే శిశువును స్నానముజేయించి మొగిలిపువ్వు గుగ్గిలము ఆవాలు వేపాకు మేకకొమ్ము వీటిని చూర్ణముజేసి ధూపమువేసి ‘‘ఓంనమోనారాయణాయ బాలస్య వ్యాధిం హనహన ముంచముంచ గ్రాసయ గ్రాసయ స్వాహా’’ అను నీమంత్రంబును పూజావాహన బలుల యందుపయోగించవలయు. ఇటుల 3 దివసంబుగావించి 4 వ దివసంబున బ్రాహ్మణునికి అన్నంబిడిన నాశిశువునకు సోకిన పూతనయనుగ్రహము నివర్తించి శుభమువాటిల్లు.

వాక్యమ్॥ చతుర్థదివసేమాసేవర్షే వాగృహ్ణాతిముఖమండికా నామమాతృకా । తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతిజ్వరః। గ్రీవాంనామయతి । అక్షిణీ ఉన్మీలయతి । స్తన్యనంగృహ్ణాతి । రోదతి । స్వపితి । ముష్టింబధ్నాతి । బలింతస్య ప్రవక్ష్యామి యేనసంపద్యతేశుభమ్ । నద్యుభయతట మృత్తికాంగృహీత్వా పుత్తళికాంకృత్వా ఉత్పలపుష్పం । గంధంతాంబూలం । దశధ్వజాః । చత్వారః ప్రదీపాః । త్రయోదశస్వస్తికాః । మత్స్యమాంససురా అగ్రభక్తంచ । ఉత్తరస్యాందిశి అపరాహ్ణేచతుష్పథే బలిందద్యాత్ । ఆద్యమాసికోధూపః । ఓంనమోనారాయణాయ హనహన ముంచముంచస్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణంభోజయేత్ । తతస్సంపద్యతేశుభం ॥

తా॥ శిశువుపుట్టినట్టి 4 వ సంవత్సరము 4 వ మాసము 4 వ దివసంబున ముఖమండికయనుగ్రహము శిశువునకు సోకును. ఆగ్రహము సోకినతోడనే జ్వరము వచ్చుటయే గాక మెడద్రేలవేయుచు కంఠములెడిగుట్టిడి చనుగుడువక యేడ్చుచు నిద్రింపుచు హస్తములుద్రెళ్ళను ముడుచుకొనియుండు కావున నాగ్రహనివృత్తికై యేటియిరు పార్శ్వములయందలి మృత్తికనుదీసికొనివచ్చి ప్రతిమనుగావించి దానితోడ నల్లకలువ పుష్పములు గంధము తాంబూలము ధ్వజములు 10 దీపములు 4 స్వస్తికలు 13 మత్స్య మాంసము మద్యము శ్రేష్ఠంబైనయన్నము వీటిని గ్రహించి ఉత్తరదిశకేగి యందు 4 త్రోవలుగలిగెడిప్రదేశమున నపరాహ్ణకాలమందు బలినొసంగి శాంత్యుదకంబుచే శిశువునకు స్నానముజేయించి ప్రథమసంవత్సరమునకు జెప్పియుండెడి ధూపమునే వేయవలయు. "ఓంనమో నారాయణాయ హనహన ముంచముంచ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనంబులయందు ప్రయోగింపవలయు. ఈప్రకారము 3 దినంబులొనర్చి 4 వ దినంబున బ్రాహ్మణునికి అన్నంబిడిన నాశిశువునకు సోకియుండెడి ముఖమండికయనుగ్రహము నివృత్తియై శుభముకలుగు.

వాక్యమ్॥ పంచమేదివసేమాసేవర్షేవాగృహ్ణాతి । కటపూతనా నామమాతృకా । తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతిజ్వరః । గాత్రముద్వేజయతి । స్తన్యంనగృహ్ణాతి । ముష్టించబధ్నాతి । బలింతస్యప్రవక్ష్యామి యేనసంపద్యతేశుభం । కుంభకారచక్రస్య మృత్తికాం గృహీత్వా పుత్తళికాంనిర్మాయ గంధతాంబూలం । శుక్లోదనం।శుక్లపుష్పం।పఞ్చధ్వజాః।పఞ్చప్రదీపాః।పంచవటకాః। పశ్చాన్యాందిశి బలిర్దాతవ్యః । శాంత్యుదకేన స్నాపయేత్ । శివనిర్మాల్య సర్పనిర్మోక గుగ్గులు నింబపత్రబాలకంధృతైర్ధూపం దద్యాత్ । ఓం నమోనారాయణాయ అముకస్య వ్యాధిం చూర్ణయ చూర్ణయ హనహన స్వాహా॥ చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్ । తతస్సంపద్యతేశుభం ॥

తా॥ శిశువుప్రజనించిన 5 వ సంవత్సరము 5 వ మాసము 5 వ దివసంబున కటపూతనయనుగ్రహము శిశువునకుసోకు. ఆగ్రహముసోకినతోడనే జ్వరముగలుగుటయే గాక శరీరమువణకుచు స్తన్యపానంబొనర్పక చేతులుద్రెళ్ళుముడుచుకొనియుండు కావున నాగ్రహనివృత్తికై శిశువునకు శుభముగలిగెడి బలిని వచించెద. కుమ్మరవాని

చక్రమందలి మృత్తికనుతీసుకవచ్చి ప్రతిమనుగావించి దానితోడ గంధము తాంబూలము తెల్లనియన్నము తెల్లనిపుష్పాలు ధ్వజములు 5 దీపములు 5 పిండిపుంటలు 5 వీనిని గ్రహించి గృహముబయలువెడలి ఈశానదిశయందు బలినొసంగి శాంత్యుదకముచే బాలునిస్నానముజేయించి మొగిలిపువ్వు పాముకుసుము గుగ్గిలము వేపాకు వీటిని చూర్ణముజేసి యందు నెయ్యివేసికలిపి ధూపమిడి "ఓంనమోనారాయణాయ అముకస్యవ్యాధిం చూర్ణయ చూర్ణయ హన హన స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయందు ప్రయోగింపందగు. ఇటుల 3 దినంబులొనర్చి 4 వ దివసంబున బ్రాహ్మణునికి అన్నంబిడిన శిశువునకు సోకియుండెడి కటపూతనయను గ్రహము నివృత్తియై శుభంబుగలుగు.

వాక్యమ్॥ షష్ఠేదివసేమాసే వర్షేవా గృహ్ణాతిశకునికా నామ మాతృకా। తయాగృహీతామాత్రేణప్రథమంభవతిజ్వరః । గాత్రభేదంచ దర్శయతి । దివారాత్రౌ ఉత్థానంభవతి । ఊర్ధ్వం నిరీక్షతే । బలింతస్య ప్రవక్ష్యామి యేనసంపద్యతేశుభం । పిష్టగేన పుత్తళికాంకృత్వా । శుక్లపుష్పం । రక్తపుష్పం । పీతపుష్పం । గంధం । తాంబూలం । దశప్రదీపాః । దశధ్వజాః । దశస్వస్తికాః। దశముష్టికాః । దశవటకాః । క్షీరజంబూడికా మత్స్యమాంససురా ఆగ్నేయ్యాం దిశినిప్రాంతే మధ్యాహ్నే బలిందాపయేత్। శాంత్యుదకేన స్నాపయేత్ । శివనిర్మాల్య రసోన గుగ్గులు సర్పనిర్మోక నింబపత్ర ఘృతైర్ధూపందద్యాత్ । ఓంనమోనారాయణాయ చూర్ణయ చూర్ణయ హన హన స్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణంభోజయేత్ । తతస్సంపద్యతేశుభమ్ ॥

తా॥ శిశువుజనించిన 6 వ సంవత్సరము 6 వ మాసము 6 వ దినంబున శకునికయనుగ్రహము బాలునికిసోకు. ఆగ్రహముసోకినతోడనే జ్వరముగలుగుటయేగాక ఒడలు వివర్ణముగను దివారాత్రులయందు నిద్రింపకను కన్నులునిక్కబొడుచుకొనియుండుగాన నాగ్రహము నివృత్తియగుటకై పచ్చిపిండితో ప్రతిమనుగావించి దానితోడ తెల్లనిపువ్వులు ఎఱ్ఱనిపువ్వులు పచ్చనిపువ్వులు గంధము తాంబూలము దీపములు 10 ధ్వజములు 10 స్వస్తికలు 10 పిండిముద్దలు 10 పిండిపుంటలు 10 క్షీర

జంబూడికములు మత్స్యమాంసము మద్యము వీటినిదీసికొని గృహముబైలువెడలి విజన స్థలంబున నాగ్నేయదిశయందు మధ్యాహ్నంబున బలినొసంగి శాంత్యుదకముచే శిశువునకు స్నానముజేయించి మొగిలిపువ్వు వెల్లుల్లి గుగ్గిలము పాముకుసుము వేపాకు వీటిని చూర్ణముచేసి యందు నెయ్యిపైచి ధూపంబిడి “ఓంనమోనారాయణాయ చూర్ణాయ చూర్ణాయ హన హన స్వాహా” అను నీమంత్రంబును పూజావాహన బలులయందు ప్రయోగింపవలయు. ఇటుల 3 దినంబులుగావించి 4 వ దినంబు బ్రాహ్మణునికి అన్నంబొసంగిన శిశువుకు సోకియుండెడి శకునికయనుగ్రహము నివృత్తియై శుభముగలుగు.

వాక్యమ్॥ సప్తమేదివసేమాసేవర్షే వాయదాగృహ్ణాతి శుష్క రేవతీ నామమాతృకా । తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతి జ్వరః । గాత్రముద్వేజయతి । ముష్టింబధ్నాతి । రోదితి । బలింతస్య ప్రవక్ష్యామి । యేనసంపద్యతేశుభం । రక్తపుష్పం । శుక్లపుష్పం । గంధతాంబూలం । రక్తౌదనం । కృసరస్త్రియోదశ స్వస్తికాః । మత్స్యమాంస సురాస్త్రియోదశధ్వజాః । పంచ ప్రదీపాః । పశ్చిమదిగ్భాగేగ్రామసిపార్శ్వే అపరాహ్ణే వృక్షమాశ్రిత్య బలిందద్యాత్ । శాంత్యుదకేనస్నానం । గుగ్గులుమేష శృంగస్సర్ప ఉశీరఘృతైర్బాలకంధూపయేత్ । ఓంనమోనారాయణాయ దీప్తతేజసే హనహన । ముంచ ముంచ స్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణంభోజయేత్ । తతస్సంపద్యతేశుభం॥

తా॥ బాలుండుద్భవిల్లిన 7 వ సంవత్సరము 7 వ మాసము 7 వ దివసంబున శుష్కరేవతియనుగ్రహము బాలునికిసోకు ఆగ్రహముసోకినతోడనే జ్వరముగలుగుటయేగాక ఒడలువణకుచు వేళ్లుముడుచుకొని యేడ్చుచుండుగాన నాగ్రహనివర్తికై రక్తపుష్పములు తెల్లనిపుష్పములు గంధము తాంబూలము రక్తాన్నము పులగము స్వస్తికములు 13 మత్స్యము మాంసము ధ్వజములు 13 దీపములు 5 వీటినిదీసికొని గ్రామము బయలువెడలి నిర్మానుష్యంబగు ప్రదేశమునందలి యేదైన నొకవృక్షంబు నాశ్రయించి మధ్యాహ్నంబున బలినొసంగి పిదప బాలునికి శాంత్యుదకంబుచే స్నానముజేయించి గుగ్గిలము మేకకొమ్ము తెల్లఆవాలు వట్టివేళ్ళు వీటిచూర్ణములో నెయ్యిచేర్చి ధూపమిడి “ఓంనమోనారాయణాయ దీప్తతేజసే హనహన ముంచముంచ స్వాహా” అను

నీమంత్రంబును పూజావాహన బలులయందు ప్రయోగింపందగు. ఇటులచేసిన బాలునికి సోకియుండెడి శుష్కరేవతియను గ్రహము నివర్తియై శుభంబుగలుగు.

వాక్యమ్॥ అష్టమేదివసేమాసే వర్షేవాయదిగృహ్ణాతి అర్యకా నామ మాతృకా । తయా గృహీతమాత్రేణ ప్రథమం భవతి జ్వరః। గృధ్రిగన్ధపూతిగంధశ్చజాయతే । ఆహారంచన గృహ్ణాతి । ఉద్వేజయతిగాత్రాణి । బలింతస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం । రక్తపీతధ్వజాః । చదనంపుష్పం । శష్కుల్యః । పర్పటికాః । మత్స్యమాంస సురాజం బూడికాః । ప్రత్యూషే బలిర్ధేయః ప్రాతరే । మంత్రః । ఓంనమోనారాయణాయ చతుర్దశమోక్షణాయ వ్యాధిం హన హన ముంచముంచ । దహదహ ఓం హ్రీం ఫట్ స్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్। తతస్సంపద్యతేశుభం ॥

తా॥ శిశువుజనించిన 8 వ సంవత్సరము 8 వ మాసము 8 వ దినంబున అర్యకయనుగ్రహము బాలునికిసోకు. ఆగ్రహముసోకినతోడనే జ్వరము గలుగుటయేగాక శరీరము గృధ్రిగంధంబైనను దుర్గంధంబైనను గలిగి ఆహారమును భుజింపక దేహము వణుకుచుండు కావున నాగ్రహము నివృత్తికై ఎఱ్ఱగను పచ్చగనునుండెడి ధ్వజములు చందనము పుష్పములు చక్కిలములు పర్పటియను భక్ష్యములు మత్స్యమాంసము మద్యము జంబూడికములు వీటినిదీసికొని గృహము వెలువెడలి గ్రామప్రాంతంబున నరుణోదయకాలంబున బలినొసంగి బాలునకు శాంత్యుదకముచే స్నానముజేయించి ధూపము వేయవలయు. మఱియు „ ఓంనమోనారాయణాయ చతుర్దశమోక్షణాయ వ్యాధింహనహన ముంచ ముంచ దహదహ ఓంహ్రింఫట్ స్వాహా " అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఈప్రకారము 3 దినంబులు గావించి 4 వ దినసంబున బ్రాహ్మణునికి అన్నంబిడిన సోకియుండెడి నాఅర్యకయనుగ్రహము నివృత్తియై శుభంబుగలుగు.

వాక్యమ్॥ నవమేదివసేమాసే వర్షేవాగృహ్ణాతి భూసూతికా నామమాతృకా । తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతిజ్వరః। సతతంచధర్భవతి । గాత్రభేదంచర్ధయతి । ముష్టింబధ్నాతి । బలిం

తస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం । నద్యుభయతట మృత్తికాం గృహీత్వాపుత్తళికాం నిర్మాయశుక్లవస్త్రేణవేష్టయేత్ । శుక్లపుష్పంగంధతాంబూలంశుక్లత్రయోదశధ్వజాః । త్రయోదశ దీపాః । త్రయోదశ స్వస్తికాః త్రయోదశ పుత్తళికాః । త్రయోదశమత్స్యపుత్తళికాః । మత్స్యమాంససురాః । ఉత్తరదిగ్భాగే గ్రామనిష్క్రాసే బలిందద్యాత్ । శాంత్యుదకేనస్నానం । గుగ్గులు నింబపత్ర గోశృంగ శ్వేతసర్షప ఘృతైర్ధూపందద్యాత్ ॥ మన్త్రః॥ ఓం నమోనారాయణాయ చతుర్భుజాయ హనహన ముంచ ముంచ స్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణం భోజయేత్ । తత స్సంపద్యతే శుభం ॥

తా॥ బాలుడుద్భవిల్లిన 9 వ వత్సరము 9 వ మాసము 9 వ దినమునందు భూసూతికయను గ్రహము బాలునికిసోకినతోడనే జ్వరము పలుమారు వాంతి ఇవి గలుగుటయేగాక శరీరము వివర్ణంబై చేతులు వ్రేళ్ళు ముడుచుకొనియుండు. కావున నాగ్రహము నివృత్తియై బాలునికి శుభమునుగలిగెడి బలినివచించెద. యేటియిరు ప్రక్కలయందలి మృత్తికనుతెచ్చి ప్రతిమగావించి దానిని తెల్లవస్త్రముచేగప్పి దాని తోడ తెల్లనిపుష్పములు గంధము తాంబూలము తెల్లనిధ్వజములు 13 దీపములు 13 స్వస్తికలు 13 పచ్చిపిండిచే జేయబడిన చిన్నబొమ్మలు 13 మత్స్యాకారముగలబొమ్మలు 13 మత్స్యమాంసము మద్యము వీటినన్నిటినితీసుకొని గృహముబయలువెడలి ఉత్తర దిశయందు నిర్మానుష్యప్రదేశంబున బలినొసంగి శాంత్యుదకముచే బాలునికిస్నానము చేయించి గుగ్గిలము వేపాకు ఆవుకొమ్ము తెల్లఆవాలు వీట్లను చూర్ణముజేసి యందొకింత నెయ్యికలిపి ధూపమువేసి "ఓంనమోనారాయణాయ చతుర్భుజాయ హనహన ముంచముంచ స్వాహా" అను నీమంత్రముచే పూజావాహనబలులయం దుపయోగింప వలయు. ఇటుల 3 దినంబులుగావించి 4 వ దినంబున బ్రాహ్మణునికి అన్నంబొసంగ వలయు. ఇట్లొనర్చిన బాలునకు సోకియుండెడి భూసూతికయను గ్రహమునివృత్తియై శుభముగలుగు.

వాక్యమ్॥ దశమేవదివసేమాసే వర్షేవాగృహ్ణాతి నిర్ఋతీనామ మాతృకా । తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతిజ్వరః । గాత్ర

ముద్వేజయతి । అత్యాకారం కరోతి । రోదితి । మూత్రంపురీషంచ భవతి । బలింతస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం । పారావారమృత్తికాం గృహీత్వా పుత్తళికాంనిర్మాయ గంధతాంబూలం। రక్తపుష్పం । రక్తచందనం । పఞ్చవర్ణధ్వజాః । పఞ్చప్రదీపాః । పఞ్చస్వస్తికాః । పఞ్చపుత్తళికాః। మత్స్యమాంససురాః।వాయవ్యాందిశి బలిందద్యాత్ । కాకవిష్ఠా గోమాంస గోశృంగ రసోన మార్జారరోమ నింబపత్రఘృతై ర్ధూపయేత్ । ఓంనమోనారాయణాయ చూర్ణితహస్తాయ ముంచ ముంచ స్వాహా । చతుర్థదివసే బ్రాహ్మణంభోజయేత్ । తతస్సుస్థోభవతిబాలకః ॥

తా॥ బాలుడుజనించిన 10 వ సంవత్సరము 10 వ మాసము 10 వ దివసమున నిర్రృతియనుగ్రహము బాలునకుసోకు. ఆగ్రహము సోకినతోడనే జ్వరమువచ్చుటయేగాక శరీరముపణుకును ఆత్కారముచేయుచు యేడ్చుచు మిక్కిలి మూత్రపురీషోత్సర్జనంబులగావించుచుండు. కావున నబ్బాలునికి సోకినగ్రహము నివృత్తియై శుభముగలిగెడి బలినివచించెద. సముద్రతటంబునందలి మృత్తికనుదెచ్చి ప్రతిమనుగావించి దానితోడ గంధము తాంబూలము రక్తపుష్పము చందనము 5 వర్ణములుగలధ్వజములు 5 దీపములు 5 స్వస్తికములు 5 పచ్చిపిండిబొమ్మలు మత్స్యమాంసము మద్యము వీటినిదీసుకొని గృహముబయలువెడలి వాయవ్యదిశయందు బలినొసర్చి పిదప శాంత్యుదకముచే బాలునికి స్నానముజేయించి కాకిమలము గోమాంసము ఆవుకొమ్ముల చూర్ణము వెల్లుల్లి పిల్లివెంట్రుకలు వేపాకుచూర్ణము నెయ్యి వీటినిచేర్చిధూపమువేసి "ఓంనమోనారాయణాయ చూర్ణితహస్తాయ ముంచ ముంచ స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగింపవలయు. ఇటుల 3 దినములుగావించి 4 వ దినంబున బ్రాహ్మణుని కన్నంబొసంగిన నిర్రృతియనుగ్రహము నివృత్తియై బాలునకు శుభముగలుగు.

వాక్యమ్॥ యేకాదశే దివసేమాసే వర్షేవాయదిగృహ్ణాతి పిలిపిచ్ఛికానామమాతృకా। తయాగృహీతమాత్రేణ ప్రథమంభవతి జ్వరః । ఆహారంన గృహ్ణాతి । ఊర్ధ్వదృష్టి ర్భవతి । గాత్రభంగో భవతి । బలింతస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతేశుభమ్ । పిష్ట

కేనపుత్తళికాంకృత్వా । రక్తచందనంరక్తంచ తస్యాముఖందుగ్ధేన పించేత్ । పీతపుష్పం । గంధతాంబూలం । సప్తపీతధ్వజాః । సప్త దీపాః । అష్టావడకాః । అష్టౌశష్కులికాః । అష్టాపూరికాః । మత్స్యమాంససురాః । పూర్వస్యాందిశిబలిర్దాతవ్యః । శాంత్యుదకేనస్నానం । శివనిర్మాల్యగుగ్గులు గోశృంగసర్పనిర్మోక ఘృతైర్ధూపయేత్ । ఓం నమోనారాయణాయ ముంచముంచస్వాహా । చతుర్థదివసేబ్రాహ్మణంభోజయేత్ । తతస్స్వస్థోభవతిబాలకః ॥

తా॥ బాలుండుద్భవిల్లిన 11 వ సంవత్సరము 11 వ మాసము 11 వ దినమున పిలిపిచ్చికయనుగ్రహము బాలునకుసోకు ఆగ్రహము సోకినతోడనే జ్వరమువచ్చుటయే గాక ఆహారమునొల్లక పైచూపుజూచుచు వొడలు విరుచుచుండుగాన నాగ్రహనివర్తియై బలినివచించెద. పచ్చిపిండితో ప్రతిమనుగావించి దానిముఖమువీద పాలలో రక్తము రక్తచందనము పీటెనికలిపి చిలికించవలయు. పిదప యాబొమ్మతోడ పచ్చని పువ్వులు గంధము తాంబూలము పచ్చనిధ్వజములు 7 పిండివుంటలు 7 చక్కిలములు 8 పూరీలు 8 మత్స్యమాంసము మద్యము వీటిని దీసుకొని గృహముబైలునెడలి పూర్వదిశయందు బలినొసర్చి శాంత్యుదకముచే బాలునికి స్నానముచేయించి మొగిలిపువ్వు గుగ్గిలము ఆవుకొమ్ము పాముకూసను వీటిని చూర్ణముచేసి యందు కొంచము నెయ్యి కలిపి ధూపమిడి "ఓంనమోనారాయణాయ ముంచముంచస్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయం దుపయోగించవలయు. ఇటుల 3 దినంబులు గావించి 4 వ దినము బ్రాహ్మణులకు అన్నంబిడిన నాపిలిపిచ్చికయను గ్రహము నివృత్తియై శుభముగలుగు.

వాక్యమ్॥ ద్వాదశేదివసేమాసే వర్షేవాయదిగృహ్ణాతి కామునానామమాతృకా । తయాగృహీతమాత్రేణప్రథమంభవతిజ్వరః। విహాస్యవాదయతి । కరేణవర్జయతి । గృహ్ణాతి । క్రామతివిశ్వసితి ముహుర్ముహు రాహారంనకరోతి । బలింతస్య ప్రవక్ష్యామి యేన సంపద్యతేశుభం । క్షీరేణ పుత్తళికాంకృత్వా । గంధం । తాంబూలం। శుక్లపుష్పం। శుక్లసప్తధ్వజాః । సప్తప్రదీపాః । సప్త పూరికాః।కరస్థేనదధిభక్తేన । సర్వకర్మబలిందద్యాత్।శాన్త్యుదకేన

స్నాపయేత్ । శివనిర్మాల్యగుగ్గులసర్షపఘృతైర్ధూపయేత్ । ఓం నమోనారాయణాయముంచముంచహనహన స్వాహాచతుర్థదినసే బ్రాహ్మణంభోజయేత్ । తతస్సుస్థోభవతిబాలకః ॥

తా॥ బాలుడుజనించిన 12 వ సంవత్సరము 12 వ మాసము 12 వ దివసంబున కాముకయనుగ్రహము బాలునకుసోకు ఆగ్రహముసోకినతోడనే జ్వరముగలుగుటయ గాక పిచ్చిపట్టినవానివలెనవ్వుచు మాటలాడుచు చేతులతోనేమైన నొకవస్తువును పట్టుచు విడుచుచు పరుగులిడుచు నిట్టూర్పులిడుచుచు ఆహారమునందిచ్ఛలేకయుండు గాన నాగ్రహనివర్తికై బలినిజెప్పెద. పచ్చిపిండిలో పాలుపైచికలిపి ప్రతిమను గావించి దానితోడ గంధము తాంబూలము తెల్లనిపువ్వులు తెల్లనిధ్వజములు 7 దీపములు 7 పూరీలు 7 పెరుగన్నము వీటినిదీసికొని గృహముబయిలువెడలి బలినియిచ్చి శాంత్యుదకముచే బాలునికి స్నానముజేయించి మొగిలిపువ్వ గుగ్గిలము తెల్లఆవాలు వీటిని చూర్ణముజేసి అందునెయ్యిపైచి ధూపమువేసి "ఓంనమోనారాయణాయ ముంచ ముంచ హన హన స్వాహా" అను నీమంత్రంబును పూజావాహనబలులయందుపయోగించవలయు. ఇటుల 3 దినంబులుగావించి 4 వ దినమున బ్రాహ్మణులకు అన్నంబొసంగిన బాలునికి సోకియుండెడి కాముకయనుగ్రహము నివర్తియగు. ఇది రావణునికృతము.

బాలగ్రహపీడ కలుగుటకు కారణము.

శ్లో॥ బాలగ్రహా అనాచారా త్పీడయంతి శిశుంయతః ।
తస్మాత్తదుప సర్గేభ్యో రక్షేద్బాలం ప్రయత్నతః ॥

తా॥ శిశువులకు తల్లితండ్రుల అనాచారమువలన బాలగ్రహంబులుసోకుగాన అట్టిదోషంబులు శిశువునకు జెందనివ్వకుండునటుల యత్నించవలయు.

సామాన్య గ్రహపీడ లక్షణము.

శ్లో॥ క్షణాదుద్విజతేబాలఃక్షణాత్త్రస్యతిరోదితి । నఖైర్దంతైర్దారయతి ధాత్రీమాత్మానమేవచా । వూర్ధ్వం నిరీక్షతేదంతాన్ ఖాదేత్కూజతిజృంభతే । భృవౌక్షి పతిదంతోష్ఠం ఫేనం వమతిచాసకృత్ । క్షామోతినిశిజాగర్తిశూనాంగోభిన్నవిట్

ఖాః । మాంసశోణిత గంధశ్చ నచాశ్నాతి యథాపురా ।
సామాన్యగ్రహజుష్టానాంలక్షణంసముదాహృతం ॥

తా॥ ఉలికిపడుట యేడ్చుట భయపడుట నఖములచే తల్లిని తన్నుగీరుకొనుట పలుమారు పైకిచూచుట పండ్లుకొరుకుట కేకలిడుట ఆవలించుట కనుబొమలు పెదవులు వీటిని యెగరవేయుట పలుమారు నురుసకక్కుట చిక్కిపోవుట రాత్రుల యందు నిదురలేకయుండుట వాపుకలుగుట మలము పలచగపడుచుట శరీరము గరగర లాడుట మాంసము రక్తము నీటివాసనగలుగుట ఆహారమునందిచ్ఛ లేకయుండుట యిట్టిలక్షణములచే బాలులకు పూతనాది నవగ్రహములలో నేదోనొక గ్రహము సోకిన దని తెలియంగవలయు. ఇదియ సామాన్యలక్షణము.

స్కందగ్రహ గృహీత లక్షణము.

శ్లో॥ ఏకనేత్రస్యగాత్రస్యస్రావస్పందనకంపనం ।
అర్ధదృష్ట్యానిరీక్ష్యేతవక్త్రాస్యోరక్తగంధికః ।
దంతాన్ఖాదతివిత్రస్తః స్తన్యంనైవాభినందతి ।
స్కందగ్రహగృహీతానాంరోదనంచాల్పమేవచ ॥

తా॥ ఒకనేత్రమునందు నీరుకారుట శరీరము నొకకాలమున యించుకచలించుట మఱియొకకాలమున కంపించుట అర్ధదృష్టితోచూచుట నోరు ముఖము వీటి యందు రక్తగంధము గలిగియుండుట పండ్లు పటపట కొరుకుట శరీరము శుష్కించుట స్తన్యమునందిచ్ఛలేకయుండుట ఇట్టిలక్షణములచే బాలులకు స్కందగ్రహము సోకినదని యెఱుంగవలయు.

స్కందగ్రహ చికిత్స.

శ్లో॥ సోమవల్లీమింద్రవృక్షంబృహతీంబిల్వజేశమీ ।
మృగాదన్యాశ్చమూలానిగ్రథితానివిదారయేత్ ॥

తా॥ తెల్లకొడిశపాల ఇంద్రవృక్షము చిన్నములక బిల్వఫలము జమ్మి శివంగి వీటివేళ్లను సరముగా దారమునందుకట్టి మెడయందు ధారణచేసిన స్కందగ్రహము తొలగును.

అన్యచ్చ.

శ్లో॥ స్కందగ్రహేణాపసృష్టస్యకుమారస్యప్రశస్యతే ।
వాతఘ్నద్రుమపత్రాణాంక్వాథేనపరిషేచనం ॥

తా॥ వాతనాశకమగు వృక్షములయొక్క ఆకులు నుదకమునందుడైచి కాచి బాలునికి స్నానముజేయించిన స్కందగ్రహము తొలఁగు.

అన్యచ్చ.

శ్లో॥ దేవదారుణిరాస్నాయాంమధురేషుగణేషుచ ।
సిద్ధంవిసర్పిశ్చసక్షీరంపాతుమస్మై ప్రదాపయేత్ ॥

తా॥ దేవదారు సన్నరాష్ట్రియు మధురగణములయందుండెడి వస్తువులను కల్కముజేసి నాకల్కమునకు నాలుగింతలనెయ్యి నెయ్యికి నాలుగింతలు క్షీరముపైచి ఘృతపక్వముగవండి నాఘృతమును బాలునికిచ్చిన స్కందగ్రహము తొలఁగు.

అన్యచ్చ.

శ్లో॥ సర్షపాన్సర్పనిర్మోకోవచాకాకాదనీఘృతం ।
ఉష్ట్రాజావిగవాంచాపిరోమాణ్యుత్థూపనంభవేత్ ॥

తా॥ తెల్లఆవాలు పాముకూసము వస తెల్లగురిగింజ ఒంటె గొఱ్ఱె మేక ఆవు వీటివెంట్రుకలు నెయ్యి వీటినన్నియుజేర్చి బాలునికిధూపమిడిన సోఁకియుండెడి స్కందగ్రహము తొలఁగు.

శ్లో॥ మృగాదన్యాశ్చ మూలాని గ్రథితాని విధారయేత్ ॥

తా॥ శివంగివేరును దారములోకట్టి బాలుని మెడలోధరింపజేసిన సోఁకియుండెడిగ్రహము తొలఁగు.

సర్వగ్రహ ధూపము.

శ్లో॥ యస్త్వాంమహూడవిహగో భయపార్శ్వ ఏ పక్షపుచ్ఛేచ్ఛర్గవాజ్య
సహితైఃకృతధూపనోంగే । ఆరభ్యజన్మదివసాద్దినసప్తకంహి
బాలస్యతస్యసకలశ్చఖభీతిరస్తి ॥

తా॥ కోడికి యిరుప్రక్కలయుండెడి రెక్కలు తోక ఆవునెయ్యి వీటిని ఏకముగచేర్చి బాలుని జన్మదివసము మొదలు 7 దినములవరకు ధూపమిడిన గ్రహబాధ యెన్నియు తొలఁగు.

## స్కందాపస్మార లక్షణము.

శ్లో॥ నష్టసంజ్ఞో వమేత్ఫేనంసంజ్ఞావానతిరోదితి ।
పూయశోణితగంధత్వంస్కందాపస్మారలక్షణం ॥

తా॥ బాలుఁడు కొంతకాలము తెలివిలేకయుండుట కొంతకాలము తెలివిగ నుండుట మిగుల రోదనమొనర్చుట నోటియందు నురుగుకక్కుట శరీరమందు చీము రక్తము వీటివాసన గలిగియుండుట ఇట్టిలక్షణములచే స్కందాపస్మార గ్రహము సోకినదని యెఱుంగవలయు.

## స్కందాపస్మార చికిత్స.

శ్లో॥ బిల్వశ్శిరీషకోలోమినాసురసాదిశ్చయోగణః ।
పరిషేకేప్రయోక్తవ్యం స్కందాపస్మారనాశనం ॥

తా॥ బిల్వము దిరిశినపుఅకు తెల్లగరిక సురసాదిగణమునందు పఠించినవస్తువులు వీట్లను ఉదకమునందువైచికాచి బాలునికి స్నానము జేయించిన స్కందాపస్మార గ్రహము తొలఁగు.

## సురసాదిగణ వివరణము.

శ్లో॥ సురసాశ్వేతసురసాఫణ్ణిజ్జకః । సౌగంధికంభూస్తృణకంరాజికాశ్వేతబర్బరీ । కట్ఫలంఖరపుష్పాచ కాసమర్దశ్చశల్లకీ । విడంగమథనిర్గుండీకణ్ణికారఉదుంబరః। బలాచకాకమాచీచ తథాచవిషముష్టికా । కఫఃక్రిమిహరఃఖ్యాతః సురసాదిరయంగణః । అష్టమాత్రేవిపక్వంచతైలమభ్యంజనేహితం ॥

తా॥ నల్లవావిలి తెల్లవావిలి అగరుశొంఠి ఫంజి మరువము కామంచిగడ్డి భూస్తృణకం తెల్లఆవాలు తులసి కాయఫలము అడవితులసి కసివెందచెట్టు శల్లకి వాయువిడంగములు వావిలి గుంటగలగర అత్తిచిట్టాముట్టి కాచి విషముష్టి (ఇవిసురసాదిగణము. ఇందు పఠించిన వస్తువులను తిలతైలమునందువైచి కాచి సిద్ధమైన తైలమును

బాలుని శరీరమునకు లేపనముజేసిన కఫము క్రిమి ఇవిహరించుటయగాక స్కందాప స్మార గ్రహము తొలగు.

## స్కందాపస్మార గ్రహధూపము.

శ్లో॥ ఉత్పాదనంవచాహింగుముస్తమత్రప్రకీర్తితం ।
గృధ్రోలూకపురీషాణికేశాఅస్థినఖంఘృతం ।
వృషభస్యచరోమాణియోజ్యానుద్ధూపనేసదా ॥

తా॥ లొద్దుగచెక్క ఇంగువ తుంగముస్తెలు గద్ద గూబ వీటిమలము వెంట్రుకలు యెముకలు గోళ్లు నెయ్యి యెద్దుయొక్కరోమములు వీట్లను బాలునికి ధూపము వేశిన స్కందాపస్మారగ్రహము నివారణమగును.

## స్కందాపస్మార గ్రహమునకు రక్ష.

శ్లో॥ వచాంవయస్థాంజటిలాంగోలోమీంచాపిధారయేత్ ।
ఉత్పాదనంహితంచాత్రస్కందాపస్మారనాశనం ॥

తా॥ వస తిప్పతీగె జటామాంసి తెల్లగరిక వీటిని బాలురకు ధారణము చేసిన స్కందాపస్మారగ్రహము తొలగు.

## స్కందాపస్మార గ్రహమునకు రెండవరక్ష.

శ్లో॥ అనంతాకుక్కుటీబింబీ మర్కటీచాపిధారయేత్ ॥

తా॥ తీటకసింద బూరుగ దొండ కానుగ వీట్లను సూత్రముతోబంధించి రక్ష కట్టిన స్కందాపస్మారగ్రహము నివర్తియగు.

## శకునీగ్రహ లక్షణము.

శ్లో॥ స్రస్తాంగోభయః చకితోవిహంగగంధి స్రావవ్రణ పరిపీడితః
సమంతాత్ । స్ఫోటైశ్చప్రచితతనుః సదాహపాకైర్విజ్ఞేయో
భవతిశిశుఃక్షతఃశకున్యా॥

తా॥ శరీరము శైథిల్యమునుబొందుట భయమువలన క్షణక్షణము వులికిపడుట పక్షులశరీరమునందుండెడి వాసనగలుగుట సర్వాంగమందు స్రావముతోగూడిన వ్రణములుగలుగుట శరీరమంతయు బొబ్బలునిండియుండుట యెల్లపుడు దాహపాక యుక్త

మైన కురుపులుగలుగుట ఇట్టిలక్షణములు గలిగియుండెనేని శిశువునకు శకునిగ్రహము సోకినదని నెరుంగవలయు.

ధూపము.

శ్లో॥ స్కందగ్రహోక్తధూపశ్చహితాహ్యత్రభవంతిహి ।
స్కందాపస్మారశమనం ఘృతమత్రాపిపూజితం ॥

తా॥ స్కందగ్రహమునందు జెప్పంబడిన ధూపము ఘృతపానము వీటిని బాలునికిజేయించిన శకునిగ్రహము తొలఁగు.

శకునిగ్రహ రక్ష.

శ్లో॥ శతావరీమృగోర్వారునాగదంతీనిదిగ్ధికాః ।
లక్ష్మణాంసహదేవాంచ బృహతీంచాపిధారయేత్ ॥

తా॥ చల్లగడ్డ కస్తూరి నాగదంతి వాకుడు లక్ష్మణమూలను సహదేవి పెద్దములుక వీటిని బాలునికిరక్షకట్టిన శకునిగ్రహము నివర్తియగు.

శకునిగ్రహమునకు స్నానము.

శ్లో॥ శకునిగ్రహదృష్టస్య కార్యంవైద్యేనజానతా ।
వేతసామ్రకపిత్థానాం క్వాథేనపరిషేచనం ॥

తా॥ శకునిగ్రహపీడితుడయినబాలునికి కుశలవైద్యులు ప్రబ్బలి మామిడివెలగ వీట్లను ఉదకమునందువైచికాచి బాలునికి స్నానముచేయించిన శకునియను గ్రహము తొలఁగు.

శకునిగ్రహమునకు లేపనము.

శ్లో॥ హ్రీబేరమధుకోశీర సారివోత్పలపద్మకైః ।
లోధ్రప్రియంగుమంజిష్టగైరికైఃసంలిపేత్ శుభం ॥

తా॥ కురువేరు అతిమధురము వట్టివేరు సుగంధపాల నల్లకలువ పద్మకాష్ఠము లొద్దుగచక్క కొఱ్ఱబియ్యము మంజిష్ట కావిరాయి వీటినినూరి బాలునిశరీరమునకు లేపనముజేసిన శకునిగ్రహము నివర్తియగు.

## రేవతీగ్రహ లక్షణము.

శ్లో॥ వ్రణైఃస్ఫోటైశ్చితంగాత్రం పంకగంధమసృక్స్రవేత్ ।
భిన్నవర్చాజ్వరోదాహః రేవతీగ్రహలక్షణం ॥

తా॥ రేవతీగ్రహగ్రస్తమైన బాలునికి శరీరమంతయు కురుపులు బొబ్బలు వీటిచే వ్యాప్తమై అందువెడలెడి రక్తము బురదవాసన గలియుండుటయగాక భేదులు జ్వరము తాపము ఇవిసగా జనించు.

## రేవతీగ్రహమునకు స్నానము.

శ్లో॥ అశ్వగంధాజశృంగీచ సారివాథపునర్నవా ।
సహావిదారీహ్యేతాసాంక్వాథేనపరిషేచనం ॥

తా॥ పెన్నేరుగడ్డ పొడ్డపట్ట సుగంధపాల గలిజేరు ముత్తవపులగము నేలగుమ్మడు వీటిని నీటియందువైచికాచి శిశువునకు స్నానముచేయించిన రేవతీగ్రహము నివర్తియగు.

## రేవతీగ్రహమునకు ధూపము.

శ్లో॥ కులత్థశంఖచూర్ణంచప్రదేయఃపూర్వగంధికః ।
గృధ్రోలూకపురీషాణియవాన్యపఫలోద్ధృతం ।
సంధ్యయోరుభయోః కార్యమేతదుద్ధూపనంశిశోః ॥

తా॥ ఉలవలు శంఖము వీటిని చూర్ణముచేసి శరీరమునకు ధూళితముచేసి పిదప గద్ద గూబ వీటిమలము యవలు వీటిని సాయంప్రాతఃకాలములయందు బాలునికి ధూపమిడిన రేవతీగ్రహము నివర్తియగు.

## పూతనాగ్రహ లక్షణము.

శ్లో॥ అతీసారోజ్వరస్తృష్ణాతిర్యక్ప్రేక్షణరోదనం ।
నష్టనిద్రస్తథోద్విగ్నఃగ్రస్తపూతనయాశిశుః ॥

తా॥ పూతనాగ్రహగ్రస్తమయిన బాలునికి భేదులు దప్పి జ్వరము వారచూపు రోదనము నిద్రలేకయుండుట వ్యాకులముపొందుట కృశించుట యిట్టిలక్షణములు గలిగియుండిన నది పూతనాగ్రహలక్షణమని యెఱుంగవలయు.

## పయస్యాది తైలము.

శ్లో॥ నవాపయస్యాగోలోమీహారితాలంమనశ్శిలా।
కుష్ఠంసర్జరసశ్చైవతైలార్థేకల్కఇష్యతే।
హితంఘృతంతుగాక్షీర్యాసంసిద్ధంమధునాపిచ॥

తా॥ పిన్నపాల తెల్లగరిక తాళకము మనుశిల చెంగల్వకోష్ఠు గుగ్గిలము వీటిని కల్కముజేసి తిలతైలమునందువైచికాచి నాతైలము బాలుని శరీరమునకు లేపనముజేసి నను వెదురుప్పుకల్కమునందు ఘృతము సిద్ధపరచి తేనెచేర్చి పానముజేయించినను పూతినాగ్రహము నివర్తియగు.

## పూతనాగ్రహ ధూపము.

శ్లో॥ కుష్ఠతాలీసఖదిరం చందనంస్యందనంతథా।
దేవదారువచాహింగు కుష్ఠంగిరికదంబకం।
యేలాహరేణువశ్చాపి యోజ్యావృద్ధూపనేసదా॥

తా॥ చెంగల్వకోష్ఠు తాళిసపత్రి నల్లతుమ్మపట్ట చందనము స్యందనము దేవదారు వస ఇంగువ కంకుష్ఠము కొండకడప ఏలకులు రేణుకబీజములు వీటిని బాలునికి ధూపమిడిన పూతనాగ్రహము నివర్తియగు.

## అంధపూతనాగ్రహ లక్షణము.

శ్లో॥ ఛర్దిఃకాసోజ్వరస్తృష్ణావసాగంధోతిరోదనం।
స్తన్యద్వేషోతిసారశ్చఅంధపూతనయాభవేత్॥

తా॥ వాంతి దగ్గు జ్వరము దప్పి శరీరమునందువాసన స్తన్యద్వేషము భేదులు ఇవి బాలునికి కలిగినేని అంధపూతనాగ్రహము సోకినదని యెరుంగవలయు.

## అంధపూతనాగ్రహమునకు స్నానము.

శ్లో॥ తిక్తద్రుమాణాంపత్రైస్తుక్వాథఃకార్యోభిషేచనే॥

తా॥ చేదుగలఆకులు ఉదకములోవైచికాచి బాలునికి స్నానము జేయించిన అంధపూతనాగ్రహము నివర్తియగు.

## తిక్తపంచ గణము.

శ్లో॥ బిల్వఃపటోలంక్షుద్రాచగుడూచీవాసకాస్తథా ।
విసర్పకుష్ఠనుత్ప్రాక్తోగణోయంపంచతిక్తః ॥

తా॥ (పంచతిక్తగణమనగా) బిల్వము చేదుపొట్ల ములక తిప్పతీగె అడ్డసరము ఇవి విసర్పము కుష్ఠువు వీటిని పోగొట్టును.

## పురీషాది ధూపము.

శ్లో॥ పురీషంకౌక్కుటంకేశాశ్చర్మసర్పభవంతథా ।
జీర్ణంచవీక్ష్యయోవాసోధూపనాయోపకల్పయేత్ ॥

తా॥ కోడిపెంటికలు వెంట్రుకలు పాముకుసుము పాతగుడ్డ వీటిచే బాలునికి ధూపమిడిన అంధపూతనాగ్రహము తొలగును.

## శీతపూతనాగ్రహ లక్షణము.

శ్లో॥ వేపతేకాసతేక్షీణోనేత్రరోగోవిగంధితా ।
చ్ఛర్ద్యతీసారయుక్తశ్చశీతపూతనయాశిశుః ॥

తా॥ వణుకు దగ్గు క్షీణించుట నేత్రరోగము శరీరమునందు వాసన వాంతి అతిసారము ఇట్టిలక్షణములు బాలునికి గలిగియుండెనేని శీతపూతనాగ్రహము సోకినదని యెరుంగవలయు.

## రోహిణ్యాది ఘృతము.

శ్లో॥ రోహిణీనింబఖదిరపలాశకకుభత్వచః ।
నికాథ్యతస్మిన్నిక్వాథేసక్షీరంవిపచేత్ఘృతం ॥

తా॥ కటుకరోహిణి వేప చండ్ర మోదుగ అర్జునవృక్షము వీటిపట్టలను కషాయముబెట్టి అందు పాలు నెయ్యివైచి ఘృతపక్వముగకాచి శిశువుకు పానము చేయించిన శీతపూతనాగ్రహము నివర్తియగు.

## గృధ్రాది ధూపము.

శ్లో॥ గృధ్రోలూకపురీషాణీబస్తగంధామహిత్వచం ।
నింబపత్రాణిచతథాధూపనార్థంసమాహరేత్ ॥

తా॥ గద్ద గూబ వీటిమలమును అడవితులసి పాముకూసము వేపాకు వీటిచే బాలునికి ధూపమిడిన శీతపూతనాగ్రహము తొలగు.

### ముఖమండికాగ్రహ లక్షణము.

శ్లో॥ ప్రసన్నవర్ణవదనశ్శిరాభిరభిసంవృతః ।
మూత్రగంధిశ్చబహ్వాశీముఖమండికయాభవేత్ ॥

తా॥ ప్రసన్నమగు వర్ణము ముఖము ఇవి గలిగియుండుట శరీరమునందు నరములువ్యాపించియుండుట శరీరము మూత్రపువాసన గలిగియుండుట ఆహారమునందు విశేషముగ యిచ్ఛగలుగుట ఇట్టిలక్షణములు గలిగియుండిన బాలునికి ముఖమండికాగ్రహము సోకినదని ఎఱుంగవలయు.

### ముఖమండికాగ్రహమునకు స్నానము.

శ్లో॥ కపిత్థబిల్వతర్కారీవాసాగంధర్వహస్తకః ।
కుబేరాక్షీచయోజ్యాస్స్యుర్బాలానాంపరిషేచనే ॥

తా॥ వెలగ బిల్వము తక్కోడు ఆకులు ఆడ్డసరము ఆముదపు ఆకులు గచ్చ వీట్లను ఉదకమునందువైచికాచి బాలునికి స్నానముజేయించిన ముఖమండికాగ్రహము తొలగు.

### భృంగాది తైలము.

శ్లో॥ స్వరసంభృంగవృక్షాణాంతథైవహయగంధికా ।
తైలంవచాంచసంయోజ్యపచేదభ్యంజనేశిశోః ॥

తా॥ గుంటగలగర పెన్నేరుగడ్డ వస వీట్లస్వరసమునందు తిలతైలమువైచికాచి శిశువుశరీరమునకు లేపముజేసిన ముఖమండికాగ్రహము తొలగు.

### వచాది ధూపము.

శ్లో॥ వచాసర్జరసంకుష్ఠం సర్పిశ్చోత్థూపనేహితం ॥

తా॥ వస గుగ్గులము నెయ్యి కోష్ఠము వీటినిచేర్చి బాలునికి ధూపమువేశిన ముఖమండికాగ్రహము తొలగు.

నైగమేయగ్రహ లక్షణము.

శ్లో॥ ఛర్దిస్పందనకంఠాస్యశోషమూర్ఛావిగంధితా ।
ఊర్ధ్వంపశ్యేద్దశేద్దంతాన్నైగమేయగ్రహంవదేత్ ॥

తా॥ వాంతి వణుకు నోరు కంఠము వీటియందు శోష మూర్ఛ దుర్గంధము ఊర్ధ్వదృష్టి పండ్లుకొరుకుట ఇట్టిలక్షణములు బాలునికిగలిగియుండిన నదినైగమేయ గ్రహమని యెరుంగవలయు.

నైగమేయగ్రహమునకు స్నానము.

శ్లో॥ బిల్వాగ్నిమంథపూతీకైః కార్యంస్యాత్పరిషేచనం ।

తా॥ బిల్వము తూరనెల్లి కానుగ వీటిని ఉదకమునందువైచికాచి బాలునికి స్నానముజేయించిన నైగమేయగ్రహము తొలుగు.

ప్రియంగ్వాది తైలము.

శ్లో॥ ప్రియంగుసరలానంతా శతపుష్పాకుటంనకైః ।
పచేత్తైలంసగోమూత్రం దధిమస్త్వమ్లకాంజికైః ॥

తా॥ ప్రేంకణము దేవదారు నల్లనుగంధపాల కాంజికము వీట్లతో తైలము సిద్ధపరచి బాలునికి లేపనముచేసిన నైగమేయగ్రహము తొలుగు.

నైగమేయగ్రహ ధూపము.

శ్లో॥ మర్కటోలూకగృధ్రాణాంపురీషాణిపితృగృహే ।
ధూమఃసుజ్ఞజనైఃకార్యోబాలస్యహితమిచ్ఛుభిః ॥

తా॥ వానరము గూబ గద్ద వీటియొక్కమలముచే స్మశానమునందు ధూపమిడిన నైగమేయమనుగ్రహము నశించు.

నందినీగ్రహ లక్షణము.

శ్లో॥ ప్రథమేదివసేనామ్నానందినీక్రమతేశిశుం ।
తద్దుర్ష్టితస్యబాలస్యజ్వరఃస్యాత్ప్రథమంతతః ।
గాత్రేశోషస్తదాస్వేదోనాహారేచ్ఛాభృశంభవేత్ ।
ఛర్దిర్మూర్ఛాచకం పశ్చశోషోదనస్వరస్తథా ॥

తా॥ శిశువుజనించిన దివసమునందు దర్ధురులు జ్వరము వాపు చమట స్తన్యము నందు యిచ్ఛలేకయుండుట కక్కుట మూర్ఛ కంపము శరీరము శుష్కించుట హీన స్వరము ఇట్టిలక్షణములు బాలునికి గలిగెనేని నందినీయనుగ్రహముసోకినదని యెరుంగ వలయు.

## సునందనాదిగ్రహ లక్షణము.

శ్లో॥ ద్వితీయేదివసేబాలంగృహ్ణాతిచసునందనా ।
తతోభవేజ్జ్వరఃపూర్వంసంకోచోహస్తపాదయోః ।
దన్తాన్ఖాదతిశ్వసతినిమీలయతిచక్షుషీ ।
ఆహారంచనగృహ్ణాతిదివారాత్రౌచరోదితి ।
అక్షిరోగంచ ఛర్దనంచభవేదితిపునఃపునః ।
కృశత్వంజాయతేత్యంతంచిహ్నమేతత్ప్రకీర్తితం ॥

తా॥ శిశువుజనించిన ద్వితీయదివసమునందు జ్వరమువచ్చుట చేతులు కాళ్ళు ముడుచుకొనుట పండ్లుకొరుకుట నిట్టూర్పులిడుట కన్నులుమూసికొనుట స్తన్యమునం దిచ్ఛలేకపోవుట రాత్రిపగలు యేడ్చుట నేత్రరోగములు కలుగుట పలుమారుకక్కుట కృశించుట ఇట్టిలక్షణములు బాలునికి గలిగెనేని సునందనయను గ్రహముసంక్రమించి నదని నెఱుంగవలయు.

## గంటాలీగ్రహ లక్షణము.

శ్లో॥ తృతీయేన్హిచగృహ్ణాతిఘంటాలీబాలకంగ్రహీ ।
తచ్చేష్టారోచకోద్వేగః కాసశ్వాసశ్చశోషణం ॥

తా॥ శిశువుజనించిన తృతీయదివసమునందు అరుచి పులికిపడుట దగ్గు శ్వాస కృశించుట యిట్టిలక్షణములుగలిగెనేని ఘంటాలీయను గ్రహముసోకినదని యెఱుంగ వలయు.

## ఘంటాలీగ్రహ లేపము.

శ్లో॥ గజదంతాశ్చగోదంతా స్తథాకేశాస్తుచాంజనీ ।
అజాక్షీరేణసంపిష్యతతోబాలంప్రలేపయేత్ ॥

తా॥ ఏనుగదంతము ఆవుదంతము వెంట్రుకలు అంజనీ వీటిని మేకపాలతో నూరి శిశువుశరీరమునకు లేపనముజేసిన ఘంటాలీయనుగ్రహము తొలుగు.

అన్యచ్చ.

శ్లో॥ ధూపయేన్నింబపత్రాణినఖసర్షపరాజికాః ।
లేపితోద్ధూపితో బాలఃసుఖమాప్నోతినిశ్చితం॥

తా॥ వేపాకు గోళ్లు ఆవాలు తెల్లఆవాలు వీటినినూరి బాలునికి లేపనము చేయుటయేగాక వీటినే ధూపమువేసినను ఘంటాలీయనుగ్రహము నివర్తించు.

కంటకాలీగ్రహ లక్షణము.

శ్లో॥ చతుర్థేహ్నిచగృహ్ణాతికంటకాలీగ్రహీశిశుం ।
తచ్చేష్టారోచికోద్వేగః ఫేనోద్గారీదిగీక్షణం॥

తా॥ శిశువుజనించిన 4 వ దివసమునందు అరుచి వులికిపడుట నురుగుకక్కుట దిక్కులుచూచుట ఇట్టిలక్షణములు బాలునికి గలిగెనేని కంటకాలియను గ్రహము సోకినదని తెలియుంగవలయు.

కంటకాలీగ్రహ ధూపము.

శ్లో॥ గజదంతాహినిర్మోకంరాజీమూలంచలేపయేత్ ।
ధూపయేత్సర్షపారిష్టకేశైర్ముంచతిసాగ్రహీ ॥

తా॥ ఏనుగదంతము పాముకూసము తెల్లఆవాలవేళ్ళు వీటినినూరి లేపనము చేయుటయేగాక ఆవాలు వేపాకు వెంట్రుకలు వీట్లను బాలునికి ధూపమిడిన కంటకాలీగ్రహము తొలుగు.

అహంకారీగ్రహ లక్షణము.

శ్లో॥ పంచమేహ్నిత్వహంకారీగ్రహీంగృహ్ణాతిబాలకం ।
తచ్చేష్టాజృంభణంశ్వాసంముష్టిజంఘూర్ధ్వవీక్షణం ॥

తా॥ శిశువుజనించిన 5 వ దివసమునందు ఆవలింత శ్వాసచేతులు ముడుచుట కీకంటితోచూచుట యిట్టిలక్షణములు బాలునికి కలిగెనేని అహంకారీయనుగ్రహము సోకినదని తెలియుంగవలయు.

అహంకారీగ్రహ చికిత్స.

శ్లో॥ సితతాలవచాలోధ్రంమేషశృంగీఃప్రలేపయేత్ ।

లశునంనింబపత్రాణిసిద్ధార్థైర్ధూపయేత్తతః ।
ఏవంముంచతిసాబాలంనాత్రకార్యావిచారణా ॥

తా॥ తెల్లనూరిదళము వస లొద్దుగచక్క వొద్దిచక్క వీటినినూరి బాలునికి లేపనముజేయుటయేగాక వెల్లుల్లి వేపాకు ఆవాలు వీటిచే ధూపమువేసిన అహంకారీ యను గ్రహము తొలుగు.

షష్టికాగ్రహ లక్షణము.

శ్లో॥ షష్ఠేహనిచబాలంతుగ్రహీగృహ్ణాతిషష్టికా ।
తచ్చేష్టాగాత్రవిక్షేపోహాస్యరోదనమోహనం ॥

తా॥ శిశువుజనించిన 6 వ దినమునందు వులికిపడుట నవ్వుట యేడ్చుట మూర్ఛనొందుట యిట్టిలక్షణములు గలిగెనేని, బాలునికి షష్టికయను గ్రహము సోకినదని తెలియంగవలయు.

షష్టికాగ్రహ చికిత్స.

శ్లో॥ కుష్ఠగుగ్గులుసిద్ధార్థగజదంతైర్ఘృతాన్వితైః ।
ధూపయేల్లేపయేచ్చాపితతోముంచతిసాగ్రహి ॥

తా॥ చెంగల్వకోష్ఠు గుగ్గిలము ఆవాలు యేనుగదంతము వీటినినూరి బాలుని శరీరమునకు లేపనముజేయుటయేగాక వీటిచేతనే ధూపమిడిన షష్టికయను గ్రహము తొలుగు.

సింహికాగ్రహ లక్షణము.

శ్లో॥ సప్తమేదివసేనామ్నాసింహికాక్రమతేశిశుం ।
తచ్చేష్టాజృంభణంశ్వాసోముష్టిబంధస్తథేవచ ॥

తా॥ శిశువుజనించిన 7 వ దివసమునందు సింహికాయనుగ్రహము సోకెనేని ఆవలింత శ్వాస వేళ్ళుముడుచుకొనుట యిట్టిలక్షణములు గలిగియుండు.

సింహికాగ్రహ చికిత్స.

శ్లో॥ మేషశృంగీవచాహింగ్హరిమారితాలంమనఃశిలా ।
యేకత్రపిష్ట్వాతత్సర్వంతతోబాలంప్రలేపయేత్ ॥

తా॥ ఒద్దిపట్ట వస లొద్దుగచక్క హరిదళము మణిశిల వీటినినూరి బాలుని శరీరమునకు లేపనముజేసిన సింహికయను గ్రహము తొలుగు.

## ఆర్యకాగ్రహ లక్షణము.

శ్లో॥ అష్టమేన్హిచగృహ్ణాతి ఆర్యకాబాలకంగ్రహీ ।
కాసతేశ్వాసతేచైవగాత్రంసంకోచతేభృశం ॥

తా॥ శిశువుజనించిన 8 వ దివసంబున బాలునికి ఆర్యకయను గ్రహముసోకె నేని కాస శ్వాస శరీరము సంకోచించుట యిట్టిలక్షణములు గలిగియుండు.

## ఆర్యకాగ్రహ చికిత్స.

శ్లో॥ అపామార్గముశీరంచపిప్పలీచిత్రకంతథా ।
అజామూత్రేణసంపిష్యతతోబాలంప్రలేపయేత్ ॥

తా॥ ఉత్తరేణి వట్టివేరు పిప్పళ్ళు చిత్రమూలము వీటిని మేకమూత్రముతో నూరి శిశువుయొక్క శరీరమునకు లేపనముజేసిన ఆర్యకయనుగ్రహము తొలుగు.

## మేషీగ్రహ లక్షణము.

శ్లో॥ నవమేదివసేబాలంమేషీగృహ్ణాతినిశ్చితం ।
తచ్చేష్టాత్రాసనోద్వేగఃసముష్టిద్వయఖాదనం ॥

తా॥ శిశువుజనించిన 9 వ దివసంబున మేషీయనుగ్రహముసోకెనేని అందుచే భయపడుట వులికిపడుట చేతివేళ్ళుకరుచుకొనుట యిట్టిలక్షణములు గలుగు.

## మేషీగ్రహ చికిత్స.

శ్లో॥ వచాచందనకుష్ఠోగ్రాసర్షపాస్తత్రలేపయేత్ ।
నఖవానరరోమాభ్యాంధూపనాన్ముచ్యతేగ్రహీ ॥

తా॥ వస చందనము చెంగల్వకోష్ఠు నల్లవస ఆవాలు వీటినినూరి శిశువునకు లేపనముజేయుటయేగాక గోళ్ళు కోతివెంట్రుకలు వీటిని ధూపమిడినను మేషీయను గ్రహము తొలుగు.

## రోదనీగ్రహ లక్షణము.

శ్లో॥ దశమేదివసేనామ్నా రోదనీత్రాసతేశిశుం ।
తచ్చేష్టాకాసనంచైవరోదనంముష్టిబంధనం ॥

తా॥ 10 వ దివసమునందు రోదనీయనుగ్రహము బాలునికిసోకు. అందుచే దగ్గు వేళ్ళుముడుచుకొనుట యేడ్చుట యిట్టి లక్షణములు గలిగియుండు.

## రోదనీగ్రహ చికిత్స.

శ్లో॥ కుష్ఠోగ్రాసర్జసిద్ధార్థైర్లింపేన్నింబేనధూపయేత్ ।
మత్స్యమాంససురాయుక్తోబహిర్నిశిసమాహరేత్ ॥

తా॥ చెంగల్వకోష్ఠు వల్లవస గుగ్గిలము ఆవాలు వీట్లనునూరి శిశువుకు లేపనము జేయుటయేగాక వేపాకుధూపమువేసి మత్స్యమాంసము సురా వీటిని బయిటిప్రదేశమున నిశివేళయందు బలియిడిన రోదనీయనుగ్రహము నివర్తించయగు.

## అన్యచ్చ.

శ్లో॥ అపామార్గకుశోశీర చందనక్వాథవారిణా ।
సతాంచమంత్రయేన్మంత్రీ సంధ్యాయాంపరిషేచయేత్ ॥

తా॥ ఉత్తరేణి దర్భ వట్టివేళ్ళు చందనము వీటిని నీటియందువైచికాచి నభిమంత్రించి శిశువుకు సాయంకాలమున స్నానముచేయించిన రోదనీయనుగ్రహము తొలగు.

## ఉత్ఫుల్లికా లక్షణము.

శ్లో॥ ఆధ్మానవాతసంపుల్లోదకుక్షౌశిశోర్భవేత్ ।
ఉత్ఫుల్లికాసావిఖ్యాతాశ్వాసశ్వయథుసంకులా॥

తా॥ శిశువుకు దక్షిణకుక్షియందు ఆధ్మానవాతప్రకోపమువలన శ్వాస వాపు వీటితోకూడిన ఉత్ఫుల్లికయనురోగము జనించు.

## ఉత్ఫుల్లికా చికిత్స.

శ్లో॥ నిస్సారయేజ్జలోకాభిర క్తంచజఠరేతథా ।
కర్కోటనాగరామేషుకంకోలాతివిషాభవం ।

చూర్ణందుగ్ధేనసమ్మిశ్రంపాయయేన్మాంతరంభిషక్ ।
ధాత్రీంవాపాయయేత్సద్యః క్షీరదోషనివారణం ॥

తా॥ శిశువుకు ఉత్ఫుల్లికారోగము జనించెనేని జలగలనంటించి రక్తముతీయవలయు. మఱియు డావరడంగి కొంతి తుంగముస్తెలు అతివస వీటిని చూర్ణముజేసి పాలలోకలిపి తల్లిగాని లేక దాదిగాని పుచ్చుకొనిన స్తన్యదోషమువలన జనించిన ఉత్ఫుల్లికారోగము నివర్తియగు.

అ న్య చ్చ.

శ్లో॥ అగ్నినాస్వేదయేద్వాపిదాహయేచ్ఛలాకయా ।
జఠరేబిందుకాకారంపృష్ఠభాగేయథాధ్రువం ।
బిల్వమూలకంనీరదోవృక్షీత్రైఫలంతథాసింహికాద్వయం ।
గౌడమిశ్రితంక్వాథితంసమంపాయయేచ్ఛిశుంఫుల్లికాపహం ॥

తా॥ మఱియు పుత్ఫుల్లికారోగము జనించిన బాలుల వుదరమునందు వాత్తడము లేక కడుపుమీద చిటికవేయుటయేగాక బిల్వవేరు తుంగముస్తెలు అగరుకొంతి కరక తాండ్ర వుసిరికలు చిన్నములక పెద్దములక వీటినికషాయముబెట్టి అందు బెల్లమువైచి బాలులకు పానముజేయించిన నది నివర్తియగు.

అ న్య చ్చ.

శ్లో॥ పిప్పలీగ్రంథికంవిశ్వాత్రాయమాణాచదార్వికా ।
పథ్యేభపిప్పలీభార్గిలవంగంటంకణస్తథా ।
కుమారీదాలపథ్యాచసైంధవస్త్వజవారిణా ।
ఘర్షితంపాయయేత్ప్రాతర్ద్విటంకంఫుల్లికాపహం ॥

తా॥ పిప్పళ్ళు మోడి కొంతి కలుగానుగ మానిపసపు కరక్కాయ గజపిప్పలి గంటుభారంగి లవంగములు వెలిగారము కలబంద కురువేరు కరకపిందెలు సైంధవలవణము వీటిని మేకపంచితముతోనూరి 2 టంకములయెత్తు ప్రాతఃకాలమునందు శిశువుకు పానముజేయించిన ఉత్ఫుల్లికారోగము నశించు.

## ఉత్పుల్లికారోగమునకు ధూపము.

శ్లో॥ సర్వత్వగ్లశునంమూర్వాసర్ష పారిష్టపల్లవాః ।
బిడాలవిడజాలోమ మేషశృంగీవచామధు ।
ధూపంశశోర్జ్వరఘ్నోయమ శేషగ్రహనాశనః ॥

తా॥ పాముకుసుము వెల్లుల్లి చాగ తెల్లఆవాలు వేపాకు పిల్లివిష్ఠను మేక వెంట్రుకలు వొద్దిపట్ట వస తేనె వీటినిచేర్చి బాలునికి ధూపమిడిన సర్వజ్వరములు సర్వగ్రహములు నివర్తియగు.

## జ్వరాదులకు అష్టమంగళ ఘృతము.

శ్లో॥ వచాకుష్ఠం తథాబ్రాహ్మీ సిద్ధార్థక మథోపివ । సారివా
సైంధవంచైవపిప్పలీఘృతమష్టమం । సిద్ధంఘృతమిదంమేధ్యం
పిబేత్పాత్రద్దినేదినే । దృఢాస్మృతిఃక్షిప్రమేధా కుమారోబుద్ధి
మాన్భవేత్ । నపిశాచానరక్షాంసి నభూతానచమాతరః ।
ప్రభవంతికుమారాణాం పిబతామష్టమంగళం । బలిశాంతిష్ట
కర్మాణికార్యాణిగ్రహశాంతయే ॥

తా॥ వస కుష్ఠము బ్రహ్మమేడి ఆవాలు సుగంధపాల సైంధవలవణము పిప్పళ్లు వీట్లనునూరి కల్కముజేసి వాటిలో నెయ్యివైచి పక్వముగకాచిన నది అష్టమంగళ ఘృతమని బఱంగు. నీఘృతమును బాలునికిపానంబుజేయించిన దృఢస్మృతి తీవ్రమగు మేధ సూక్ష్మబుద్ధి ఇవి గలుగుటయగాక పిశాచములు రాక్షసబాధలు భూతములు మాతృకలు ఇవిసోకవు. మఱియు బాలులకు గ్రహారిష్టనివృత్తికై బలులు శాంతికర్మలు ఇవి మొదలగువాటిని జేయింపవలయు.

## సర్వగ్రహారిష్టమునకు లేపము.

శ్లో॥ సహాముండితికోదార్వీక్వాథఃస్నానంగ్రహాపహం ।
సప్తచ్ఛదాభయనిశాచందనైశ్చానులేపనం ॥

తా॥ కారుమినుములు బోడతరము మానిపసుపు వీటిని నీటియందుకాచి బాలునికి స్నానముజేయించుటయేగాక యేడాకులరటి కరక్కాయ పసపు చందనము వీటినినూరి శరీరమునకు లేపనముజేసిన సర్వగ్రహారిష్టములు తొలంగు.

## బాల జ్వరాంకుశము.

శ్లో॥ మృతసూతాభ్రవంగంచరౌప్యంయోజ్యంచతత్సమం। మృతతాంమ్రస్యతీక్ష్ణస్య ప్రత్యేకంచద్విభాగికం । వ్యోషంబిభీతకంచైవ కాసీసంమృతమేవచ । నాగవల్లీదళరసై ర్భావయేచ్చ పునఃపునః । వల్లప్రమాణం దాతవ్యః సర్వరోగ హారకఃపరః । గర్భిణీబాలకానాంచసర్వజ్వరవినాశనః ॥

తా॥ రసభస్మము అభ్రకభస్మము వంగభస్మము రజితభస్మము ఇవి సమభాగములు తామ్రభస్మము లోహభస్మము ఇవి 2 భాగములు శొంఠి మిరియాలు పిప్పళ్ళు తాండ్రకాయ అన్నభేదిభస్మము ఇవి వొక్కొక్కభాగము వీటినన్నిటిని ఖల్వమునందువైచి తమలపాకురసమునందు అనేకమార్లు భావనచేసి 1 వల్లప్రమాణము మాత్రలు చేసి గర్భిణీస్త్రీ బాలులుసేవించిన సర్వరోగములు సర్వజ్వరములు నివర్తించు.

## జ్వరములకు పద్మకాది క్వాథము.

శ్లో॥ క్వాథఃకృతః పద్మకనింబధాన్య చ్ఛిన్నోద్భవాలోహిత చందనోత్థః । జ్వరేభవేత్సర్వ భవేకృశాను ర్ధాత్రీశిశుభ్యాం ప్రకరోతిపీతః ॥

తా॥ తామరతూండ్లు వేప ధనియాలు తిప్పతీగ రక్తచందనము వీట్లను కషాయము పెట్టి తల్లికి బాలునికి పానముజేయించిన సర్వజ్వరములు నివర్తియగు.

## జ్వరమునకు యష్టిమధుకాది లేహము.

శ్లో॥ యష్టిమధుతుగాక్షీరీలాజాంజనసితాకృతః ।
లేహప్రదత్తోబాలానామశేషజ్వరనాశనః ॥

తా॥ అతిమధురము వెదురుప్పు వరిపేలాలు రసాంజనము శర్కర వీటిని లేహముచేసి బాలులకొసంగిన సర్వజ్వరములు మానును.

## వాతజ్వరమునకు స్థిరాదిక్వాథము.

శ్లో॥ క్వాథస్థిరాగోక్షురవిశ్వబాలక్షుద్రాదయశ్ఛిన్నరుహాకిరాతైః ।
వాతజ్వరంనాశమయేత్ప్రపీతో బాలేనధాత్ర్యాచకృశానుకారీ॥

తా॥ ముయ్యాకుపొన్న పల్లేరు శొంఠి వట్టివేరు చిన్నములుక పెద్దములుక తిప్పతీగె నీమనేలవేము వీటిని కషాయముపెట్టి తల్లి బాలుడు పుచ్చుకొనిన వాత జ్వరము మానుటయేగాక అగ్నిదీపనమునుగూడ గలుగంజేయు.

## వాతజ్వర కషాయము.

శ్లో॥ పంచమూలీకృతఃక్వాథః పీతో వాతజ్వరాపహః ।
తద్వచ్ఛిన్నరుహాద్రాక్షాగోపకన్యాబలాభవః ॥

తా॥ పంచమూలములను కషాయముపెట్టి పుచ్చుకొనినను లేక తిప్పతీగ ద్రాక్ష బాలింతబోళము గూడపాల చిట్టాముట్టి వీటినికషాయముపెట్టి శిశువునకు పానముచేయించిన వాతజ్వరము నశించు.

## పిత్తజ్వర కషాయము.

శ్లో॥ సారివోత్పలకాశ్మర్యాచ్ఛిన్నాపద్మకపర్పటైః ।
క్వాథఃపీతో నిహంత్యాశుశిశూనాంపైత్తికంజ్వరం ॥

తా॥ సుగంధపాల కలువ గుమ్మడు తిప్పతీగ తామరతూండ్లు పర్పాటకము వీట్లనుకషాయముపెట్టి బాలునికి పానముజేయించిన పిత్తజ్వరము నివర్తియగు.

## అన్యచ్చ.

శ్లో॥ ముస్తాపర్పటకోశీరవారిపద్మకసాధితం ।
శీతంవారినిహంత్యాశుత్రిథాదాహవమిజ్వరాన్ ॥

తా॥ తుంగముస్తలు పర్పాటకము వట్టివేరు కురువేరు తామరతూండ్లు వీటిని కషాయముబెట్టి బాలునికి పానముచేయించిన వాంతి దాహము జ్వరము వీట్లను నశింపంజేయు.

## సతతజ్వర చికిత్స.

శ్లో॥ నింబపత్రామృతానంతాపటోలేంద్రయవైఃకృతః ।
క్వాథఃసతతహంత్యాశుప్రభవవ్యసనంతథా ॥

తా॥ వేపాకు తిప్పతీగె తీటకసింద చేదుపొట్ల కొడిశపాలవిత్తులు వీటిని కషాయముబెట్టి బాలునికి పానముజేయించిన సతతజ్వరము నివర్తియగుటయేగాక ప్రసూతికిగలిగిన జాడ్యము నగా నివర్తియగు.

వాతపిత్తజ్వరమునకు కషాయము.

శ్లో॥ ముస్తాపర్పటకంఛిన్నాకిరాతోవిశ్వభేషజం ।
ఏషాంకషాయోదాతవ్యోవాతపిత్తజ్వరాపహః ॥

తా॥ తుంగముస్తలు పర్పాటకము తిప్పతీగె నేలవేము శొంఠి వీటిని కషాయముపెట్టి బాలునికి పానముచేయించిన వాతపిత్తజ్వరము నివర్తియగు.

అన్యచ్చ.

శ్లో॥ ఉశీరంమధుకంద్రాక్షాకాశ్మరీసలముత్పలం ।
పరూషకంపద్మకంచమధుకంమధుకంబలా ।
ఏభిఃశ్రుతఃకషాయోయంవాతపిత్తజ్వరంజయేత్ ।
ప్రలాపమూర్ఛాసంమోహతృష్ణాపిత్తజ్వరాపహః ॥

తా॥ వట్టివేరు అతిమధురము ద్రాక్ష గుమ్మడు నల్లకలువ చిట్టీత తామర తూండ్లు అతిమధురము ఇప్పపట్ట చిట్టాముట్టి వీట్లను కషాయముపెట్టి బాలునికి ద్రాగించిన ప్రలాపము మూర్ఛ మోహము దప్పి వీటితో చేరిన వాత పిత్త జ్వరము యివి నశించు.

పిత్తశ్లేష్మ జ్వరమునకు అమృతాష్టక
చూర్ణయుక్త కషాయము.

శ్లో॥ త్రిఫలాపిచుమందశ్చ పటోలంమధుకంబలా । యేభిఃక్వాథః కృతఃపీతః పిత్తశ్లేష్మ జ్వరాపహః । అమృతేంద్ర యవారిష్ట పటోలంకటురోహిణీ । నాగరంచందనంముస్తం పిప్పలీచూర్ణ సంయుతం । అమృతాష్టకమిత్యేతత్పిత్తశ్లేష్మజ్వరాపహం ।
హృల్లాసారోచకచ్ఛర్దితృష్ణాదాహనివారణం ॥

తా॥ కరక తాండ్ర ఉసిరికలు వేప చేదుపొట్ల అతిమధురము చిట్టాముట్టి వీటినికషాయముబెట్టి తిప్పతీగె కొడిశపాలవిత్తులు వేప చేదుపొట్ల కటుకరోహిణి శొంఠి చందనము తుంగముస్తలు పిప్పళ్ళు వీటిని చూర్ణముచేసి కషాయమునందుకలిపి బాలునికి పానముజేయించిన పిత్తశ్లేష్మజ్వరము అరుచి వాంతి దప్పి తాపము వీటిని పోగొట్టును యీ చూర్ణము అమృతాష్టకచూర్ణమనంబఱంగు.

## పిత్తశ్లేష్మ కషాయము.

శ్లో: ధాన్యాకచందనపద్మకముస్తాసశక్రయవామలకైః సపటోలైః ।
శీతకషాయోముఖేఖలుదద్యాత్ బాలకపిత్తకఫజ్వరంహాంతు ॥

తా॥ ధనియాలు చందనము తామరతూండ్లు తుంగముస్తలు కొడిశపాలవిత్తులు ఉసిరికవలుపు చేదుపొట్ల వీటిని కషాయముబెట్టి బాలునికి పానముజేయించిన పిత్తకఫ జ్వరము నివర్తించును.

## ఆమాదియుక్తజ్వర కషాయము.

శ్లో॥ సారగ్వధః సాతివిషః సముస్తాతిక్తా కషాయోజ్వర మాశు హన్యాత్ । సామంసశూలం సవమింసదాహం సకామలం హన్తి సరక్తపిత్తం ॥

తా॥ రేలగిజరు అతివస తుంగముస్తలు కటుకరోహిణి వీటిని కషాయముపెట్టి బాలునికి పానముచేయించిన ఆమశూల వాంతి తాపము కామిల రక్తపిత్తము వీటితో గూడిన జ్వరము నశించు.

## శీతజ్వరహర లేహము.

శ్లో॥ వాసావ్యాధి కణాలేహ శ్శీతజ్వర వినాశనః ।
తద్వత్క్షుద్రామృతానంతాతిక్తాభూనింబసాధితః ॥

తా॥ అడ్డసరము ములక పిప్పళ్ళు వీట్లను లేహముజేసి పుచ్చుకొనినను లేక ములక తిప్పతీగ తీటకసింద కటుకరోహిణి నేలవేము వీటిని లేహముజేసి పుచ్చుకొనినను శీతజ్వరము తొలుగును.

## చాతుర్భద్ర కషాయము.

శ్లో॥ కిరాతతిక్తకంముస్తంగుడూచీవిశ్వభేషజం ।
చాతుర్భద్రకమిత్యాహ వాతశ్లేష్మజ్వరాపహం॥

తా॥ సీమనేలవేము తుంగముస్తెలు తిప్పతీగె శొంఠి వీటిని కషాయముపెట్టి బాలునికిద్రాగించిన వాతశ్లేష్మకజ్వరము నశించు.

శ్లో॥ మధుకంసారివాద్రాక్షామధుకంచందనోత్పలం । కాశ్మరీ పద్మకంలోధ్రం త్రిఫలా పద్మకేసరం । పరూషకం మృణాలంచ

సేవ్యంతుసప్తవారిణా । మధుజాతసితాయుక్తంతత్పిత్తంపుష్టి
దంనిశి । వాతంపిత్తజ్వరందాహం తృష్ణామూర్ఛారుచి
భ్రిమాణ । శమయేద్రక్తపిత్తంచజీమూతమివమారుతః ॥

తా॥ అతిమధురము సుగంధపాల ద్రాక్ష ఇప్ప రక్తచందనము నల్లకలువ గుమ్మడు తామరతూండ్లు లొద్దుగచక్క కరక తాండ్ర వుసిరికలు ఫాలసాపండ్లు వీట్లను కషాయముపెట్టి అందు తేనెతో ఉత్పత్తియగునట్టి శర్కరవైచి రాత్రికాలము నందు బాలులకుపానముచేయించిన వాపు పిత్తము జ్వరము తాపము దప్పి మూర్ఛ అరుచి భ్రిమ రక్తపిత్తము వీటిని నశింపంజేసి శరీరపుష్టిని గలుగంజేయు.

అన్యచ్చ.

శ్లో॥ బిల్వంచ పుష్పాణిచధాతుకీనాం జలంసలోధ్రిం గజపిప్పలీచ ।
క్వాథోపలేహోమధునావిమిశ్రోబాలేషుయోజ్యఃకటిధారితేషు॥

తా॥ బిల్వఫలము ఆరెపువ్వు వట్టివేరు లొద్దుగచక్క గజపిప్పలి వీటిని కషాయముపెట్టి తేనెచేర్చి బాలునికిపానముచేయించిన వాతపిత్తజ్వరము నశించు.

శ్లేష్మకజ్వరమునకు అభయాది కషాయము.

శ్లో॥ అభయామలకీకృష్ణాచిత్రకోయంగణోమతః ।
దీపనఃపాచనోభేదీసర్వశ్లేష్మజ్వరాపహః ॥

తా॥ కరక వుసిరికలు పిప్పళ్ళు చిత్రమూలము వీటిని కషాయముపెట్టి బాలునికి ద్రాగించిన శ్లేష్మజ్వరమును నశింపంజేయుటయగాక దీపనపాచనములను గలుగంజేయు.

జ్వరహర లేహము.

శ్లో॥ కట్ఫలంపుష్కరంశృంగిపిప్పలీమధునాసహ ।
ఏషాంలేహోజ్వరంశ్వాసంకాసంమందానలంజయేత్ ॥

తా॥ కాయఫలము చిట్టాముదపువేరు కర్కాటకశృంగి పిప్పళ్ళు వీట్లచే చేయంబడిన లేహములో తేనెచేర్చి బాలునికిప్పించిన జ్వరము ఉబ్బసము దగ్గు అగ్నిమాంద్యము వీటిని నశింపంజేయు.

## సన్నిపాతజ్వర చికిత్స.

శ్లో॥ దశమూలీయుతేః క్వాథః పిప్పలీచూర్ణ సంయుతః ।
సంమోహాతంద్రాసమాయే సన్నిపాతజ్వరంహరేత్ ॥

తా॥ దశమూలముల కషాయమునందు పిప్పలిచూర్ణము వైచి బాలునికి పానము జేయించిన మోహము తంద్ర వీటితోగూడిన సన్నిపాతజ్వరమును నశింపంజేయు.

## దాహముతోగూడిన జ్వరచికిత్స.

శ్లో॥ ముస్తకంచందనంవాసాహ్రీబేరంయష్టికామృతా ।
ఏషాంక్వాథస్తుపిత్తఘ్నస్తృష్ణాదాహాజ్వరాపహః ॥

తా॥ తుంగముస్తెలు రక్తచందనము అడ్డసరము కురువేరు అతిమధురము తిప్పతీగె వీటిని కషాయముబెట్టి బాలునికి పానముజేయించిన పిత్తము దాహము తాపము జ్వరము వీట్లను నశింపంజేయు.

## అన్యచ్చ.

శ్లో॥ వాసాపర్పటకోశీరనింబభూనింబసాధితః ।
క్వాథోహన్తివమిశ్వాసకాసపిత్తజ్వరాన్శిశోః ॥

తా॥ అడ్డసరము పర్పాటకము వట్టివేరు వేప సీమనేలవేము వీటిని కషాయముబెట్టి బాలునికి పానముచేయించిన ఉబ్బసము దగ్గు పిత్తము జ్వరము ఇవిమానును.

## ఏకాహికజ్వర చికిత్స.

శ్లో॥ కటుకీవిహితః క్వాథః కణాచూర్ణసమన్వితః ।
ఏకాహికంజ్వరంహన్తికాసశ్వాసాదిదూషితం ॥

తా॥ కటుకరోహిణి కషాయముపెట్టి అందు పిప్పలిచూర్ణము వైచి బాలులకు ద్రాగించిన దగ్గు ఉబ్బసముతోగూడిన ఏకాహికజ్వరము మానును.

## అన్యచ్చ.

శ్లో॥ ద్రాక్షాపటోలత్రిఫలాపిచుమందవృకైః కృతః ।
క్వాథ ఏకాహికంహన్తిపరార్థమివదుర్జనః ॥

తా॥ ద్రాక్ష చేదుపొట్ల కరక తాండ్ర వుసిరికలు వేప అడ్డసరము వీటి కషాయము "దుర్జనుడు పరద్రవ్యమును నెటుల నశింపంచేయునో నాచందంబున" ఏకాహికజ్వరమును నశింపంజేయు.

ద్వ్యాహికజ్వర చికిత్స.

శ్లో॥ గుడూచీచందనోశీరధాన్యనాగరతోయది ।
క్వాథస్తృతీయకంహన్యాచ్ఛర్కరామధుమిశ్రితః ॥

తా॥ తిప్పతీగ చందనము వట్టివేరు ధనియాలు శొంఠి వీటిని కషాయముపెట్టి అందు తేనె శర్కరవైచి బాలునికి పానముచేయించిన త్ర్యాహికజ్వరము మానును.

త్ర్యాహికజ్వర ధూపము.

శ్లో॥ పలంకషావచాకుష్ఠంగజచర్మావిచర్మచ ।
నింబస్యపత్రంమాక్షీకంసర్పిర్యుక్తంతుధూపకం ।
జ్వరవేగంనిహంత్యాశుబాలానాన్తువిశేషతః ॥

తా॥ గుగ్గిలము వస చంగల్వకోష్టు ఏనుగచర్మము మేకచర్మము వేపాకు తేనె నెయ్యి వీటినిజేర్చి బాలునికి ధూపమిడిన త్ర్యాహికజ్వరము మానును.

త్ర్యాహిక జ్వరహర లేపనము.

శ్లో॥ మూర్వానిశా సర్షపరామసేన శ్వేతాసమంగాం బుదకార పీనాం । ఛాగీపయోభిః సహపేషితానా ముద్వర్తనంస్యా జ్వరజిచ్ఛిశూనాం ॥

తా॥ చాగ పసపు ఆవాలు సీమసేలవేము తెల్లనుగంధపాల తుంగముస్తలు ఓమము వీటిని మేకపాలతోనూరి బాలునిశరీరమునకు లేపనముచేసిన త్ర్యాహిక జ్వరము తొలగు.

సర్వజ్వరహర కషాయము.

శ్లో॥ భద్రముస్తాభయానింబపటోలమధుకైః కృతః ।
క్వాథఃకోష్ణఃశిశోరేమసి శ్లేషోజ్వరనాశనః ॥

తా॥ తుంగముస్తలు కరక వేప చేదుపొట్ల అతిమధురము వీటిని కషాయము పెట్టి బాలునికి కించిదుష్ణముగ పానముచేయించిన సర్వజ్వరములు తొలగును

### స్తన్యము గ్రహించుటకు కల్కము.

శ్లో॥ బాలో యోచిరజాతః స్తన్యంగృహ్ణాతినోదతాంతస్యా ।
సైంధవధాత్రీమధుకృతపథ్యాకల్కేనఘర్ష యేజ్జిహ్వాం ॥

తా॥ శిశువుజనించినపిదప స్తన్యపానముచేయక యుండిన సైంధవలవణము కరక్కపురికలు వీటిని కల్కముచేసి అందు తేనెపైచి బాలుని నాలికయందు ఘర్షణ చేసిన స్తన్యముగ్రహించు.

### ఏకాహిక జ్వరమునకు రక్ష.

శ్లో॥ కన్యావర్తితసూత్రేణబద్ధ్వాపామార్గమూలికాం ।
ఏకాహికంజ్వరంహన్తిశిఖాయామపివేగతః ॥

తా॥ ఉత్తరేణివేరును పెండ్లికానికన్యకచే వడకబడిన సూత్రముతో బంధించి శిరస్సుయందుండు వెంట్రుకలలో రక్షకట్టిన ఏకాహికజ్వరము నశించు.

### అతిసార చికిత్స.

శ్లో॥ కాకోళీగజకృష్ణాచలోధ్రిమేషాంసమాంశతః ।
క్వాథోమధాన్వితఃపీతో బాలాతీసారహృన్మతః ॥

తా॥ (కాకోళి) తేలుమణిచెట్టు గజపిప్పలి లొద్దుగచెక్క వీటిని సమభాగములుగ కషాయముపెట్టి బాలునికి డ్రాగించిన అతిసారము మానును.

### అన్యచ్చ.

శ్లో॥ లాజాసైంధవమామ్రాస్థిచూర్ణమేషాంసమాంశతః ।
హంతిచ్ఛర్ది మతీసారంమధునాసహభక్షితం ॥

తా॥ వరిపేలాలు సైంధవలవణము మామిడిపప్పు వీటిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెలోకలిపి బాలునికి నాకించిన కక్కులు అతిసారము ఇవిమానును.

### అన్యచ్చ.

శ్లో॥ ఆమ్రబీజంతథాలోధ్రింధాత్రీఫలరసంతథా ।
పీత్వామాహిషతక్రేణబాలాతీసారనాశనం ॥

తా॥ మామిడిపప్పు లొద్దుగచెక్క రసము ఉసిరికాయలరసము వీటిని సమభాగములుగ చేర్చి ఎనపమజ్జిగలో కలిపి బాలునికి పానముచేయించిన అతిసారము మానును.

అన్యచ్చ.

శ్లో॥ ఫలిన్యంజనముస్తానాంచూర్ణంపీతంసమాక్షికం ।
త్రుష్ణాఛర్ది మతీసారంబాలానాంతత్వతోహరేత్ ॥

తా॥ కానుగ రసాంజనము తుంగముస్తెలు వీటిచూర్ణములో తేనెవైచి బాలులకు నాకించిన దప్పి వాంతులు అతిసారము ఇవి మానును.

అన్యచ్చ.

శ్లో॥ శ్యామారసాంజనంచూతఫలాస్థిసముచూర్ణితం ।
హంతిచ్ఛర్ది మతీసారంబాలానాంమధునాశితం ॥

తా॥ పిప్పళ్ళు రసాంజనము మామిడిపప్పు వీటిని సమభాగములుగ చూర్ణము చేసి తేనెచేర్చి బాలులకిచ్చిన అతిసారము మానును.

అన్యచ్చ.

శ్లో॥ ధాతకీబిల్వధాన్యాకలోధ్రేంద్రయవవాలుకైః ।
లేహఃక్షౌద్రేణబాలానాంజ్వరాతిసారవారణయేత్ ॥

తా॥ ఆరెపువ్వు బిల్వఫలము ధనియాలు లొద్దుగచెక్క కొడిశపాలవిత్తులు వట్టివేరు వీటిని లేహముచేసి అందు తేనెవేసి బాలులకిచ్చిన జ్వరము అతిసారము ఇవి మానును.

అన్యచ్చ.

శ్లో॥ లోధ్రేణపిప్పలీవాలాబాలకాతిసృతౌహితః ।
శ్రీవాసోమాక్షికయుతోధాతకీకుసుమైస్సమం ॥

తా॥ లొద్దుగచెక్క పిప్పళ్ళు వట్టివేరు వీటిచూర్ణములో తేనెవైచి బాలులకుయిచ్చిన అతిసారము మానును. మఱియు ఆరెపువ్వు ధూపమిడినను మానును.

అన్యచ్చ.

శ్లో॥ విడంగాన్యజమోదాచకి ప్రీతండులానిచ।
ఏషామాలిహ్యచూర్ణానిసుఖంతప్తేనవారిణా।
కమేప్రవృత్తేతిసారేకుమారంపాయయేద్భిషక్॥

తా॥ వాయువిడంగములు ఓమము పిప్పళ్ళు బియ్యము వీటిని చూర్ణముచేసి ఉష్ణోదకములోకలిపి బాలులకిచ్చిన అతిసారము మానును.

గ్రహణికి యవాన్యాదిచూర్ణము.

శ్లో॥ యవానీజీరకంవ్యోషంకుటజంవిశ్వభేషజం।
ఏతన్మధుయుతంపీతంబాలానాంగ్రహణీంజయేత్॥

తా॥ ఓమము జీలకఱ్ఱ మిరియాలు పిప్పళ్ళు కొడిశపాలవిత్తులు శొంఠి వీటి చూర్ణమును తేనెలోగలిపి బాలునికిచ్చిన సంగ్రహణీరోగము నశించు.

అన్యచ్చ.

శ్లో॥ పిప్పలీవిజయాశుంఠీచూర్ణంమధుయుతంభిషక్।
దత్వానిహంత్యగ్రహణీరుజానీయతమాప్నుయాత్॥

తా॥ పిప్పలి బంగిఆకు శుంఠి వీటిని చూర్ణముచేసి తేనెచేర్చి బాలునికిచ్చిన గ్రహణీరోగము తొలగును.

అన్యచ్చ.

శ్లో॥ కృష్ణామహౌషధంబిల్వంనాగరస్సయవానికః।
మధుసర్పిర్యుతంలీఢంబాలానాంగ్రహణీంహరేత్॥

తా॥ పిప్పలి అతివస బిల్వఫలము శొంఠి ఓమము వీటిని చూర్ణముచేసి తేనె నెయ్యితోగలిపి బాలులకు నాకించిన సంగ్రహణి మానును.

అన్యచ్చ.

శ్లో॥ నాగరంముస్తకంబిల్వంచిత్రకంగ్రంధికంశివాం।
చూర్ణమేతన్మధుయుతంకఫజాంగ్రహణీంజయేత్॥

తా॥ శొంఠి తుంగముస్తలు బిల్వఫలము చిత్రమూలము మోడి కరక్కాయ వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి బాలులకు నాకించిన శ్లేష్మమువలన జనించిన సంగ్రహణి మానును.

అన్యచ్చ.

శ్లో॥ సగుడంనాగరంబిల్వంయఃఖాదతిహితాశనః ।
త్రిదోషగ్రహణీరోగాన్ముచ్యతేనాత్రసంశయః ॥

తా॥ శొంఠి బిల్వఫలము వీటిని చూర్ణముచేసి బెల్లములోగలిపి బాలునికి భక్షింపంజేసిన త్రిదోషమువలన జనించిన సంగ్రహణి నివర్తియగు.

త్రిదోషసంగ్రహణి చికిత్స.

శ్లో॥ ముస్తకాతివిషాబిల్వంచూర్ణితంకౌటజంతథా ।
క్షౌద్రేణలీఢంగ్రహణీంసర్వదోషోద్భవాంజయేత్ ॥

తా॥ తుంగముస్తలు అతివస బిల్వఫలము కొడిశపాలవిత్తులు వీటిని చూర్ణముచేసి తేనెవైచి బాలులకుయిచ్చిన సన్నిపాతాత్మక సంగ్రహణి నశించు.

రక్తాతిసార చికిత్స.

శ్లో॥ మోచరసంసమంగాచధాతకీపద్మకేసరం ।
పిష్ట్వైతైర్యవాగూస్యాద్రక్తాతీసారనాశనీ ॥

తా॥ బూరుగబంక ముయ్యాకుపొన్న ఆరెపువ్వు తామరకేసరములు వీట్లను చూర్ణముచేసి ఉదకములోవైచి బాలునికి పానముచేయించిన రక్తాతిసారముమానును.

సర్వాతిసార చికిత్స.

శ్లో॥ నాగరాతివిషాముస్తావాలకేంద్రయవైఃకృతః ।
కుమారంపాయయేత్క్వాథఃసర్వాతీసారనాశనః ॥

తా॥ శొంఠి అతివస తుంగముస్తలు వట్టివేరు కొడిశపాలవిత్తులు వీటిని కషాయముపెట్టి బాలునికి పానముజేయించిన సర్వాతిసారములు నశించు.

ప్రవాహిక చికిత్స.

శ్లో॥ లోధ్రేంద్రయవధాన్యాకధాత్రీహ్రీబేరముస్తకం ।
మధునాలేహయేద్బాలంజ్వరాతీసారనాశనం ॥

తా॥ లొద్దుగచక్క కొడిశపాలవిత్తులు ధనియాలు వుసిరికవలుపు వట్టివేరు తుంగముస్తలు వీటిని చూర్ణముజేసి తేనెలోగలిపి బాలులకు నాకించిన జ్వరాతిసారము నశించు.

## గ్రహణీ అతిసార చికిత్స.

శ్లో॥ రజనీసరళోదారుద్బృహతీగజపిప్పలీ ।
పృశ్నిపర్ణీశతాహ్వాచలీఢామాక్షికసర్పిషా ।
దీపనంగ్రహణీంహంతిమారుతార్తింసకామలాం ।
జ్వరాతిసారంపాండుత్వంబాలానాంసర్వరోగనుత్ ॥

తా॥ పసపు సరళదేవదారు ములుక గజపిప్పలి కోలపొన్న చల్లగడ్డ వీట్లను చూర్ణముచేసి తేనె లేక నెయ్యి వీట్లతో బాలులకు నాకించిన సంగ్రహణీ వాయువు కామిల జ్వరము అతిసారము పాండురోగము అగ్నిదీపనము వీట్లను నశింపంజేయు.

## బాలచాంగేరీ ఘృతము.

శ్లో॥ చాంగేరీసురసేసర్పిఃఛాగక్షీరసమేపచేత్ ।
కపిత్థవ్యోషసింధూత్థసమంగోత్పలవాలకైః ॥
సబిల్వధాతకీమోచైఃసిద్ధంసర్వాతిసారనుత్ ।
గ్రహణీందుస్తరాంహంతిబాలానాంచవిశేషతః ॥

తా॥ పులిచింతరసము ఆవునెయ్యి మేకపాలు వీటిని సమభాగములుగ గ్రహించి వొకటిగజేర్చి అందు వెలగగుజ్జు త్రికటుకములు సైంధవలవణము మంజిష్టి నల్లకలువ కురువేరు మారేడుగుజ్జు ఆరెపువ్వు బూరగబంక వీటిని సమాంశములుగ గ్రహించి కల్కముజేసి కలిపి బాలుగ పాకముచేసి సేవించిన దారుణమగు అతిసారము గ్రహణి యివిబోవును. ఈ ఘృతము బాలురకు మేలును జేయును.

## రక్తాతిసార చికిత్స.

శ్లో॥ హ్రీబేరంశర్కరాక్షౌద్రపీతంతండులవారిణా ।
శిశోరక్తాతిసారఘ్నంకాసశ్వాసవమింహరేత్ ॥

తా॥ వట్టివేరు బియ్యపుకడుగుతో నూరి తేనె శర్కరవైచి త్రాగించిన రక్తాతిసారము దగ్గు ఉబ్బసము వాంతి వీటిని నశింపంజేయు.

## అర్శ చికిత్స.

శ్లో॥ యవానీనాగరంపాఠాదాడిమంకుటజంతథా ।
చూర్ణోయంగుడతక్రాభ్యాంపీతోర్శస్తంభనఃపరః ॥

తా॥ ఓమము శొంఠి అగలుశొంఠి దాడింబతోలు కొడిశపాలవిత్తులు వీటి చూర్ణము బెల్లము మజ్జిగతోగలిపి బాలులకు పానముచేయించిన అర్శస్సు మానును.

## అర్శరోగ ఘుటికలు.

శ్లో॥ అజాజీపౌష్కరంపాఠాత్ర్యూషణందహనంశివా ।
గుడేనగుటికాగ్రాహ్యాసర్వార్శోశోధనోయతః ॥

తా॥ ఓమము చిట్టాముదపువేరు అగలుశొంఠి మిరియాలు పిప్పళ్లు చిత్రమూలము కరక్కాయలు వీటిని చూర్ణముచేసి బెల్లములోకలిపి గుటికలుచేసి బాలునికిచ్చిన సమస్త అర్శస్సులు మానును.

## రక్తమూలమునకు చికిత్స.

శ్లో॥ నవనీతతిలాభ్యాసాత్కేసరనవనీతశర్కరాభ్యాసాత్ ।
దధిసారమథితాభ్యాసాద్గుదజార్శామ్యంతిరక్తవాహాః ॥

తా॥ వెన్న నువ్వులు వీటిని భక్షించినను లేక నాగకేసరములు శర్కర వెన్న వీటిని భక్షించినను లేక పెరుగులో నీరువేయకనే చిలికినమజ్జిగ ప్రతిదినము మాటిమాటికి బాలురు పానముచేసినను రక్తము స్రవించెడి మూలముయొక్క మొలకలు నశించును.

## రక్తార్శ చికిత్స.

శ్లో॥ ఏవంవాకౌటజంబీజంరక్తార్శోమధునాహరేత్ ।
తద్వన్మస్తామోచరసః కపికచ్ఛుభవోరజః ॥

తా॥ కొడిశపాలవిత్తులు చూర్ణముచేసి తేనెవైచి బాలులకు నాకించినను లేక తుంగముస్తెలు బూరుగబంక దూలగొండి వీటిచూర్ణములో తేనెవైచి పుచ్చుకొనినను రక్తార్శస్సు మానును.

## ఆమయుక్తశూలాది చికిత్స.

శ్లో॥ ధాన్యనాగరజఃక్వాథఃశూలామాజీర్ణనాశనః ।
చూర్ణస్త్రత్రశుభఃపీతస్తద్వత్ వ్యోషాగ్నిజీరకైః ॥

తా॥ ధనియాలు శొంఠి వీటికషాయము పుచ్చుకొనిన లేక మిరియాలు శొంఠి పిప్పళ్లు చిత్రమూలము జీలకఱ్ఱ వీటిచూర్ణము పైకషాయమునందువైచి పుచ్చుకొనినను శూల ఆమము అజీర్ణము వీటిని నశింపంజేయు.

## సర్వాజీర్ణాది చికిత్స.

శ్లో॥ పిప్పలీరుచకంపథ్యాచూర్ణంమస్తుజలంపిబేత్ ।
సర్వాజీర్ణహరంశూలగుల్మానాహాగ్నిమాన్ద్యజిత్ ॥

తా॥ పిప్పళ్ళు సూరతు నల్లనుప్పు కరక వీటిని చూర్ణముజేసి పెరుగు తేటయందువైచి బాలులకుద్రాగించిన సర్వాజీర్ణములు శూల గుల్మము ఆనాహవాతము అగ్నిమాన్ద్యము వీటిని నశింపంజేయు.

## అజీర్ణ విషూచికా చికిత్స.

శ్లో॥ త్వక్పత్రరాస్నాగురుశిగ్రుకుష్టైఃరమ్లప్రపిష్టైఃసబలాసితాహ్వైః ।
అజీర్ణకఘ్నంచవిషూచికాఘ్నంతైలంవిపక్వంచతదర్థకారీ ॥

తా॥ లవంగపట్ట లవంగపత్రి సన్నరాష్ట్రిము అగరు మునగపట్ట చెంగల్వకోష్ఠు చిట్టాముట్టె వీటిని నిమ్మపండ్లరసముచేనూరి శర్కరవైచి బాలులకిచ్చిన అజీర్ణము విషూచి వీటిని పోగొట్టును. మఱియు వీటిని తైలముకాచి బాలులకిచ్చిన పైజెప్పిన రోగములన్నియు నశించు.

## భస్మకసామాన్య చికిత్స.

శ్లో॥ అన్నపానైర్గురుస్నిగ్ధైర్మంద్రసాంద్రహిమఃస్థిరైః ।
పిత్తఘ్నైరేచనైర్దీర్ఘంభస్మకంప్రశమంనయేత్ ॥

తా॥ గురు స్నిగ్ధ మంద్ర సాంద్ర హిమ స్థిర మఱియు పిత్తనాశకమగునట్టి విరేచనము వీటిచే భస్మకరోగము మానును.

అన్యచ్చ.

శ్లో॥ ఔదుంబరత్వచంపిష్ట్వానారీక్షీరయుతంపిబేత్ ।
తాభ్యాంచపయసాసిద్ధంభుక్తంజయతిభస్మకం ॥

తా॥ అత్తిపట్టనునూరి స్తన్యమునందుగాని లేక గోక్షీరమునందుగాని వుడికించి బాలులకిచ్చిన భస్మకరోగము నశించు.

శ్లో॥ మయూరతండులైఃసిద్ధంపాయసంభస్మకంజయేత్ ।
విదారీస్వరసంక్షీరసిద్ధంవామహిషీఘృతం ॥

తా॥ తెల్లఉత్తరేణిబియ్యము పాలలోవైచి పాయసముచేసి పుచ్చుకొనినను లేక నేలగుమ్మడు స్వరసమునందు పాలువేసి గట్టిగకాచి అందు యెనపనెయ్యివైచి బాలులకిచ్చిన భస్మకరోగము తొలుగు.

కాసమునకు ధాన్యాది హిమము.

శ్లో॥ ధాన్యకంశర్కరాయుక్తంతండులోదకసంయుతం ।
పానమేతత్ప్రదాతవ్యంకాసశ్వాసాపహంశిశోః ॥

తా॥ ధనియాలు బియ్యపుకడుగులోనూరి శర్కరవైచి బాలులకు పానము చేయించిన ఉబ్బసము దగ్గులు వీటిని నశింపంజేయు.

అన్యచ్చ.

శ్లో॥ దురాలభాకణాద్రాక్షాపథ్యాక్షౌద్రేణలేహయేత్ ।
త్రిరాత్రంపఞ్చరాత్రంవాకాసశ్వాసహరఃశిశోః ॥

తా॥ దురదగొండివేరు పిప్పళ్లు ద్రాక్ష కరకపిందెలు వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి 8 దినములు బాలులకు సేవింపజేసిన ఉబ్బసము దగ్గు ఇవి మానును.

హిక్కాశ్వాస చికిత్స.

శ్లో॥ హింగుకర్కటశృంగీచగైరికంమధుయష్టికా ।
త్రుటిఃక్షౌద్రంనాగరంచహిక్కాశ్వాసనివారణం ॥

తా॥ ఇంగువ కర్కాటకశృంగి కావిరాయి అతిమధురము ఏలకులు శొంఠి వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి బాలులకిచ్చిన వెక్కిళ్లు శ్వాస ఇవితొలుగు.

## కాసశ్వాసాది చికిత్స.

శ్లో॥ కృష్ణామరాలభాద్రాక్షాకర్కటాఖ్యాగజాహ్వయా ।
చూర్ణితామధుసర్పిర్భ్యాంలీఢ్వాహంతిశిరోర్గదాన్ ।
కాసంశ్వాసంచతమకంజ్వరోవాపివినంక్ష్యతి ॥

తా॥ పిప్పళ్ళు మురదగొండివేరు ద్రాక్ష కర్కాటకశృంగి గజపిప్పలి వీటిని చూర్ణముచేసి తేనె లేక నెయ్యి వీటితో కలిపి బాలులకు నాకించిన వుబ్బసము కాస తమకము జ్వరము వీటిని నశింపంజేయు.

## కాసశ్వాసఛర్ది చికిత్స.

శ్లో॥ శృంగీసముస్తాతివిషాంవిచూర్ణ్య లేహంవితధ్యాన్మధునా శిశూనాం । కాసజ్వరచ్ఛర్దిసమన్వితానాం సమాక్షికంవాతివిషాసమేతం ॥

తా॥ కర్కాటకశృంగి తుంగముస్తెలు అతివస వీటిని చూర్ణముచేసి తేనెతో కలిపి లేహపక్వముగావండిగాని లేక అతివస తేనెతో జేర్చిగాని బాలులకిచ్చిన దగ్గు జ్వరము వాంతి వీటిని నశింపంజేయు.

## కాస చికిత్స.

శ్లో॥ గుడోదకంవాక్వథితంవ్యోషసైంధవసంయుతం ।
సుఖోష్ణంపాయయేత్ బాలంకాసరోగోపశాంతయే ॥

తా॥ బెల్లము పాకముచేసి అందు శొంఠి మిరియాలు పిప్పళ్ళు సైంధవలవణము వీటిని చూర్ణముచేసి సుఖోష్ణముగకాచి బాలులకు పానముచేయించిన కాసరోగము మానును.

## అన్యచ్చ.

శ్లో॥ విహితోమధునాలేహోవ్యాఘ్రీకుసుమకేసరైః ।
లీఢోహినాశయత్యాశుకాసంపంచవిధంశిశోః ॥

తా॥ ములక లవంగము నాగకేసరములు వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి లేహపక్వముగవండి బాలులకిచ్చిన అయిదువిధ కాసలు మానును.

అ న్య చ్చ.

శ్లో॥ ఏకాశృంగీనిహంత్యాశుమూలకస్యఫలాన్వితా ।
ఘృతేనమధునాలీఢాకాసంబాలస్యదుస్తరం ॥

తా॥ కర్కాటకశృంగి ముల్లంగివిత్తులు వీటిని చూర్ణము చేసి తేనె లేక నెయ్యి వీటితో బాలులకిచ్చిన దుస్తరమైన కాసలుమానును.

క్రి మి చి కి త్స.

శ్లో॥ విడంగంమధునాలీఢంపుష్కరంబాలశిగ్రుకం ।
ఆఖుపర్ణీతథైకావాక్రిమిభ్యోముచ్యతేశిశుః ॥

తా॥ వాయువిళంగములు చూర్ణము చేసి తేనెతోగాని లేక చెంగల్వకోష్టు మునగవిత్తులు వీట్లను చూర్ణము చేసి తేనెలోకలిపి యిచ్చినను లేక యెలుకచెవి ఆకు రసముయిచ్చినను బాలుని కడుపుయందుండెడి క్రిములు నశించు.

కాస చికిత్స.

శ్లో॥ పౌష్కరాతివిషాశృంగీమాగధీధన్వయాసకైః ।
కృతంచూర్ణంతుసక్షౌద్రంశిశూనాంపఞ్చకాసజిత్ ॥

తా॥ చెంగల్వకోష్టు అతివస కర్కాటకశృంగి పిప్పళ్లు దురదగొండివేరు వీట్లను చూర్ణము చేసి తేనెలోకలిపి బాలులకిచ్చిన 5 విధములగు కాసలుమానును.

కాస చికిత్స.

శ్లో॥ ముస్తకాతివిషావాసాకణాశృంగీరసంలిహాన్ ।
మధునాముచ్యతేబాలఃకాసైఃపంచభిరుచ్ఛ్రితైః ॥

తా॥ తుంగముస్తెలు అతివస అడ్డసరము పిప్పళ్ళు కర్కాటకశృంగి వీటిని చూర్ణము చేసి తేనెతోకలిపి బాలునికినాకించిన అయిదువిధములగు కాసలు మానును.

అ న్య చ్చ.

శ్లో॥ వ్యాఘ్రీకుసుమసంజాతకేసరైరవలేహికా ।
మధునాచిరసంజాతాన్ శిశోఃకాసాన్ వ్యపోహతి ॥

తా॥ ములుక లవంగాలు నాగకేసరములు వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి బాలునికిచ్చిన దీర్ఘముగనుండెడి కాసలు మానును.

హిక్కా చికిత్స.

శ్లో॥ సువర్ణగైరికంపిష్ట్వామధునాసహలేహయేత్ ।
శీఘ్రంసుఖమవాప్నోతి తేనహిక్కార్దితః శిశుః ॥

తా॥ బంగారువర్ణముగల కావిరాయిని చూర్ణముజేసి తేనెలోకలిపి బాలులకు నాకించిన తక్షణమే వెక్కిళ్లు మానును.

అన్యచ్చ.

శ్లో॥ పిప్పలీరేణుకాక్వాథఃసహింగుస్సమధుఃకృతః ।
హిక్కాంబహువిధాంహన్యాదిదంధన్వంతరేర్వచః ॥

తా॥ పిప్పళ్లు రేణుకవిత్తులు వీటిని కషాయముపెట్టి వాటిలో వేల్చినయింగువ చూర్ణము తేనెవైచి బాలులకు పానముచేయించిన నానావిధ వెక్కిళ్లుమానును. ఇది ధన్వంతరిమతము.

అన్యచ్చ.

శ్లో॥ చూర్ణంకటుకరోహిణ్యామధునాసహయోజయేత్ ।
హిక్కాంప్రశమయేత్ క్షిప్రంఛర్దించాపిశిరోత్థితాం ॥

తా॥ కటుకరోహిణిచూర్ణము తేనెతోకలిపి బాలులకు నాకించిన శీఘ్రముగ వెక్కిళ్లుమానుటయేగాక బహుదినములుగనుండెడి కక్కులు మానును.

ఛర్ద్యతీసార చికిత్స.

శ్లో॥ యవానీకుటజారిష్టసప్తవర్ణపటోలకైః ।
లేహచ్ఛర్దిమతీసారంజ్వరంబాలస్యనాశయేత్ ॥

తా॥ ఓమము కొడిశపాలవిత్తులు వేప యేడాకులఅరటి చేదుపొట్ల వీటిని లేహముజేసి బాలునికిచ్చిన అతిసారము జ్వరము వాంతి వీటిని నశింపంజేయు.

ఛర్ది చికిత్స.

శ్లో॥ హరీతక్యాశృతంచూర్ణంమధునాసహలేహయేత్ ।
అథస్తాద్విహితేదోషేశీఘ్రంఛర్దిఃప్రశామ్యతి ॥

తా॥ కరకచూర్ణము తేనెతోఁగలిపి బాలునికి నాకించిన తక్షణమే వాంతి నిలుచుటయేగాక శరీర అథోభాగమునందుండు వేదనలు సగా మానును.

అ న్య చ్చ.

శ్లో॥ అశ్వత్థవల్కలంశుష్కందగ్ధంనిర్వాపితంజలే ।
తజ్జలంపానమాత్రేణచ్ఛర్దింజయతిదుర్జయాం ॥

తా॥ రావిపట్టనుయెండించి దానినికాల్చి బూడిదచేసి ఉదకమునందుగలిపి బాలులకు పానముచేయించిన వాంతులు మానును.

ఖదిరాది ఘృతము.

శ్లో॥ ఖదిరార్జునతాళీసకుష్ఠంచందనజేరసే ।
సక్షీరంసాధితంసర్పిర్వమథుంవినియచ్ఛతి ॥

తా॥ చండ్ర మద్ది తాళిసపత్రి చంగల్వకోష్టు చందనము వీటిని వొకటిగజేర్చి కషాయముబెట్టి అంబులో ఆవుపాలు నెయ్యి వీటిని సమముగజేర్చి ఘృతపక్వముగ పాకముజేసి బాలురకిప్పించిన వమనము నిలుచును.

ఛర్ద్యతీసార చికిత్స.

శ్లో॥ శలానాంజలముస్తానాంచూర్ణంపీతంసమాక్షికం ।
తృష్ణాంఛర్దిమతీసారంశిశూనాముద్ధతాంహరేత్ ॥

తా॥ నీటితుంగగడ్డలు చూర్ణముచేసి తేనెతోఁగలిపి బాలునికి నాకించిన దాహము వాంతి అతిసారము వీటినిపోఁగొట్టును.

ఛర్ది చికిత్స.

శ్లో॥ ఆమ్రాస్థిలాజసింధూత్థంసక్షౌద్రంఛర్దినుత్ భవేత్ ॥

తా॥ మామిడిపప్పు వరిపేలాలు సైంధవలవణము వీటిని చూర్ణముచేసి తేనెతోఁగలిపి బాలునికినాకించిన వాంతులు మానును.

వమనజ్వర చికిత్స.

శ్లో॥ ఘనశృంగీవిషాణాంచచూర్ణంహంతిసమాక్షికం ।
వాంతిజ్వరంతథాయోగోమధునాతివిషారజః ॥

తా॥ తుంగముస్తెలు కర్కాటకశృంగి అతివస వీటిని చూర్ణముచేసి తేనెతోగాని లేక అతివసచూర్ణము తేనెతోకలిపిగాని బాలునికినాకించిన వాంతులు జ్వరము వీటిని పోగొట్టును.

## క్షీరఛర్ది చికిత్స.

శ్లో॥ పీతంపీతంవమేద్యస్తు స్తన్యంతంమధుసర్పిషా ।
ద్వివార్తాకీఫలరసంపంచకోలంచలేహయేత్ ॥

తా॥ యేబాలుడు తాగినపాలును పాలుగానే కక్కునో వానికి చిన్నములక పెద్దములక వీటిఫలములరసము పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వీటిని చూర్ణముజేసి పైరసమునందుజేర్చి అందు తేనెవైచి బాలునికి పానముజేయించిన క్షీరఛర్ది మానును.

## హిక్కాఛర్ది చికిత్స.

శ్లో॥ పిప్పలీమధుకానాంచచూర్ణంసమధుశర్కరం ।
మాతులుంగరసేనైవహిక్కాఛర్దినివారణం ॥

తా॥ పిప్పళ్ళు అతిమధురము వీటిని చూర్ణముచేసి తేనె శర్కరవైచి మాదీఫల రసముతో బాలునికిచ్చిన వెక్కిళ్ళు వాంతులు వీటిని పోగొట్టును.

## దాహశమన చికిత్స.

శ్లో॥ పిప్పలీమధుకంజంబురసాలతరుపల్లవాః ।
చూర్ణోయంమధునాచేతితృష్ణాప్రశమనఃశిశోః ॥

తా॥ పిప్పళ్ళు అతిమధురము నేరేడిచిగుళ్లు మామిడిచిగుళ్లు వీటిని చూర్ణముజేసి తేనెతోకలిపి బాలునికి నాకించిన దాహము శమనమగును.

## అన్యచ్చ.

శ్లో॥ హింగుసైంధవపాలాశంచూర్ణమాక్షికసంయుతం ।
లీఢంనివారయత్యాశుశిశూనాముద్ధతాంతృషాం ॥

తా॥ ఇంగువ సైంధవలవణము మోదుగపట్ట వీటిచూర్ణములో తేనెవైచి కలిపి బాలునికినాకించిన దాహముమానును.

### అనాహ వాతశూల చికిత్స.

శ్లో॥ ఘృతేనసింధువిశ్వైలాహింగుభార్గీరజోలిహాః ।
ఆనాహవాతకంశూలంహన్యాత్తోయేనవాశిశోః ॥

తా॥ సైంధవలవణము శొంఠి యేలకులు ఇంగువ గంటుభారింగి వీటిని చూర్ణము చేసి తేనెతోగాని లేక నీళ్లతోగాని కలిపి బాలునికి నాకించిన ఆనాహ వాతశూలను పోగొట్టు.

### రోదన నివారక చికిత్స.

శ్లో॥ పిప్పలీత్రిఫలాచూర్ణంఘృతక్షౌద్రపరిప్లుతః ।
బాలోరోదతియస్తస్మై లీఢుందద్యాత్సుఖావహం ॥

తా॥ పిప్పలి కరక తాండ్ర వుసిరికలు వీటిని చూర్ణముచేసి అందు తేనె నెయ్యిపై చికలిపి బాలునికినాకించిన రోదనముమాని సుఖమును జెందు.

### విరేచనమునకు లేపము.

శ్లో॥ పిష్ట్వాగంధర్వబీజానిత్వాఖువిటనింబువారిణా ।
నాభౌగుదే[illegible]లేపేనశిశూనాంరేచనంపరం ॥

తా॥ ఆముదపుపప్పు ఎలుకపెంటికలు వీటిని వేపాకురసముచే బాగుగనూరి బాలుని గుదము బొడ్డు వీటియందు లేపనముచేసిన విరేచనమగు.

### మృత్తికాభక్షణ విరేచనము.

శ్లో॥ ఇంద్రలోచననేత్రాణిశిఖిభాగంహియోజయేత్ ।
త్రుటిగంధకముర్దాఢశతపుష్పావిచూర్ణితాః ।
మాషద్వయంగవాంముగ్ధైః సేవయేద్దినపంచకం ।
రేచయేన్మృత్తికాంశుద్ధాంశిశూనాంహితమౌషధం ॥

తా॥ సన్నఏలకులు 1 భాగము గంధకము 2 భాగములు ముదారశింగు 3 భాగములు పెద్దసదాప 3 భాగములు వీటిని చూర్ణముచేసి 2 మాషములయెత్తు ఆవుపాలలోకలిపి 5 దినములు బాలునికి పానముజేయించిన కుక్షియందు జేరియుండిన కృత్తిమ విరేచనమువలన బయలువెడలు.

## కార్శ్య చికిత్స.

శ్లో॥ యదాతు దుర్బలో బాలః ఖాదన్న పిచవన్ప్రిమార్గ । విదారీ
కన్దగోధూమ యవచూర్ణం ఘృతప్లుతం । ఖాదయేత్త దను
క్షీరం శృతం సమధుశర్కరం । సౌవర్ణ సుకృతం చూర్ణం కుష్ఠం
మధుఘృతం వచా । మత్స్యాక్షకః శంఖపుష్పీ మధుసర్పిస్స
కాంచనం । అర్కపుష్పీఘృతం క్షౌద్రం చూర్ణితం కనకం వచా ।
సహేమచూర్ణం కైడర్యం శ్వేతదూర్వా ఘృతం మధు ।
చత్వారోభిహితాః ప్రాశ్యా అర్ధశ్లోక సమాపనాః । కుమా
రాణాం వపుర్మేధా బలపుష్టికరాస్స్మృతాః ॥

తా॥ బాలుడు యెంత ఆహారముజేసినను దుర్బలుడుగనుండెనేని నేలగుమ్ముడు గోధుమలు యవలు వీటిని చూర్ణముచేసి నేతితో కలిపి బాలునికిచ్చి తత్క్షణమే పాలలో శర్కర తేనెవైచి పానము జేయించవలయు. లేక అత్తిపండ్ల చూర్ణము చెంగల్వకోష్టు వస వీటిని చూర్ణముచేసి తేనె నెయ్యివైచి మిశ్రమము జేసి నివ్వవలయు లేక పొన్నగంటి వెలుమసంధి అత్తిపండ్లు వీట్లను చూర్ణముజేసి తేనె నెయ్యివైచి మిశ్రమముచేసి నివ్వవలయు. లేక జిల్లేడిపువ్వులు అత్తిపండు వీటిని చూర్ణముచేసి తేనె నెయ్యివైచి నివ్వవలయు. లేక అత్తిపండు కాయఫలము తెల్లగరిక వీటిచూర్ణమును తేనె నెయ్యి వీటితో. మిశ్రమముజేసి నివ్వవలయు. ఈ 5 విధములలో నేదైన నొక చికిత్సజేసిన బాలునికి శరీరపుష్టి బుద్ధి బలము వీటిని గలుగంజేయు.

## లాక్షాది తైలము.

శ్లో॥ లాక్షారసేసమం తైలం మస్తువ్యథచతుర్గుణే ।
రాస్నాచందనకుష్ఠాబ్దవాజిగంధానిశాయుతైః ।
శతాహ్వాదారుయష్ట్యాహ్వా । మూర్వాతిక్తాహరేణుభిః ।
సంసిద్ధం జ్వరరక్షోఘ్నం బలవర్ణకరం శిశోః ॥

తా॥ లక్కకషాయమునందు సమముగ తిలతైలమువైచి దానికి నాలుగింతలు మజ్జిగచేట నన్నరాష్ట్రిము చందనము చెంగల్వకోష్టు తుంగముస్తెలు పెన్నేరుగడ్డ వసపు పిల్లపీచర దేవదారు అతిమధురము చాగ కటుకరోహిణి రేణుక బీజములు

వీట్లను సమభాగములుగ చూర్ణముచేసి అందుపైచి తైలము సిద్ధపరచి బాలునికి అభ్యంజనముచేయించిన జ్వరము రాక్షసబాధ ఇవి తొలగుటయేగాక బలము కాంతి వీటిని సగాగలుగంజేయు.

అశ్వగంధి ఘృతము.

శ్లో॥ పాదకల్కేఽశ్వగంధాయాః క్షీరేష్టగుణితేపచేత్ ।
ఘృతందేయంకుమారాణాంపుష్టికృత్ బలవర్ధనం ॥

తా॥ పెన్నేరుగడ్డకల్కము 1 భాగము పాలు 8 భాగములు కిటియందు తగు మాత్రము నెయ్యిపైచికాచి ఘృతమును సిద్ధపరిచి బాలులకు పానము చేయించిన బలము పుష్టి వీటిని గలుగంజేయు.

వాపులకు లేపము.

శ్లో॥ ముస్తాకూష్మాండబీజానిభద్రదారుకలింగకాః ।
పిష్ట్వాతోయేనసంలింపేల్లేపోయంశోఫహాచ్ఛిశోః ॥

తా॥ తుంగముస్తెలు బూడిదెగుమ్మడువిత్తులు దేవదారు కొడిశపాలవిత్తులు వీటిని సమముగ ఉదకముతోనూరి బాలునిశరీరమునకు లేపనముచేసిన వాపులు మానును.

నాభియందు కలిగెడి వాపులకు చికిత్స.

శ్లో॥ మృత్పిండేనాగ్నితప్తేనక్షీరసిక్తేనశోష్మణా ।
స్వేదయేదుత్థితాంనాభింశోఫస్తేనోపశామ్యతి ॥

తా॥ మంటిపెంటను అగ్నియందుపైచికాచి వాటిపై పాలుచిలికించి హితోష్ణముగనుండునపుడు బాలునినాభియందు నొత్తడమిచ్చిన వాపులు మానును.

నాభివ్రణ చికిత్స.

శ్లో॥ నాభీపాకేనిశాలోధ్రప్రియంగుమధుకైఃశ్రుతం ।
తైలమభ్యంజనేశస్తమేభిశ్చూర్ణైశ్చావధూలనం ।
దుగ్ధేనచాగశకృతానాభిపాకేనమార్జనం ।
త్వక్చూర్ణైః క్షీరిణాంవాపికుర్యాచ్ఛుంఠరేణునా ॥

తా॥ శిశువునకు నాభియందు వ్రణము కలిగెనేని పసపు లొద్దుగచెక్క ప్రేంకణపు కొజ్జులు అతిమధురము వీటిని కషాయముబెట్టి అందు నువ్వులనూనెపైచి తైలము సిద్ధ

పరచి బాలునికి అభ్యంజనము జేయించుటయేగాక పైజెప్పిన ఔషధములయొక్క చూర్ణముగాని మేకపెంటికలను పాలతోనూరిగాని లేక లవంగపట్ట చందనము క్షీరవృక్షము వీట్లనునూరిగాని నాభికి లేపనముజేసిన నాభివ్రణములు మానును.

## గుదపాక చికిత్స.

శ్లో॥ గుదపాకేతుబాలానాంపిత్తఘ్నీంకారయేత్ క్రియాం ।
రసాంజనంవిశేషేణపానలేపనయోర్హితం ।
శంఖయష్ట్యాంజనైశ్చూర్ణంశిశూనాంగుదపాకనుత్ ॥

తా॥ బాలునికి గుదపాకముగలిగెనేని పిత్తనాశకక్రియలు చేయవలయును శంఖము అతిమధురము రసాంజనము వీటినినూరి బాలునిగుదమునందు లేపనము చేసిన నది మానును.

## క్షతాదికమునకు చికిత్స.

శ్లో॥ పటోలత్రిఫలారిష్టహరిద్రాక్వథితంపిబేత్ ।
క్షతవిస్ఫోటజ్వరాణాంశాంతయేబాలకస్యచ ॥

తా॥ చేదుపొట్ల కరక తాండ్ర ఉసిరికలు వేప పసపు వీటిని కషాయముబెట్టి బాలునికి పానముచేయించిన గాయము కురుపులు జ్వరము యివి శాంతినిజెందు.

## సిధ్మ పామ విచర్చిక వీట్లయొక్క చికిత్స.

శ్లో॥ గృహధూమనిశాకుష్ఠరాజకేంద్రయవైః శిశోః ।
వేపస్తక్రేణహంత్యాశుసిధ్మపామావిచర్చికాః ॥

తా॥ కరుధూపము పసపు చెంగల్వకోష్టు పెసలు కొడిశపాలవిత్తులు వీటిని మజ్జిగతోనూరి బాలునికి లేపనముజేసిన శిబ్బెము తీట కుష్టువు ఇవిమానును.

## తాలుపాక చికిత్స.

శ్లో॥ తాలుపాకేయవక్షారమధుభ్యాంప్రతిసారణం ॥

తా॥ యవక్షారము తేనెతో కలిపి వ్రేలితో దవడలయందు లేపనముజేసిన బాలునికి గలిగియుండిన తాలుపాకము నివర్తించును.

దంతపాలిరోగ చికిత్స.

శ్లో॥ దంతపాలింతుమధునాచూర్ణేనప్రతిసారయేత్ ।
ధాతకీపుష్పపిప్పల్యోర్ధాత్రీఫలరసేనవా ।
దంతోత్థానభవారోగాః పీడయంతినబాలకం ॥

తా॥ ఆరెపువ్వు పిప్పళ్లు వీటినిచూర్ణముచేసి ఉసిరికాయలరసముతోచేర్చి అందు తేనెవైచి బాలుని దంతములకుపైనుండు చిగుళ్లకు లేపనముజేసిన దంతరోగముమానును.

దంతోద్భవకాలమునందు జనించెడి రోగములకు చికిత్స.

శ్లో॥ జాతేదంతేహిశామ్యంతియత్రస్థేతుకాగదాః ।
ప్రాచీగతంపాండురసింధువారమూలంశిశూనాంగలకేనిబద్ధం ।
హితోతిదంతోద్భవవేదనాంచనిశ్శేషమేకాండకురండమేవ ॥

తా॥ దంతములుజనించు కాలమున శిశువులకు ఏరోగముజనించినను తూర్పు దిక్కుయందుండు తెల్లవావిలివేరును బాలులకంఠమునందు రక్షగట్టిన అవి మానుటయే గాక ఏకపార్శ్వపుబీజదోషము సగా నివర్తియగు.

పిప్పల్యాది ఘృతము.

శ్లో॥ పిప్పలీధాతకీపుష్పధాత్రీఫలకశేరుభిః । వచామూర్వామృతా పాఠా కటుకాతి విషాఘనైః॥ జీవనీయైర్ఘృతంసిద్ధంశస్తందశన జన్మని। సుఖోష్ణేనయథామాత్రంపయసైతత్ప్రపాయయేత్ ॥

తా॥ పిప్పళ్లు ఆరెపువ్వు ఉసిరికపండు భద్రముస్తెలు వస చాగ తిప్పతీగ చిరుబొద్ది కటుకరోహిణి అతివస తుంగముస్తెలు జీవనీయగణద్రవ్యములు వీటినన్నియు సమముగజేర్చి బాగుగనూరి కల్కముజేసి ఆవునేతిలో కలిపి ఘృతపాక విధిగా పాకముజేసి వయోబలాద్యను గుణముగ సుఖోష్ణముగనుండు ఆవుపాలలోకలిపి శిశువులకు పానముజేయించిన వారికి జ్వరాద్యుపద్రవములులేకయే దంతములు జనించును ఇది బాలురకు దంతములు మొలుచునపుడుకలుగు జ్వరములకు ముఖ్యము.

వచాది ఘృతము.

శ్లో॥ వచాదిబృహతీపాఠాకటుకాతివిషాఘనైః ।
మధురైశ్చఘృతంసిద్ధంసిద్ధందశనజన్మని ॥

తా॥ వస చిన్నములక పెద్దములక చిరుబొద్ది కటుకరోహిణి అతివస తుంగముస్తెలు మధురగణద్రవ్యములు వీటిని కల్కముజేసి ఆవునెయ్యిపోసి ఘృతపక్వముగ పాకముజేసి బాలురకిప్పించిన త్వరలో దంతములు మొలచును.

## ముఖపాకమునకు గండూష చికిత్స.

శ్లో॥ జాతీపత్రామృతంద్రాక్షాపాఠాద్రవ్యైః ఫలత్రికైః ।
క్వాథః క్షౌద్రయుతశ్శీతః గండూషో ముఖపాకజిత్ ॥

తా॥ జాజిఆకులు ద్రాక్ష అగళుశొంఠి కరక తాండ్ర ఉసిరికలు వీటిని కషాయముబెట్టి చల్లార్చి అందు పాలు తేనెవైచి వెళ్లిగలపరుండి 100 లేక 80 మాత్రలకాలము నోటియందుంచుకొనిన బాలునికి ముఖపాకము మానును.

## ముఖస్రావ చికిత్స.

శ్లో॥ సారివాతిక్తలోధ్రాణాంకషాయో మధుకస్యచ ।
సంస్రావినీముఖేశస్తోధావనార్థంశిశోస్సదా ॥

తా॥ సుగంధపాల నేలవేము లొద్దుగచెక్క అతిమధురము వీటిని కషాయముబెట్టి బాలునినోటియందువైచి కడిగిన నోటియందు కారెడి జొల్లులు మానును.

## అన్యచ్చ.

శ్లో॥ ముఖపాకేతుబాలానామామ్రమసారమయోరజః ।
గైరికంక్షౌద్రసంయుక్తంభేషజంచరసాంజనం ॥

తా॥ మామిడిబంక లోహభస్మము కావిరాయి రసాంజనము వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి బాలునినోటికి లేపనముజేసిన (ముఖపాకమనగా) నోటియందు కారెడి జొల్లులు మానును.

## అన్యచ్చ.

శ్లో॥ దార్వీయష్ట్యాభయాజాతీపత్రక్షౌద్రైస్సుధావనం ।
అశ్వత్థత్వక్దళక్షౌద్రైర్ముఖపాకేప్రలేపనం ॥

తా॥ మానిపసపు అతిమధురము కరక జాజిఆకులు వీటిని చూర్ణముజేసి తేనెవైచి బాలుని నోటియందు ఘర్షణజేసిన నోటియందు కారెడి జొల్లులు మానును.

తాలుకంటకరోగ చికిత్స.

శ్లో॥ హరీతకీవచాకుష్ఠకల్కంమాక్షికసంయుతం।
పీత్వాకుమారః స్తన్యేనముచ్యతేతాలుకంటకాత్॥

తా॥ కరక వస చెంగల్వకోష్ఠు వీటిని కల్కముజేసి అందు తేనెచేర్చి స్తన్యముతో కలిపి బాలునికి పానముజేయించిన తాలుకంటకరోగము మానును.

మూత్రకృచ్ఛ్ర చికిత్స.

శ్లో॥ మేఘూమృతా నాగర వాజగంధా ధాత్రీ త్రికంటై ర్విహితః కషాయః। క్షౌద్రేణపీతశ్శమయత్యవశ్యం మూత్రస్యకృఛ్రం పవనప్రభూతం॥

తా॥ వట్టివేరు తిప్పతీగ శొంఠి పెన్నేరుగడ్డ ఉసిరికవాలుపు పల్లేరు వీట్లను కషాయముబెట్టి అందు తేనెవైచి బాలునికి పానముజేయించిన మూత్రకృఛ్రముమానును.

శ్లేష్మజ మూత్రకృఛ్ర చికిత్స.

శ్లో॥ యవక్షారయుతఃక్వాథఃస్వాదుకంటకసంభవః।
పీతప్రణాశయత్యాశుమూత్రకృఛ్రంకఫోద్భవం॥

తా॥ యవక్షారము పల్లేరు వీటిని కషాయముబెట్టి శిశువుకు పానముజేయించిన శ్లేష్మమువలన జనించిన మూత్రకృఛ్రము మానును.

వాతజరోగ చికిత్స.

శ్లో॥ ఏరండతైలంసపయః పిబేద్వాగవ్యేనమూత్రేణతదేవపీత్వా।
సగుగ్గులుఃప్రౌఢరుజంప్రవృద్ధాంసవాతవృద్ధింసహసానిహంతి॥

తా॥ ఆముదమునందు గోక్షీరముగాని లేక గోమూత్రముగాని వైచి అందు గుగ్గులచూర్ణమునుజేర్చి బాలులకు పానముజేయించిన వాతరోగము నశించు.

మూత్రగ్రహమునకు చికిత్స.

శ్లో॥ కణోషణసితాక్షౌద్రసూక్ష్మైలాసైంధవైఃకృతః।
మూత్రగ్రహేప్రయోక్తవ్యః శిశూనాంలేహఉత్తమః॥

తా॥ పిప్పళ్లు శొంఠి మిరియాలు సన్నఏలకులు సైంధవలవణము వీటిని చూర్ణము చేసి శర్కరవైచి లేహపక్వముగాజేసి బాలునికిచ్చిన మాత్రగ్రహము తొలగు.

## గండమాల చికిత్స.

శ్లో॥ వనకర్పాసికామూలంతండులైస్సహయోజితం ।
పక్త్వాతుపోలికాంఖాదేదపచీనాశకారిణీం ॥

తా॥ అడవిపత్తివేరు బియ్యము ఈరెంటినినూరి రొట్టెకాల్చిబాలునిభుజింప జేసిన గండమాలలు మానును.

## ఉన్మాద చికిత్స.

శ్లో॥ శిరీషనక్తమాలానాంబీజై రంజితలోచనః ।
చిత్తోన్మాదంనిహంత్యాశుసాపస్మారాపతంత్రికం ॥

తా॥ దిరిశినపువిత్తులు కానుగవిత్తు వీటినిచాది బాలునికన్నులయందు కల్కము వైచిన చిత్తోన్మాదము అపస్మారము అపతంత్రము ఇవినశించు.

## రక్తపిత్తమునకు చికిత్స.

శ్లో॥ వాసాయాః స్వరసః పీతః సితామధు సమన్వితః ।
పర్ణైశ్చవటరోహిణ్యాంరక్తపిత్తంవినాశయేత్ ॥

తా॥ అడ్డసరపురసముతో తేనె శర్కరకలిపిగాని లేక మఱ్ఱిచిగుళ్లకల్కము నందు తేనె శర్కరకలిపిగాని బాలునికి పానముజేయించిన రక్తపిత్తముమానును.

## అన్యచ్చ.

శ్లో॥ పాలాశపుష్పక్వాథేన వాసాయాః సర్వసేనవా ।
చతుర్గుణేన సంసిద్ధ రక్తపిత్త హారంఘృతం ॥

తా॥ మోదుగపువ్వుకషాయము 4 భాగములు నెయ్యి 1 భాగము చేర్చిగాని లేక అడ్డసరపుస్వరసము 4 భాగములు నెయ్యి 1 భాగము చేర్చిగాని ఘృతపక్వముగా కాచి బాలునికి పానముజేయించిన రక్తపిత్తము నశించు.

## ముక్కుయందు రక్తముపడిన వాటికి చికిత్స.

శ్లో॥ రసోదాడిమ పుష్పాణాం దూర్వాయాః స్వరసేనవా ।
నస్యేన నాశయేత్తూర్ణం నాసికా రక్తముద్ధతం ॥

తా॥ దాళింబపువ్వులరసముచేగాని లేక గరికస్వరసముచేగాని నస్యముచేయించిన బాలునికి ముక్కుయందు స్రవించెడి రక్తము నిలుచును.

## వాతగుల్మ చికిత్స.

శ్లో॥ త్రికటుకమజమోదాస్సైంధవం జీరకేద్వేసమచరణధృతానామష్టమోహింగుభాగః । ప్రథమకబళభోజీసర్పిషాచూర్ణమేతజ్జనయతిజఠరాగ్నింవాతగుల్మంనిహంతి ॥

తా॥ శొంఠి మిరియాలు పిప్పళ్లు ఓమము సైంధవలవణము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ ఇంగువ వీటిని సమభాగములుగ చూర్ణముజేసి తొలుతటి కబళములో ఈచూర్ణముచేర్చి నెయ్యివైచి పుచ్చుకొనిన బాలునికి అగ్నిపుష్టిగలుగుటయేగాక వాతగుల్మము పగానశించు.

## వాతరోగ చికిత్స.

శ్లో॥ పునర్నవైరండనవాతసీభిః కార్పాసజైరస్థిభిరారనాళైః ।
స్విన్నైశ్చరమీభిస్త్రివృతిసద్భిరేవస్వేదఃసమీరార్తిహరోనరాణాం॥

తా॥ తెల్లగలిజేరువేరు ఆముదపువేరు అగసివిత్తులు ప్రత్తివిత్తులు వీటిని కాంజికముతోనూరి వెచ్చనచేసి బాలునిశరీరమునకు వొత్తడమిచ్చిన వాతరోగము నశించునని వైద్యులు వచించెదరు.

## అపస్మార చికిత్స.

శ్లో॥ కూష్మాండకరసంకృత్వామధుకంపరిపేషయేత్ ।
అపస్మారవినాశాయతత్పిబేత్సప్తవాసరాన్ ॥

తా॥ బూడిదెగుమ్మడుకాయరసమునందు అతిమధురచూర్ణమువైచి 7 దినములు బాలునికి పానముచేయించిన అపస్మారజాడ్యము తొలుగు.

## అన్యచ్చ.

శ్లో॥ గోసర్పిస్సాధితంపూతందధిక్షీరశకృద్రసైః ।
చాతుర్థికంజ్వరోన్మాదంసర్వాపస్మారనాశనం ॥

తా॥ ఆవునెయ్యిలో పెరుగు పాలు పేడరసము వీటిని చేర్చి ఘృతపక్వముగ కాచి వడియకట్టి బాలునికి పానముచేయించిన చాతుర్థిక జ్వరము ఉన్మాదము సంపూర్ణాపస్మారజాడ్యము వీటిని నశింపజేయును.

## గుదావర్త చికిత్స.

శ్లో॥ హింగుమాక్షికసింధూత్థై కృత్వావర్తింసవర్తితాం ।
ఘృతాభ్యక్తాంగుదేదద్యాత్ గుదావర్తావనాశనీం ॥

తా॥ ఇంగువ తేనె సైంధవలవణము వీటినినూరి వస్త్రమునకు లేపనముచేసి వత్తినొనర్చి ఆవత్తిని నేతియందుతడిపి బాలుని గుదద్వారమునందుంచిన గుదావర్తము మానును.

## హృద్రోగ చికిత్స.

శ్లో॥ శుంఠీకణాపుష్కరకేశికీమాంవిధాయచూర్ణంకకుభత్వచోవా ।
రాస్నాన్వితంవా మధునావలీఢం హృద్రోగమేతచ్ఛమ
యత్యుదగ్రం ॥

తా॥ శొంఠి పిప్పలి పుష్కరమూలము ముగిలి వీటిచూర్ణములోగాని లేక అర్జునవృక్షపుపట్ట సన్నరాష్ట్రము వీటియొక్క చూర్ణములోగాని తేనెచ్చి బాలునికిచ్చిన హృద్రోగము మానును.

## మూర్ఛా చికిత్స.

శ్లో॥ కోలాస్థిపద్మకోశీరచందనంనాగకేసరం ।
లీఢంచౌద్రేణబాలానాంమూర్ఛానాశనముత్తమం ॥

తా॥ రేగుపిక్కలు తామరదుంప వట్టివేరు చందనము నాగకేసరములు వీటిని చూర్ణముచేసి తేనెకలిపి బాలునకిచ్చిన మూర్ఛారోగము నశించు.

జ్వరయుక్త మూర్ఛా చికిత్స.

శ్లో॥ ద్రాక్షమామలకేస్విన్నంపిష్ట్వాక్షౌద్రేణసంయుతం ।
సర్వదోషభవాంమూర్ఛాంసజ్వరాంనాశయేద్ధ్రువం ॥

తా॥ ద్రాక్ష వుసిరికకాయలు వీట్లనువుడికించి పిదపనూరి తేనెవైచి బాలునికిచ్చిన జ్వరయుక్తముగ నుండెడి మూర్ఛరోగము మానును.

తాపమునకు చికిత్స.

శ్లో॥ పద్మకంచందనంతోయముశీరంశ్లక్ష్ణచూర్ణితం ।
క్షీరేణపీతంబాలానాందాహంశమయతిధ్రువం ॥

తా॥ తామరతూండ్లు చందనము కురువేరు వట్టివేరు వీట్లను చూర్ణముచేసి పాలలోవైచి బాలులకు పానముజేయించిన తాపము మానును.

సంతాప చికిత్స.

శ్లో॥ కర్పూరచందనోశీరలిప్తాంగంకట్ఫలైరపి ।
పల్లవప్రస్తరేధీమాంస్థాపయేద్దాహపీడితం ॥

తా॥ పచ్చకర్పూరము వట్టివేరు చందనము కాయఫలము వీటిని ఉదకముచే నూరి శరీరమునకు లేపనముచేసి చిగురుటాకులపరుపుయందు బాలుని శయనింపజేసిన తాపము మానును.

క్రిమిరోగ చికిత్స.

శ్లో॥ ముస్తావిడంగంమగధాఖుపర్ణీకంపిల్లకోదాడిమబైల్వకేన ।
కృమీన్హరేత్సత్వరముగ్రవేగాన్రోగేషులీఢం శమయత్యసంశయం ॥

తా॥ తుంగముస్తెలు వాయువిడంగములు పిప్పళ్ళు యెలికచెవ్విఆకు కంపిల్లకము దాడిమవలుపు బిల్వఫలము వీటిని చూర్ణముచేసి తేనెచేర్చి బాలునకిచ్చిన గాఢమగు క్రిములు నశించు.

పాండురోగాది చికిత్స.

శ్లో॥ యవచూర్ణంక్రిమిరిపుమగధామధునాసహ ।
భక్షయేత్పాండురోగఘ్నంపంక్తిశూలంహరింపరం ॥

తా॥ యవక్షారము వాయువిళంగములు పిప్పళ్లు వీటిని చూర్ణముచేసి తేనె కలిపి బాలునకిచ్చిన పాండురోగము ప్లీహశూల వీటిని నశింపజేయు.

## శ్లేష్మజ స్వరభేద చికిత్స.

శ్లో॥ మాగధీమాగధామూలంనాగరంమరిచాన్వితం ।
క్షౌద్రేణలీఢంకఫజంస్వరభేదంవ్యపోహతి ॥

తా॥ పిప్పళ్ళు మోడి శొంఠి మిరియాలు వీటినిచూర్ణముజేసి తేనెతో కలిపి బాలునికి నాకించిన కఫమువలన జనించిన స్వరభేదము నివర్తియగు.

## పిత్తజ స్వరభేద చికిత్స.

శ్లో॥ షష్ట్యాహ్వాజీవనీమూర్వాక్షోలీవటసుసాధితం ।
పేయంపిత్తోద్భవంహంతిస్వరభేదంసుదారుణం ॥

తా॥ అతిమధురము చాగ రేగు మఱ్ఱిచిగుళ్ళు వీటిని కషాయముబెట్టి బాలునికి పానముజేయించిన పిత్తమువలన జనించిన స్వరభేదమును తొలగంజేయు.

## పాండురోగ చికిత్స.

శ్లో॥ అయోరజై స్తైఫలచూర్ణయుక్తై ర్గోమూత్రసిద్ధై ర్మధునావ
లీఢైః । పాండుంస కాసంచ సతక్రపథ్యం శూలంసమూలం
శమయేదవశ్యం ॥

తా॥ లోహభస్మము కరక తాండ్ర వుసిరికలు వీటిని గోమూత్రముతో భావన జేసి తేనె అనుపానముతోయిచ్చి మజ్జిగ అన్నముబెట్టిన బాలునికిజనించిన పాండురోగము దగ్గు శూల వీటిని అవశ్యముగ నశింపజేయు.

## క్షయరోగ చికిత్స.

శ్లో॥ శిలాజితువ్యోమవిడంగలోహతాప్యాభయార్విహితోవలేహః।
సర్పిర్మధుభ్యాంవిధినాప్రయుక్తంక్షయంవిధత్తేసహసాక్షయస్య॥

తా॥ శిలాజతుభస్మము అభ్రకభస్మము లోహభస్మము స్వర్ణమాక్షికభస్మము కరకపిందెలు వాయువిడంగములు వీటిని చూర్ణముచేసి నెయ్యి తేనెతో కలిపి బాలులకు నాకించిన క్షయరోగము నశించు.

శరీరపుష్టికర చికిత్స.

శ్లో॥ నవనీతంసితాక్షౌద్రంలీఢ్వాక్షీరభుజఃపరం ।
కరోతిపుష్టింకాంయస్యక్షతక్షయమపోహతి ॥

తా॥ వెన్న శర్కర తేనె వీటిని మిశ్రమముజేసి భక్షింపజేసి పాలు అన్నము భుజింపజేసిన బాలునికి శరీరము పుష్టి జెందుటయేగాక క్షయము సగా తొలగు.

శ్వాసకాస వీటి చికిత్స.

శ్లో॥ వాసా మహౌషధావ్యాఘ్రీ గుడూచీభిః శృతంజలం ।
ప్రపీతం శమయత్యుగ్రం శ్వాసంకాస మపోహతి ॥

తా॥ అడ్డసరము శొంఠి ములక తిప్పతీగ వీటిని కషాయముపెట్టి బాలునికి పానముజేయించిన శ్వాస దగ్గు ఇవి మానును.

కంటకారీ ఘృతము.

శ్లో॥ కంటకార్యా బృహత్యాశ్చ భార్గీ వాసకయోరపి । స్వరసేన తథాచాగ క్షీరేణ విపచేద్ఘృతమ్ ॥ కల్కైః కరికణాకృష్ణా మరిచై ర్మధుకేనచ । వచాగ్రంథిక మాంసీభి శ్చవ్య చిత్రక చందనైః ॥ ముస్తామృతామలయజై ర్యవాన్యాజీరకేణచ । బలా విశ్వౌషధాభ్యాంచ ద్రాక్షాదాడిమదారుభిః ॥ సిద్ధమేత ద్ఘృతంసద్యః శిశూనాం శ్వాసకాసహృత్ । జ్వరారోచక శూలఘ్నం కఫహృద్బలవహ్నికృత్ ॥

తా॥ వాకుడు పెద్దములక గంటుభారంగి అడ్డసరము వీటి రసములు మేక పాలు వీటిని ప్రత్యేకముగ సమాంశములుగ గ్రహించి ఆవునెయ్యి 1 ప్రస్థముజేర్చి అందులో ఏనుగపిప్పళ్ళు పిప్పళ్ళు మిరియాలు యష్టిమధుకము వస మోడి జటామాంసి చవ్యము చిత్రమూలము చందనము తుంగముస్తెలు తిప్పతీగ కుంకుమపువ్వు వాజీపూలు జీలకఱ్ఱ ముత్తవపులగము శొంఠి ద్రాక్షపండు దానిమ్మపండు దేవదారు వీటిని సమభాగములుగ గ్రహించి కల్కముజేసి కలిపి పాకముజేసి జాఠరాగ్ని బలానుగుణముగ శిశువులకు పానముజేయించిన శ్వాసము కాసము జ్వరము అరోచకము

కఫోపద్రవములు యివి తొలఁగి శరీరమునకు బలము అగ్నిదీపనము యివి కలుగును. ఈఘృతము బాలులకు ప్రశస్తంబు.

## స్ఫోటకజ్వర చికిత్స.

శ్లో॥ చందనోవాసకోముస్తాగుడూచీద్రాక్షయాసహ ।
ఏతచ్ఛీతఃకషాయస్తుశీతలాజ్వరనాశనః ॥

తా॥ రక్తచందనము అడ్డసరము తుంగముస్తెలు తిప్పతీగ ద్రాక్ష వీటిని కషాయముబెట్టి చల్లార్చి బాలునికి పానముజేయించిన స్ఫోటకమువలన జనించిన జ్వరము తొలఁగు.

## నేత్రరోగ చికిత్స.

శ్లో॥ ససైంధవం లోధ్రమథాజ్యభృష్టం సౌవీరపిష్టం సితవస్త్రబద్ధం । అశ్చ్యోతనం తన్నయనస్య కుర్యాత్కండూంచ దాహంచ రుజంచహన్యాత్ ॥

తా॥ సైంధవలవణము లొద్దుగచెక్క వీటిని చూర్ణముజేసి తేనె నెయ్యి నురుమారాయిచూర్ణము వీటినన్నిటిని నేకముగచేర్చి తెల్లని వస్త్రమునందుకట్టి మాటిమాటికి కన్నులయందు వొత్తుచుండిన దురద దాహము ఇవి నశించు.

## దాహాదిక చికిత్స.

శ్లో॥ చందనంమధుకంలోధ్రంజాతీపుష్పాణిగైరికం ।
ప్రలేపోదాహరోగఘ్నస్తోయాభిష్యందనాశనః ॥

తా॥ చందనము అతిమధురము లొద్దుగచెక్క జాజిపువ్వులు కావిరాయి వీటిని నూరి శరీరమునకు లేపనముజేసిన దాహము సా్రవము అభిష్యందము వీటిని నశింపంజేయు.

## నేత్రరోగమునకు లేపనము.

శ్లో॥ వ్యోషంచశృంగంచమనశ్శిలాంచ కరంజబీజంచసుపిష్టమేతత్ ।
కండ్వార్దితానా మథపక్ష్మనాంతు శ్లేష్మంశిశూనాం నయనే విదధ్యాత్ ॥

తా॥ శొంఠి మిరియాలు పిప్పళ్లు దుష్ప్కొమ్మ మనశిల కానుగవిత్తు వీటిని నీటియందుచాది నేత్రములకువేసిన రెప్పలయందు జనించిన దురద మానును.

వాక్ఛుద్ధికరవచాది చూర్ణము.

శ్లో॥ వచాయష్ట్యాహ్వ సింధూత్థ పధ్యా నాగరదీప్యకైః ॥
శుద్ధ్యతే వాఘ్ధలిర్లీఢై స్సకుష్ఠ కణజీరకైః ॥

తా॥ వస యష్టిమధుకము సైంధవలవణము కరక్కాయ ఓమము శొంఠి చంగల్వకోష్టు పిప్పళ్ళు జీలకఱ్ఱ వీటిని సమభాగములుగ చూర్ణముచేసి నేతిలోకలిపి బాలులకునాకించిన వాక్కు స్ఫుటముగా నగును.

బాలురకు స్రోతశ్శుద్ధి కరౌషధము.

శ్లో॥ స్థిరావచాద్వి బృహతీ కాకోళీ పిప్పలీవత్రైః ।
నిచులోత్పల వర్షా భూ భార్జ్గీ ముస్తైశ్చకార్షికైః ॥
సిద్ధం ప్రస్థార్ధమాజ్యస్య స్రోతసాం శోధనంపరమ్ ।
సింహ్యాశ్వగంధా సురసా కణాగర్భంచ తద్గుణమ్ ॥

తా॥ ముయ్యాకుపొన్న వస పెద్దములక చిన్నములక కాకోళి పిప్పళ్ళు గ్రంధితగరము నీరుప్రబ్బలి నల్లకలువ గలిజేరు గంటుభారంగి తుంగముస్తెలు వీటిని దినమునకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి ½ ప్రస్థమావునేతిలోకలిపి ఘృతపాక విధిగ పక్వముచేసి యిప్పించిన బాలురకు స్రోతస్సులు శుద్ధమగును. మఱియు ములక పెన్నేరుగెడ్డ తులసి పిప్పళ్లు వీటికల్కమును చేర్చి పక్వముచేయబడిన ఘృతము నిప్పించిన స్రోతస్సులు శుద్ధమగును.

బాలుర కభ్యంజన తైలము.

శ్లో॥ వచావయస్థాతగరకాయస్థాచోరకైశ్శృతమ్ ।
బస్తమూత్రసురాభ్యాంచతైలమభ్యంజనేహితమ్ ॥

తా॥ వస ఉసిరికెపరుగు గ్రంథితగరము కరక్కాయలు చండయను గ్రంథ్యము వీటినినూరి నువ్వులనూనెలోకలిపి అందులో గొఱ్ఱెమూత్రము సురయనుమద్యము వీటిని బోసి విధిప్రకారము పక్వముచేసి బాలుర కభ్యంజనముచేయించిన హితము కలుగును.

## తిమిరరోగ చికిత్స.

శ్లో॥ శంఖస్యభాగా శ్చత్వారో తదర్ధేనచ పిప్పలీ ।
వారిణా తిమిరంహంతి అర్బుదం హంతిమస్తునా ।
చిపిటం మధునాహంతి స్త్రీక్షీరేణ తదుద్భవం ॥

తా॥ శంఖములు 4 భాగములు పిప్పళ్ళు 2 భాగములు వీటిని నీటియందు చాది లేపనముజేసిన తిమిరము నశించు. మఱియు కాంజికముతో లేపనముజేసిన అర్బుదము నశించు. తేనెతో లేపనముజేసిన కంటికురుపులు నశించు. స్తన్యముతో లేపనముజేసిన నేత్రరోగములు నశించు.

## కర్ణశూల చికిత్స.

శ్లో॥ కపిలా మాతులుంగామ్ల శృఙ్గబేర రసశ్శుభః ।
సుఖోష్ణః పూరయేత్కోష్ణః కర్ణశూలో పశాంతయే ॥

తా॥ కపిల (రేణుకగంధ్యము) మాదీఫలరసము నిమ్మపండ్లరసము అల్లపురసము వీటినివెచ్చజేసి సుఖోష్ణముగ చెవులయందువైచిన కర్ణశూలతొలగు.

## కర్ణవేధ చికిత్స.

శ్లో॥ అర్కస్యపత్రం పరిణామపీతం తైలేనలిప్తంస శిఖాగ్నితప్తం ।
ఆపీడ్యతోయంశ్రవణేనషిక్తం వినర్హరేదై ర్బహువేదనాంచ ॥

తా॥ పండిరాలిన జిల్లేడాకుల తైలము లేపనముచేసి అగ్నియందుకాచి దాని రసమును చెవులయందువైచిన కర్ణవేధ తొలగు.

## అన్యచ్చ.

శ్లో॥ ఘృష్టంరసాంజనంనార్యాఃక్షీరేణక్షౌద్రసంయుతం ।
ప్రశస్యతేశిరోరోగేస్రావేవాపూతికర్ణకే ॥

తా॥ స్తన్యమునందు రసాంజనమునుచాది అందు తేనెవైచి చెవులయందువైచిన కర్ణశూల శిరస్సుయందు లేపనముచేసిన శిరోవ్యధ ముక్కుయందువైచిన రక్తస్రావము ఇవి మానును.

## శోషరోగ హర ఘృతము.

శ్లో॥ యష్ట్యాహ్వాపిప్పలీలోధ్రపద్మకోత్పలచందనైః ।
తాళీసశారిబాభ్యాంచసాధితంశోషజిద్ఘృతమ్ ॥

తా॥ యష్టిమధుకము పిప్పళ్ళు లొద్దుగు పద్మకము కల్లకలువ చందనము తాళిసపత్రి సుగంధిపాల వీటిని కల్కముజేసి ఘృతపక్వముగ పాకముజేసి బాలురకిప్పించిన వారికి శోషరోగము పలాయనంబగు.

## శృంగ్యాది ఘృతము.

శ్లో॥ శృంగీమధూళికాభార్గీపిప్పలీదేవదారుభిః ।
అశ్వగంధాద్వికాకోళీరాస్నర్షభకజీవకైః ॥
సూపపర్ణీవిడంగైశ్చకల్కైస్సాధితంఘృతమ్ ।
శశోత్తమాంగనిర్యూహేశుష్యతఃపుష్టికృద్ఘృతమ్ ॥

తా॥ కుందేలుతలను నీళ్లయందువైచి కషాయముకాచి దానిలో కర్కాటకశృంగి చాగ గంటుభారంగి పిప్పళ్లు దేవదారు పెన్నేరుగడ్డ కాకోళి క్షీరకాకోళి సన్నరాష్ట్రము జీవకము ఋషభము కారుపెసలు వాయువిడంగములు వీటిని సమముగ గ్రహించి కల్కముజేసికలిపి అందు 1 ప్రస్థము ఆవునెయ్యిబోసి విధిప్రకారము పాకముజేసి చిక్కిపోవుచున్న బాలురకుయిచ్చిన శరీరమునకు విశేషపుష్టిని గలుగజేయును.

శ్లో॥ గుణాంబుధిర్వేంకటదాసనామా ।
ప్రాసూతిసూనుం జయకృష్ణదాసం ।
బ్రువంతియం వైద్య విదాంవరిష్ఠం ।
శ్రీకృష్ణభక్తం సుజనైకదాసం ॥

శ్లో॥ వాగ్భటమిశ్ర కృదాత్రిగంధా నవలోక్యవైద్య జనతుష్టైః ।
ఆశ్వాసత్రితయయుతోయంగ్రంథఃప్రోక్తోమయావిచిత్రతరం ॥

ఇతి శ్రీ వేంకటదాసాత్మజ జయకృష్ణదాసకృతౌ
చికిత్సారత్నే - తృతీయాశ్వాసః
గ్రంథశ్చ సమాప్తః.

# శ్రీరస్తు.

## సంస్కృత గ్రంథములు.

### వైద్యము.

| | రూ. | అ. |
|---|---|---|
| వైద్యచింతామణి 2 వాల్యములు తె, తా॥ గ్లేసుకాగితముల పై అచ్చొత్తించి కలికోమీదుగ ప్రింటిచేసి తయారుచేయబడిన మేలుప్రతి | 10 | 0 |
| బసవరాజీయము తె, తా॥ మేలు ప్రతి కలికో బైండు | 7 | 0 |
| అష్టాంగహృదయము, వాగ్భటము సూత్రస్థానము తె, తా॥ | 6 | 0 |
| ,, చికిత్స్థానం ప్రత్యేకముగా అచ్చగుచున్నది. | 6 | 0 |
| అశ్వవైద్యశాస్త్రము | 2 | 8 |
| అనుపానమంజరి | 0 | 8 |
| అనుపానరత్నాకరము సాదాప్రతి | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| సద్వైద్యజీవనము అను లోలంబరాజీయము | 0 | 8 |
| చికిత్సారత్నము | 1 | 4 |
| చికిత్సాసారము | 2 | 8 |
| మానవధర్మ చంద్రిక | 2 | 0 |
| మాధవ నిదానము | 2 | 8 |
| షర్బత్తుపాకావళి | 0 | 8 |
| సుశ్రుతశారీరస్థానము ప్రాచీనము | 2 | 8 |
| శారఙ్గధర సంహిత | 3 | 0 |

| | రూ. | అ. |
|---|---|---|
| వైద్యామృతము | 1 | 4 |
| సర్వౌషధి గుణకల్పకము | 2 | 8 |
| వాజీకరణకల్పద్రుమము | 1 | 8 |
| కాలజ్ఞానము | 0 | 4 |
| ధన్వంతరి నిఘంటువు | 2 | 8 |
| గుణపాఠము తె, తా॥ సాదాప్రతి | 2 | 8 |
| ,, మేలుప్రతి | 3 | 0 |
| నాడీనక్షత్రమాల | 0 | 4 |
| నాడీజ్ఞానము | 0 | 3 |
| నాడీ నిదానము | 0 | 4 |
| నాడీవిజ్ఞానము | 0 | 4 |
| షడ్రసనిఘంటువు | 0 | 8 |
| వైద్యశతశ్లోకి మేలుప్రతి | 0 | 6 |
| వ్యాసప్రోక్త వైద్యము | 1 | 8 |
| అగస్త్యప్రోక్త వైద్యము | 1 | 8 |
| వశిష్టప్రోక్తవైద్యము | 1 | 8 |
| గదనిగ్రహము సోఢలకృతం | 2 | 8 |
| కుమారతంత్రము రావణకృతము | 0 | 6 |
| భేషజకల్పము | 0 | 6 |
| చక్రదత్త | 3 | 12 |
| రాజమార్తాండము | 0 | 10 |
| అజీర్ణమంజరి | 0 | 4 |
| విషవైద్య చింతామణి | 2 | 0 |
| రసయోగ రత్నాకరం | 0 | 12 |
| బృహద్వైద్య రత్నాకరం | 2 | 8 |

| | రూ. | అ. |
|---|---|---|
| వృక్షాయుర్వేదము | 0 | 4 |
| టీకాచెట్లవైద్యము | 0 | 2 |
| అనుపానతరంగిణి తె, తా॥ | 0 | 12 |
| డిటో మేలుప్రతి | 1 | 0 |
| ధన్వంతరివిజయము | 0 | 8 |
| నేత్రదర్పణము | 0 | 8 |
| వ్రణచికిత్స | 0 | 8 |
| దంతశోధని | 0 | 6 |
| వైద్యప్రస్తారము | 0 | 8 |
| ఆరోగ్యదర్పణము | 0 | 4 |

## 2 జ్యోతిషము.

| | రూ. | అ. |
|---|---|---|
| సర్వార్థచింతామణి తె, తా॥ | 2 | 0 |
| ముహూర్తమార్తాండం ,, | 2 | 0 |
| కాలామృతం సటీక సాదాప్రతి | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 4 |
| నక్షత్రచూడామణి సాదాప్రతి | 0 | 3 |
| డిటో మేలుప్రతి | 0 | 6 |
| సంతానదీపిక తాత్పర్యం | 0 | 8 |
| అహోబిలనాడీయం, సటీక | 0 | 12 |
| ఫలదీపిక తాత్పర్యం | 0 | 8 |
| సాముద్రిక శాస్త్రము, సటీక | 0 | 4 |
| అష్టకవర్గ సాంధ్రతాత్పర్యము | 0 | 6 |
| ఛప్పన్నము ప్రశ్నశాస్త్రము | 0 | 6 |
| జ్యోతిషార్ణవ నవనీతము | 2 | 0 |
| శతయోగమంజరి తా॥ | 0 | 4 |
| స్వరశాస్త్రం తా॥ | 1 | 8 |
| రెట్టమతము ప, కా॥ | 0 | 4 |
| ,, తె, తా॥ | 0 | 12 |
| యవనజాతకము తాత్పర్యం | 0 | 8 |
| జాతకాలంకారము తా॥ | 0 | 8 |
| జాతకచంద్రిక మేలుప్రతి | 0 | 8 |
| ముహూర్తదర్పణం సాదాప్రతి | 0 | 5 |
| ,, మేలుప్రతి | 0 | 10 |
| ,, అత్యుత్తమప్రతి | 0 | 14 |
| సస్యానందము తె, తా॥ | 0 | 12 |
| వేములవాడ భీమకవిపద్యకావ్యం | 2 | 0 |
| బృహజ్జాతకము సటీక మంచి ప్రతి | 0 | 14 |
| పుష్పబంధము వర్ణాది ప్రదర్శిని | 0 | 6 |
| భీమకవీశ్వరజ్యోతిషామృతసారం | 1 | 0 |
| ఆరూఢరత్న సిద్ధాంజనము, తె॥ తా॥ నూతనకూర్పు సాదాప్రతి | 0 | 8 |
| డిటో మేలుప్రతి | 0 | 10 |
| జ్యోతిష ఫలప్రదీపిక | 1 | 0 |
| లఘుతాజకము సాంధ్రతాత్పర్యం | 0 | 12 |
| లఘుజాతకము టీకా॥ | 0 | 12 |
| చమత్కారచింతామణి | 0 | 8 |
| వృష్టపరాశరము | 0 | 12 |
| స్త్రీజాతకము | 0 | 8 |
| జలార్గళశాస్త్రం | 0 | 4 |

## ఆంధ్ర గ్రంథములు.

| | రూ. | అ. |
|---|---|---|
| భక్తిజయము కోయిల్ ధనాల దేవరాజు విరచితము | 5 | 0 |
| తెనుగు సమస్యలు చక్కానికూర్పు | 0 | 2 |
| భాస్కరరామాయణము చక్కాని కూర్పు అత్యుత్తమప్రతి | 4 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ధాసారణ ప్రతి | 0 | 12 |
| ఉత్తరరామాయణము కంకంటి పాపరాజ ప్రణీతము చక్కాని కూర్పు కాకికోదండు | 2 | 4 |
| రంగనాథరామాయణము ద్విపద చక్కాని క్రొత్తకూర్పు | 3 | 8 |

| | రూ. | అ. |
|---|---|---|
| గోపీనాథరామాయణము 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము కవనము మిక్కిలి సొంపు టీక అతివిపులము | 5 | 8 |
| మొల్లరామాయణము చిన్నసైజున పెద్దక్షరములతో ముద్రితము | 0 | 10 |
| అచ్చ తెనుగురామాయణము | | |
| శుద్ధప్రతి | 1 | 4 |
| మార్కండేయ పురాణము మారన కృతము | 1 | 12 |
| కవికర్ణ రసాయనము మాంధాత చరిత్రము | 1 | 8 |
| డిటో మేలుప్రతి కాలికో బైండు | 1 | 14 |
| వేంకటాచల మాహాత్మ్యము తరిగొండ వెంకమ్మది చక్కని కూర్పు | 1 | 0 |
| డిటో కాలికో బైండు | 1 | 6 |
| సీతారామాంజనేయ సంవాదము సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక వివరణము మిక్కిలి విపులము. ఈ వఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగ నున్నది. సాధారణప్రతి | 2 | 8 |
| డిటో మేలుప్రతి కాలికో బైండు | 3 | 8 |
| జైమినిభారతము అశ్వమేధ పర్వము | 1 | 0 |
| వైశ్యపురాణము | 1 | 4 |
| వేమనపద్యములు చక్కనికూర్పు | 0 | 6 |
| డిటో (3060) ఆంధ్రతాత్పర్యముతో | 3 | 8 |
| సుమతీశతకము సటీక | 0 | 3 |
| కుమారీశతకము | 0 | 3 |
| భాస్కరశతకము | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | 0 | 2 |
| నృసింహశతకము | 0 | 3 |
| కోటిలింగశతకము | 0 | 3 |
| లావణ్యశతకము | 0 | 4 |
| కృష్ణశతకము | 0 | 2 |
| నారాయణశతకము | 0 | 2 |
| రామరాఘవశతకము | 0 | 2 |
| రామరాయశతకము | 0 | 2 |
| రామతారకశతకము | 0 | 4 |
| భద్రాద్రిరామశతకము పావులూరి మల్లన కృతము | 0 | 2 |
| ఒంటిమిట్ట రఘువీరశతకము | 0 | 4 |

---

పిడుగు - వెంకటకృష్ణారావు పంతులు

ప్రింటర్, పబ్లిషర్, అండు బుక్కుసెల్లరు.

2/40, పెద్దనాయుని వీధి.

మదరాసు.